# ఉత్తరరామచరితనాటకము

Uttra Rama Charita Natakam

వేదము వేంకటరాయశాస్త్రిగారిచే

భవభూతి నాటకముబడి

ఆంధ్రమున విరచితము

ఐదవ ముద్రణము



ప్రకాశకులు

వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్

4, మల్లికేశ్వరస్వామిగుడిసందు, లింగిసెట్టివీధి, మద్రాసు - 1

 రు. 5 - 00

# విజ్ఞప్తి

ఈ చిన్నపొత్తమును నేను భవభూతికృతమైన యుత్తరరామచరిత నాటకమున కనువాదముగా రచించియుంటను మన్మిత్రులును కావలి వాస్తవ్యులు నైన శ్రీయుత దొడ్లా వేంకటరామరెడ్డిగారి వలన విని తత్ప్రియబాంధవులు కావ్యనాటకాలంకారాదిసాహిత్యరసజ్ఞులు నెల్లూరు జిల్లాలోని యల్లూరుగ్రామన్యాయాధికారులు ''నివేశః శైలానాం తదిద మితి బుద్ధిం ద్రఢయతి'' అని వర్ణనీయులయిన కుటుంబులలో నన్యతములు విద్యాదోర్భాగ్యభాగధేయులు

శ్రీయుత పొణకా పీరారెడ్డిగారు

సత్ప్రకటనకు వలయు సర్వోపకరణంబును నాకొసంగి మదీయ గ్రంథకరణారంభమును సఫలీకరించినారు.

నేను దీనికి తొలుత ఉపోద్ఘాతము వ్రాయ నుద్యమింపకయుంటిని. దానిని వారి ప్రేరణచేత పిమ్మట వ్రాసితిని. అత్యంత కృతజ్ఞుండనై వారియందు ఎప్పటికిని నిజసంపూర్ణకటాక్షముం బొలయించుచుందురు గాక యని లక్ష్మీసరస్వతులను వేడుచున్నాను

మ. కలవే పల్కఁగ నేల? తెలియవె వక్కాణింతుఁ బాణాఖ్యవం
శలలామంబగు పీరరెడ్డికిఁ గరాబ్జాతంబునం దిచ్చుచోఁ
గలలో నైనియు లేరురా నరా! మరే! కాపట్యమున్నట్టి దదీ
యులలో నైనను లేమురా! కటువచస్సాహల్కుడర్క రాదురా.

మదరాసు,
15-6-2[illegible]

150025

వేదము వేంకటరాయశాస్త్రి

# చతుర్థముద్రణ విజ్ఞప్తి

శ్రీ తాతగారి యీ యాంధ్రానువాదమునకు ఇది నాలవ ముద్రణము. ఇటీవల, 1965లో, దీని సంస్కృత మూలమును ఆంధ్రవ్యాఖ్యతో ఉపోద్ఘాతముతోను, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారి పోషకత్వమున ప్రకటించుచు, తాతగారి శిష్యులు, నా కుపాధ్యాయులు, శ్రీమాన్ వేలటూరి రామదాసయ్యంగారు ఇట్లు ఉపక్రమించినారు—'...నేను మా సాహిత్య గురువు కవిసమ్రాడ్చక్రవర్తి శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిలవారి వద్ద నేర్చుకొన్నదానిని యథామతి ఒక గ్రంథమున పొందుపఱుపఁగోరినవాఁడనై ..ఎల్లో నాగచేర్చితిని. శ్రీ శాస్త్రిలవారి బోధనము విలక్షణమగుటవలన అందేమేని ఎందేని విశేషమున్న దానిని ఇందు సమకూర్చుటయు కలుగునని తలంతును. సాధుపాఠ నిర్ణయమునకు సముచితార్థ వివేకమునకును శ్రీ శాస్త్రిలవారి యాంధ్రానువాదము నాకు మార్గదర్శకము, విస్మృతిస్మారకము. శ్రీ శాస్త్రిలవారి గీర్వాణ నాటకాంధ్రానువాదములు తెలుఁగున రసవత్తమ నాటకము లగుటయేకాక, ఒక తెలుఁగున ఆ యా నాటకములకు రసికులకు దారితప్పనీని వ్యాఖ్యలును అగునని నిజమతము...' అని. శ్రీ అయ్యంగారి వ్యాఖ్యయు ఉపోద్ఘాతమును భవభూతిమూలమునకేగాక శ్రీ తాతగారి అనువాదమునకును టీకకును కూడ వ్యాఖ్యాప్రాయములు. వీరి రచనచే తాతగారి యభిప్రాయములు సుబోధములై హృదయంగమము లగుచున్నవి. శ్రీ అయ్యంగారు హెచ్చరించిన సాధుపాఠ నిర్ణయము, భవభూతి నాటక నిర్మాణ ప్రతిభాదిక పెతికా విషయములును, తాతగారి యభిప్రాయములును వారి వ్యాఖ్య నుండి ఆయా ప్రకరణోచిత విధానములతో గ్రహించిననే స్వారస్యము గాన జిజ్ఞాసువులు దానిని తిలకింతురుగాక. ఇచ్చట లఘువుగా విద్యార్థుల యుపయోగార్థము భవభూతి మహాకవియొక్క జీవితచరిత్రముం గూర్చి వెలువడిన నూతనాంశములను వ్రాయ నుత్సహించుచున్నాను.

## భవభూతికవి చరిత్ర

తాతగారి యభిప్రాయముల నుదాహరించి, ఈతని పేరు శ్రీకంఠుఁడా, భవభూతియా యని చర్చించి "శ్రీశాస్త్రిలవారు...'భట్ట శ్రీకంఠుఁడను పేరివాఁడు. భవభూతి యని వ్యవహృతుఁడు' అన్నారు. 'భట్టగోపాల' 'మహాకవులు' ఎడమగు తరములవారు. నాయన 'నీలకంఠము' ప్రక్కనుండి 'నీలకంఠము' నే పేరుగా ఆకర్షించెను." అని తేల్చినారు. పద్మపుర మేదియో ఉనురలేము గాని కాలప్రియ

నాథుఁడు దొరకినాఁడు. ఉజ్జయినీ మహాకాళుఁడుగాఁడు. యమునదరిని కాలప్రియ నగరమును కాలప్రియనాథుని దేవాలయమును గలవు. కాలప్రియము ఒకయూరి పేరనియు గాధిపురమునకు దక్షిణమున కలదనియు రాజశేఖరుని కావ్యమీమాంస లోని 'యో గాధిపురస్య దక్షిణతః సకాలప్రియస్య ఉత్తరతః' ఇత్యాదిచే తెలియుచున్నది. గాధిపురము కన్యాకుబ్జమునకు నామాంతరము. దీనికి సమీపమున నేటికిని 'కాల్పి' యను నగరము కాలప్రియనాథుని దేవాలయమును గలవు. ఇదియే భవభూతిచే ప్రస్తావింపఁబడినదని చరిత్రకారులు తేల్చినారు. "'కాల్పి' 'కాలప్రియము' భవభూతికి ఆశ్రయుఁడైన యశోవర్మకు రాజధాని యగు కాన్యకుబ్జమునకు—గాధిపురమునకు సమీపమున నుండుటయు, అందలి కాలప్రియనాథాలయమున యా(జా)త్ర జరుగుటయు, ఆ మహాజన సమావేశావసరమున భవభూతి తన నాటకములం బ్రయోగించుటయు సమంజసముగానే యున్నది." అని చరిత్రకారనిర్ణయము నంగీకరించుచు శ్రీ అయ్యంగారు, ఈ నాటకములలో రాజుపేరు లేనందున 'ప్రజాదరమునం బ్రయుక్తములని ఊహింపఁదగియున్నది' అని హెచ్చరించినారు.

నిజమే. రాజు యశోవర్మ ప్రభుమాత్రుఁడుగాఁడు; స్వయము రామాభ్యుదయనాటకకర్త. పలువురు పండితుల కాశ్రయుఁడు. మఱి ఈ మూఁడు నాటకములలో భవభూతి తన పోషకుని స్మరింపమికి కారణము నాటి కీతఁడు కాలప్రియమున నుండినను కన్యాకుబ్జమును చేరలేదని తలంపవలయును. ఈ రెండు నగరములకును నడుమ దాదాఁపు వందమైళ్లు దూరమున్నది. ఈ యశోవర్మకే ఆశ్రితుఁడైన వాక్పతిరాజకవి యశోవర్మ కీర్తి ప్రఖ్యాపనకై వ్రాసిన 'గౌడవహో' యను ప్రాకృతకావ్యమున తాను భవభూతి శిష్యుఁడనని చెప్పుకొన్నందున ఈ నాటకత్రయ రచనానంతరమే యాతఁడును భవభూతికి శిష్యుఁడై అతనిని యశోవర్మ కడకు చేర్చి యుండవలయును. గౌడవధము అసంపూర్ణమై నిలిచినందునను రాజతరంగిణిలో, కాశ్మీర లలితాదిత్యునివలన యశోవర్మ ఓడిపోయినట్లుండుట చేతను, నాటకరచనాదులచేత భవభూతిప్రసిద్ధి విని వాక్పతిరాజు శిష్యుఁడు కాఁగా యశోవర్మ పోషకుఁడై ఆదరించెనని తలంపవలయును. వాక్పతిరాజు శ్రీకంఠపండితుఁడనక భవభూతి యనుటచేత మొదటి పేరు శ్రీకంఠుఁడనియే నిశ్చయము. కాని వాక్పతిరాజు భవభూతికి దక్షిణాపథముననే గోదావరీతీరమున లక్ష్మణావతి యనుచోట పరిచితుఁడైనట్లును అచ్చటి రాజును యశోవర్మ జయించినందున ఇరువురును కన్యాకుబ్జమునకు వచ్చినట్లును కథలు గలవు. పరిశోధింపవలయును.

భవభూతి యూరు కాలప్రియము గాదు. తనది పద్మపుర మన్నాఁడు. అదేదో తెలియక పోయినను ఈతఁడు మొత్తము మీఁద దక్షిణాపథమువాఁడని

మాత్రము పండిత నిర్ణయము. వీరారు ప్రాంతమన్నందున తాత గారు 'భవభూతి మహారాష్ట్రుఁడో, అందును వెలనాటియో తెలగాణ్యుఁడోయని సందేహము కలుగుచున్నది' అని వ్రాసినారు. నిజమే. మిగిలినవి తెలియదుగాని ఆంధ్రుఁడని మాత్రము నేను గట్టిగా చెప్పగలను. ఉపపత్తులు — భవభూతికి శ్రీకంఠ నామధేయమేగాక ఉంబేకాచార్య నామధేయము కూడ కలదు. ఈ పేరున నితఁడు కుమారిలభట్టాచార్యుల శిష్యుఁడు. 'శ్రీకుమారిలస్వామి ప్రసాదప్రాప్త వాగ్వైభవ శ్రీమదుమ్బేకాచార్య విరచితే మాలతీమాధవే షష్ఠోఽఙ్కః'. 'ఇతి శ్రీ భట్టకుమారిల శిష్యకృతే మాలతీమాధవే తృతీయోఽఙ్కః' 'ఇతి శ్రీ మద్భవభూతి విరచిత...దశమోంకః' అని ఇట్లు తాళపత్రప్రతులలో దొరకియున్నవి గదా. 'ఉంబేకోభవభూతిః' అనియున్నది. కుమారిలుని శ్లోకవార్తిక వ్యాఖ్యయందు ఉంబేకుఁడే 'యేనామకేచిదిహనః'అన్న మాలతీమాధవశ్లోకమును తనదిగా వ్రాసికొనియుండుట గట్టిసాక్ష్యము. దీనివలన ఇంకను ఆశ్చర్యకరమైన విషయములు తెలియుచున్నవి. కుమారిలభట్టాచార్య శిష్యుఁడు మండనమిశ్ర విశ్వరూపాచార్య నామధేయుఁడు శంకరాచార్యులతో వాదించి ఓడిపోయి సన్న్యసించి సురేశ్వరాచార్యుఁడై శృంగేరి పీఠాధిపతియైనట్లు ప్రసిద్ధము. ఈ ఉంబేకులు భిన్నులైయుందురా? ఉండరు. కొందఱు సంశయించిరి. మాధవ శంకర విజయమందు ఉంబెక విశ్వరూప మండనమిశ్ర సురేశ్వరులొక్కరేయని గలదు. (VII—113, 116)

"అయంచ పన్థా యది తే ప్రకాశః
సుధీశ్వరో మండనమిశ్రనామా
దిగన్త విశ్రాన్త యశో విజేయో
యస్మిఞ్జితే సర్వ మిదం జితం స్యాత్ ॥ ౧౧౩

సదావదఞ్ యోగపథం చ సాంప్రతం
సవిశ్వరూపః ప్రథితో మహీతలే।
మహాగృహీ వైదికమార్గ తత్పరః
ప్రవృత్తిశాస్త్రే నిరతః సుకర్మతః ॥ ౧౧౪

నివృత్తి శాస్త్రే న కృతాదరః స్వయం
కేనాప్యుపాయేన వశే సనీయతామ్
వశంగతే తత్ర భవేన్మనోరథః
తదన్తికం గచ్ఛతు మాచిరం భవాఞ్ ॥ ౧౧౫

ఉంబేక ఇత్యభిహితస్య హి తస్యలోకై
రుంబేతి బాన్ధవజనై రభిధీయమానమ్
హేతోః కుతశ్చిదిహ వాక్ సురసాభిశప్తా
దుర్వాససాజని విధూర్ద్వయ ఘారతీతి." ౧౧౬

దీనివలన ఒక రహస్యము వెలువడుచున్నది, ఉంబాభర్త (ఉభయభారతి భర్త) గాన వరిఁడు ఉంబేకుఁడాయెను. కాని నాటకములలో నీతఁడు తన గురువుగా జ్ఞాననిధిని పేర్కొన్నాఁడు. ఈ పేరును బట్టి ఈ గురువు వేదాంతిగా నుండు నని పెద్దల యభిప్రాయము. అగుచేని ఇది కుమారిలునికి నామాంతరము కానేరదు. మఱి కుమారిలునికిని జ్ఞాననిధికిని కూడ శిష్యుఁడా? ఏదిముందు, ఏది వెనుక ? నాటక రచనాకాలమున కుమారిలుని శిష్యుఁడేని దానిని ప్రస్తావనలో చెప్పక గ్రంథాంత గద్యలోను, అందును ఒకదానిలో నున్నట్లు ఇంకొకదాన లేక వివిధములుగా నేల వ్రాయును ? కాన తాతగారు వ్రాసినట్లు 'ఈ గురువుం (కుమారిలుం) జేరుట నాటకత్రయ రచనానంతరము కావలయును'. మఱి శ్రీ అయ్యంగారు తమ పీఠిక యందు 'మీమాంసకతయే ముందనియు, తరువాత వేదాంతిత యనియు, తన నాటకరచనకు దానితో విరోధము లేదని యాతని మతమనియు నూహింపఁదగును' అని వ్రాసినారు. ఇదియు సమంజసముగానే తోఁచుచున్నది. పై రెంటికిని సమ న్వయమిట్లు కుదురుచున్నది. కుమారిలునికి మండనమిశ్రుఁడు చెల్లెలి భర్త, 'మద్భగినీభర్తా మండనమిశ్రః' అని కలదు. అంతటి సన్నిహితుఁడు శిష్యుఁడు కాకుండు టెట్లు? బాంధవ్యము శిష్యత్వమునకో శిష్యత్వము బాంధవ్యమునకో దారితీసి యుండవలయును. అట్లుండినచో నాటకములలోని జ్ఞాననిధి యెవఁడు? కుమారిలుఁడేల లేఁడు? జ్ఞాననిధి వేదాంతియని పేరునుబట్టియు 'యథార్థనామా భగవాన్' అనుటను బట్టియు వేదాంతి యని, ఊహయే గదా. బాల్యగురువై యుండవచ్చును. లేదా వేదాంతియగునేని, కుమారిలుని చరిత్రను బట్టి ఆయన పెద్ద వాఁడై పూర్వమీమాంసావాదమును లేవనెత్తి, దేశాటనాదికములు చేసి దేశ మందు వ్యాపించియుండిన జైనమతమును అణఁచుటకు కాలము పట్టియుండును. తొలుత అందఱును వైదికులే. కుమారిలుఁడు జైన విద్యార్థివేషమున సంచరించి గదా జైనమత రహస్యములను గ్రహించెను. తొలుత బంధువులై అంధులై యుండినవారు విడిపోయినారు. మగల నాటకత్రయ రచనానంతరము కలసికొని నారు. ఈ మధ్యకాలమున జ్ఞాననిధి తటస్థపడినాఁడు. భవభూతికి పూర్వ మీమాంసావాదము నచ్చినది. శిష్యుఁడైనాఁడు. తర్వాతి వ్రాఁతప్రతులలో గద్యలు

వ్రాసిన శిష్యులు వివిధములుగా వ్రాసినారు.—అని యిట్లు సమన్వయము చేయవచ్చును. శంకర విజయములన్నియు ఉంబేకుఁడు మీమాంసకుఁడనియే కదా పలుకుచున్నవి. ఐనను జ్ఞాననిధిం గూర్చి మన చారిత్రకజ్ఞాన మత్యల్పము. భావి పరిశోధనవలన ఏమైన తెలియవచ్చును.

ఇదంతయు చూడఁగా భవభూతి ఆంధ్రుఁడై యుండి, శ్రీకంఠనామధారియై, కుమారిలుని చెల్లెలిని పెండ్లియై ఉంబేకాచార్యుఁడై, తర్వాత ఆంధ్రదేశమును వదలి క్రమముగా కాలప్రియమును చేరి, నడుమ ఎచ్చటనో జ్ఞాననిధికి శిష్యుఁడై, నాటకరచయితయు ప్రయోక్తయునై, ఆదర్శగృహస్థుఁడై, సీతారాముల పవిత్రప్రేమవంటి ప్రేమతో (అద్వైతం సుఖదుఃఖయో రనుగతం) భార్యతో జీవితముగడపి, మరల కుమారిలుని ప్రభావమున ఆయన ప్రచారమునకు తోడ్పడి, వ్యాఖ్యలు వ్రాసి, ఇంతలో శంకరాచార్యుని ప్రభావమున వేదాంతియై సన్న్యసించి సురేశ్వరాచార్యుఁడై, శంకరునికన్న ముందే పీఠాధిపతియై చిరకాలముండినట్లు తోఁచుచున్నది. ఈయన, వాక్పతిరాజాదులు శిష్యులైన యనంతరము యశోవర్మ యాస్థానము నలంకరించియుండి, ఆ యశోవర్మ లలితాదిత్యునిచే పరాజితుఁడైన వెనుక కొంతకాలము కాశ్మీరమందుండి తర్వాతనే మాహిష్మతికి వచ్చియుండును. కుమారిలునికి ప్రచారార్థము ఈతని సాయ మపేక్షితము: అట్లే శంకరునికి ఈతఁడే కావలసివచ్చెను. 'యస్మిన్ జితే సర్వమిదం జితంస్యాత్' అంతటి మహానీయుఁడు! దీనికి సరిపడునట్లుగా ఉంబేకుని శ్లోకవార్తికవ్యాఖ్య వనవాదముతో నిలిచి పోఁగా దానిని కుమారిలుని కుమారుఁడు జయమిశ్రుఁడు పూరించినాఁడు.

శంకరాచార్యులు స్థాపించిన మఠములు నాలుగని కొన్ని గ్రంథములును, కాంచికామకోటితో ఐదని కొన్ని ఆకరములును తెలుపుచున్నవి. కాని అన్నిటికిని ఆదిశంకరుఁడే గాక సురేశ్వరాచార్యుఁడును ఆదిగురువుగా కనఁబడుచున్నాఁడు. ఇందులకు కారణమును పండితులు ఇట్లు తెలిపినారు. ఈతఁడు శంకరమత ప్రఖ్యాపనకై ఏర్పాటైన యన్ని మఠములకును పోవుచు వ్యవస్థాపకుఁడై ధర్మపరిపాలనము నందే భారతదేశ మంతయు సంచరించుచు నుండియుండును అని. ఇదంతయు చూడఁగా—ఎక్కడి భవభూతి! ఎక్కడి సురేశ్వరాచార్యుఁడు! ఎంత యాశ్చర్యకరమైన జీవితము—అని తోఁపకమానదు. పండితులు పరిశోధించిన ఎన్నెన్ని రహస్యములు వెలువడునో గదా!

## తారీఖులు

కాశ్మీర లలితాదిత్యుని పరిపాలనకాలము కొందఱు క్రీ. శ. 699-785 అనియు కొందఱు 696-727, 736-747 అనియు ఇంచుక ముందు వెనుకలుగా చరిత్రకారులు వ్రాసియున్నారు. అట్లే కుమారిలభట్టు కాలము 590-650 అనియు 706 అనియు. వీనిచే ఆదిశంకరుల కాలమును ఇదే. ఆయన కుమారిలుని జయించి తర్వాత ఉంబేకుని జయించినట్లు కొన్నిటను, కుమారిలుని ప్రాణోత్క్రమణ సమయమున చూచి, తర్వాత మాహిష్మతికి వచ్చి అచ్చట ఉంబేకుని జయించినట్లు ప్రాచీన శంకర విజయములును నుడువుటచే శంకరాచార్యులనాటికి భవభూతి మాహిష్మతియందుండెను. నాటికి యశోవర్మ గతించినాఁడు, భవభూత్యాదులు కన్యాకుబ్జమును వదలి, కాశ్మీరమును కూడ వదలి కొంతకాల మైయుండవలయును. కుమారిలుని నిర్యాణవార్త మండనమిశ్రుఁడు శంకరుని వలన వినెను. ఇదంతయు చూడఁగా శంకరభవభూతుల సమావేశ కాలము క్రీ. శ. ఎనిమిదవ శతాబ్ది నడిమికాలముగా కుదురుచున్నది. కొందఱు ఆదిశంకరులు క్రీస్తుకు పూర్వుఁడనుచున్నారుగాని భవభూతి యశోవర్మల కాలములతో అది సరిపడుట లేదు; అట్లే శృంగేరివారి పూర్వాచార్యపరంపరలో సురేశ్వరాచార్యులు 800 సంవత్సరములు జీవించియుండెననుటకూడ. క్రీ. శ. 750 ప్రాంతమన్నచో వీకష్టమును లేదు. చరిత్రదూరము కాదు. అట్లే సురేశ్వర నిర్యాణ కాలము క్రీ. శ. 772 అని శృంగేరి మఠగ్రంథ సాక్ష్యము మాత్రము చరిత్రకారులు నమ్మదగియున్నది.

మిగిలిన నాటకసాహిత్యవిషయములు శ్రీ తాతగారి పీఠికలోను శ్రీ అయ్యంగారి యుపోద్ఘాతమునను ఉండుటచే నిచట వ్రాయుట చర్విత చర్వణము.

1-12-67
మదరాసు-1

శాస్త్రి మనుమఁడు.

# ఉపోద్ఘాతము

## భవభూతి

### ౧ ఆతని గ్రంథములు

ఈకవి రచించినవి మూఁడు రూపకములు – మాలతీమాధవము మహావీరచరిత్రము, ఉత్తరరామచరిత్రము ననునవి ప్రసిద్ధములై యున్నవి. కావ్యసంగ్రహములలో గుణరత్న మని కతిపయ శ్లోకముల నీతిప్రబంధ మొకటి పత్రికచితముగా కనఁబడుచున్నది. ఈ గ్రంథములలో లేనివి కొన్ని శ్లోకములు ఈయనవిగా ఇతర విద్వాత్సంకలిత గ్రంథములలో ధృతములై యున్నవి. ఉదా.—

"నిరవద్యాని పద్యాని యద్యనాథస్య కా క్షతిః?
భిక్షుకాకక్షనిక్షిప్తః కి మిక్షు ర్నీరసో భవేత్?" — శార్ఙ్గధరసంహిత.

"అలిపటలై రనుయాతాం
సహృదయహృదయజ్వరం విలుమ్పన్తీమ్
మృగమదపరిమళలహరీం
సమీర కిం పామరేషు రే కిరసి?" — రసికజీవనము.

"కిం చన్ద్రమాః ప్రత్యుపకారలిప్సయా
కరోతి గోభిః కుముదావబోధనమ్?
స్వభావ ఏ వోన్నతచేతసా మయం,
పరోపకారవ్యసనం హి జీవితమ్."— — రసికజీవనము.

ఇందువలన నివి చాటుమాత్రములో కాక ఈయన రచించిన గ్రంథము లింక నేవేని కలవో యని సంశయము పొడముచున్నది.

### ౨ ఆతని జీవితవృత్తాంతములు

ఈతని యాభిజాత్యాది వృత్తాంతములు పై రూపకములవలన కొంచెము తెలియుచున్నవి:—"దక్షిణాపథమందు విదర్భదేశంబున పద్మపురమునందు ఉదుంబరు లను తెగ బ్రాహ్మణులు చరణగురు

వులు పంక్తిపావనులు ధృతవ్రతులు సోమపీథులు కలరు. భవభూతి ఆ తెగవాఁడు, కాశ్యపగోత్రుఁడు, కృష్ణయజుశ్శాఖాధ్యాయి ; మహాకవి యనుపేరి వాజపేయయాజికి అయిదవ తరమువాఁడు, భట్టగోపాలుని మనుమఁడు, జాతూ (జతు) కర్ణి, నీలకంఠుల పుత్త్రుఁడు, భట్టశ్రీకంఠుఁ డనుపేరివాఁడు, భవభూతి యని వ్యవహృతుఁడు.

విదర్భదేశ మనఁగా ఇప్పటిబీరారు (Berar) దేశమనియు, ఇప్పటికిని నాగపూరుసీమలో చాందా (లేక చంద్రపురము) అను నగరము సమీపమున ఉదుంబరులు నివసించిననాటి ప్రాంతమున మహారాష్ట్రులు (దేశస్థులు) త్రైలింగులు నగు తైత్తిరీయ బ్రాహ్మణులున్నారనియు, భండారకార పండితులు మాలతీమాధవ పీఠికయందు వ్రాసియున్నారు. ఆ వ్రాఁతంబట్టి చూడఁగా, భవభూతి మహారాష్ట్రుఁడో, ఆంధ్రుఁడో, అందును వెలనాటియో తెలగాణ్యుఁడో యని సందేహము కలుగుచున్నది.

ఈతనిరూపకముల ప్రస్తావనలలో సూత్రధారుఁడు కాలప్రియనాథుని యాత్రోత్సవమున తాను ఆయానాటకమును ఆడించినట్లు వచించుచున్నాఁడు. ఆ దేవుని క్షేత్రమైన యా నగర మేదో యిప్పటికి నిరూపితము కాలేదు. కాలప్రియనాథుఁ డనఁగా మహాకాళక్షేత్రవాసి యగుశంభు వని త్రిపురారిటీక. వీరరాఘవాచార్యటీకలో "కాలప్రియానాథస్య" అని పాఠంబును, కాలప్రియ యను పేరి యంబికకు పతి యని వివరణంబును, గన్పట్టుచున్నవి. మహాకాళక్షేత్ర మనఁగా ఉజ్జయిని, తద్వాసియే యిట వివక్షితుఁ డేని, ప్రసిద్ధమయిన మహాకాళనామమును ప్రయోగింపక కవి యీపేరేల ప్రయోగించును? కావున సూత్రధారుఁడు ఆరూపకముల నాడించిన నగరము* ఉజ్జయిని కాదని యెఱుకపడుచున్నది. మఱి భవభూతి

* ఇది నేటి 'కాల్పి' యను నగరము. చూ. ప్రకాశక విజ్ఞప్తి.

కన్యాకుబ్జ రాజసభ నలంకరించినవాఁడు గావున, కన్యాకుబ్జమందు కాళప్రియనాథాలయము ఉండెనేని సర్వమును సుఘటితమగును.

ఈ కవికి కన్యాకుబ్జరాజు యశోవర్మ—

"తపస్వీ కాం గతోఽవస్థా మితి స్మేరాననా వివ
గిరిజాయాః స్తనౌ వన్దే భవభూతిసితాననౌ."

అను నేతద్రచిత శ్లోకమును మెచ్చి "భవభూతి" యను వ్యవహార నామము నొసంగినట్లు ఐతిహ్య మని వీరరాఘవటీకలో నున్నది.

## 3 భవభూతి కాలము

ఈతని కాలమును చారిత్రాన్వేషులు కొంచెము డొంక తిరుగుడుగా నిర్ణయించియున్నారు. కాశ్మీర రాజుల చరిత్రమగు రాజతరంగిణియందు—

"కవి ర్వాక్పతిరాజశ్రీ భవభూత్యాదిసేవితః
జితో యయౌ యశోవర్మా తద్గుణస్తుతివన్దితామ్."

"సోఽభూ త్పంక్తి ర్యశోవర్మ లలితాదిత్యయో రితి
లిఖే త్కాలేఖనిర్దేశా దనర్ఘత్వం విద న్నృపిః."

అను నిత్యాదిగ్రంథమువలన కాశ్మీరరాజు లలితాదిత్యుఁడు యశోవర్మను జయించెనని తెలియవచ్చుచున్నది. ఆ జయము క్రీ. శ. 710-వ సంవత్సరమునకు కొంచెము ముందు జరిగినట్లు ఆ గ్రంథములవలననే యేర్పడుచున్నది. కావున భవభూతి అప్పటివాఁడని తలంచుట యొప్పును. 7-వ శతాబ్దివాఁడు బాణుఁడు హర్ష చరిత్ర పీఠికయందు పలువుర మహాకవులం బ్రస్తావించి భవభూతిని ప్రస్తావింపమియు, 8-వ శతాబ్దివాఁడు వామనుఁడు తన కావ్యాలంకారసూత్రవృత్తియందు భవభూతి నాటకము నుండి శ్లోకములు నుదాహరించుటయు, పూర్వోక్తభవభూతి కాలమునకు అనుకూలమే.

శంకరపాండురంగపండితులు ఎమ్. ఏ. గారు తమకు లభించిన మాలతీమాధవ (లిఖిత) పుస్తకములో, భవభూతి మీమాంసా

శాస్త్రప్రవర్తకులైన కుమారిలభట్టాచార్యుల శిష్యుఁడనియు, ఉంబే కాచార్యుఁడను నామాంతరముం బొంది యుండె ననియు, కొన్ని యంకములతుదను గద్యము లున్నవని తెలిపియున్నారు. ఈ గురువుం జేరుట నాటకత్రయరచనానంతరము కావలయును. కానిచో అందు ఏతద్గురుప్రస్తావము లేకపోవుటయు.

"గణై స్పతాం న మమ కో గుణః ప్రఖ్యాపితో భవేత్
యథార్థనామా భగవాన్ యస్య జ్ఞాననిధి ర్గురుః"

అని జ్ఞాననిధిప్రస్తావ ముండుటయు, అసంగత మగును. ఈయన కుమారిలభట్టు శిష్యుఁడయేని, ఆయనతో శ్రీశంకరాచార్యులవారు వాదము సేయవచ్చుటయు నిజమయేని, ఈయన శంకరసమకాలికుఁ డగును. అందువలన శంకరమతము అప్పుడప్పుడే తలయెత్తుచున్న కతంబునను, ఇంకను సుబోధము గానందునను, బౌద్ధపరివ్రాజికకు అత్యంతోత్కర్ష నొసంగునట్టి రూపకమును (మాలతీ మాధవమును) ఈతఁడు రచించుట సంగతపడును.

౪ అతని విద్యావిశేషములు

భవభూతి తాను పదవాక్య ప్రమాణాభిజ్ఞుం డనియు,

"య ద్వేదాధ్యయనం, త థోపనిషదాం యోగస్య సాంఖ్యస్య చ
జ్ఞానం, తత్కథనేన కిం న హి తతః కశ్చి ద్గుణో నాటకే;
య త్ప్రౌఢత్వ ముదారతా చ వచసాం, య చ్చార్థతో గౌరవమ్,
త చ్చే దస్తి తత స్త దేవ గమకం పాణ్డిత్యవైదగ్ధ్యయోః".

అని తాను వేద వేదాంత సాంఖ్య యోగ పారగుం డనియు దెలుపు కొన్నాఁడు.

ఈయన నీతివిద్యావిశారదుఁడు; అందులకు మాలతియందలి కామందకియు తన్నామము సైతమును, మహావీరచరిత్రయందలి మాల్యవన్మంత్రియు నిదర్శనములు. నీతివిద్యారహస్యములు భవభూతి యిట్లు వాక్రుచ్చినాఁడు.—

"బహి స్సర్వాకారప్రగుణరమణీయం వ్యవహరన్
పరాభ్యూహస్థానా న్యపి లఘుతరాణి స్థగయతి;
జనం విద్వా నేకః సకల మతిసంధాయ కపటైః,
తటస్థః స్వా నర్థాన్ ఘటయతి చ మౌనం చ భజతే".

ఇందులకు భూరివసువును లక్ష్యముగాఁ నిబంధించినాఁడు. మఱియు—

"శాస్త్రేషు నిష్ఠా, సహజశ్చ బోధః
ప్రాగల్భ్య, మభ్యస్తగుణా చ వాణీ
కాలానురోధః, ప్రతిభానవత్త్వమ్
ఏతే గుణాః కామదుఘాః క్రియాసు."

అని కార్యసాధకగుణములం జెప్పినాఁడు. అందులకు కామందకియే లక్ష్యము. ఈతని యోగసాంఖ్యవిద్యాప్రాగల్భ్యమును "మమ హి సంప్రతి......" అను మాధవ వాక్యంబును (మాలతి 5 అం), "అయి వత్స. కి మనయా ....." అను వసిష్ఠవాక్యంబును (మహావీర, 3 అం), సూచించుచున్నవి. శ్రౌతవిద్యాభినివేశమును "కః కోఽత్ర భోః...ఆఙ్గిరసః" అను (మ. వీ.) వాక్యము తెలుపుచున్నది.

"షడధికదశనాడీచక్రమధ్యస్థితాత్మా
హృది వినిహితరూపః సిద్ధిద స్తద్విదాం యః
అవిచలితమనోభి స్సాధకై ర్మృగ్యమాణః
స జయతి పరిణద్ధః శక్తిభిః శక్తినాథః"

"విష్వగ్వృత్తి ర్జటానాం ప్రచలతి నిబిడస్కన్ధనద్ధోఽపి భారః,
సంస్కారక్వాణపుష్టం పటు రటతి కృతావృత్తి ఖట్వాఙ్గఘణ్టా,
ఊర్ధ్వం ధూనోతి వాయు ర్వివృత శవశిరః శ్రేణికుఞ్జేషు గుఞ్జన్
ఉత్తాలః కిఙ్కిణీనా మనవరతరణత్కారహేతుః పతాకామ్."

ఇత్యాదివర్ణనలును, మహామాంసవిక్రయంబును, ఏతదీయ కాపాలికాద్యాగమజ్ఞానమును వెల్లడించుచున్నవి.

ఉ. రా. చరితలోని వివర్తశబ్దప్రయోగములచే నితని వేదాంతశాస్త్రజ్ఞానము గోచరించుచున్న దని కొందఱు తలంచిరి.

భవభూతి క్షత్త్రియబ్రహ్మచారి వర్ణనలో పైప్పలదండమును చెప్పినాఁడు. మనువు—

"బ్రాహ్మణో బైల్వపాలాశౌ, క్షత్త్రియో వటఖాదిరౌ,
పైలవౌదుమ్బరౌ వైశ్యో, దణ్డా నర్హన్తి ధర్మతః".

అని క్షత్త్రియునికి వటఖాదిరములం జెప్పినాఁడు. అట్లుండ, ఈ కవి యిట పైప్పలమును ( రావిని ) చెప్పుట యెట్లు? అన్నచో, "కృతే తు మానవా ధర్మా, స్త్రేతాయాం గౌతమాః స్మృతాః" అను స్మృతి ప్రమాణమువలన త్రేతాయుగమువారైన శ్రీరామాదులకు గౌతమ ధర్మములను చెప్పవలయును. గౌతములవారు "బైల్వపాలాశౌ బ్రాహ్మణస్య దణ్డౌ, అశ్వత్థ పైలవౌ శేషే." అని క్షత్త్రియునికి రావికోలం జెప్పినారు. ఈ సూక్ష్మభేదమును మెలఁకువతో నెలకొలిపినందున ఈతనికి ధర్మశాస్త్రమునం గల నిష్ఠ స్పష్టపడుచున్నది.

## ౫ ఇతని కవనప్రశస్తి

భోజమహారాజు సరస్వతీకంఠాభరణమందును, ధనికుఁడు దశరూప కావలోకమందును, క్షేమేంద్రుఁడు ఔచిత్యచర్చయందును, హేమచంద్రుఁడు కావ్యానుశాసనమందును, వామనుఁడు కావ్యాలంకారసూత్రవృత్తియందును, మమ్మటుఁడు కావ్యప్రకాశమందును, ఇతని నాటకముల నుండి బహుళముగా శ్లోకముల నుదాహరించుటచే నితనియందు వారికిం గల బహూకృతి తెలియుచున్నది.

ఇతర కవులును ఈయనను శ్లాఘించినవిధముం గనవచ్చును.—

"సుకవిద్వితయం జానే నిఖిలేఽపి మహీతలే—
భవభూతి శ్శుక శ్చైవ వాల్మీకి స్తు తృతీయకః." భోజప్రబంధ కాళిదాసోక్తి.

"అహో! మే సౌభాగ్యం; మమ చ భవభూతే శ్చ భణితీ
తులాయా మారోప్య ప్రతిఫలతి తస్యాం లఘిమని
గిరాం దేవీ సద్యః శ్రుతికలితకల్హారకలికా
మధూళీమాధుర్యం క్షిపతి పరిపూర్త్యై భగవతీ." భో. ప్ర. కాళిదాసు.

చా. భవభూతిజలధినిర్గత కావ్యామృతరసకణా ఇవ స్ఫురన్తి
యస్య విశేషా అద్యాపి వికటేషు కథానిబన్ధేషు.

అని భవభూతిశిష్య వాక్పతిరాజ కృతగౌడవధ మహాకావ్యము.

"బభూవ వల్మీకభవః పురా కవిః,
తతః ప్రపేదే భువి భర్తృమేణ్ఠతామ్,
స్థితః పున ర్యో భవభూతి రేఖయా
స వర్తతే సంప్రతి రాజశేఖరః." —రాజశే.

"ప్రాచేతసేన యా సీతా పాలితా భవభూతినా
సర్వత శ్చర్వ్యతే వాణీ సైవ వాద్య కవిమానిభిః." నీలకణ్ఠదీక్షితుఁడు.

"భవభూతికవే ర్వాచః స్వదన్తే రసరఞ్జితాః
సుమనోభ్యః సుధాస్యన్ది బన్ధమాధుర్యబన్ధురాః."

"భవభూతి మనాదృత్య నిర్వాణమతినా మయా
మురారి పదచిన్తాయా మిద మాధీయతే మనః"

(భవభూతిని చదివి, శాణుని ముగించి మురారిం దొడంగితి నని భా.)

"రత్నావళీపూర్వక మన్య దాస్తా
మసీమభోగస్య వచోమయస్య,
పయోధర స్యేవ హిమాద్రిజాయా
పరం విభూషా భవభూతిరేఖా."

## ఈ పై నాటకముల రచనాక్రమ మేమి?

నిర్దేశక్రమమే రచనాక్రమ మని తోఁచుచున్నది. ప్రాజ్ఞలొకరు వీరచరిత మొదటి దనియు, మాలతి రెండవ దనియు తలంచిరి. వీరచరితను లోకులు మెచ్చనందున ఆ కొఱంతను మాలతిలో—

"యే నామ కేచి దిహ నః ప్రథయ న్త్యవజ్ఞాం,
జానన్తి తే కి మపి, తాన్ ప్రతి నైష యత్నః;
ఉత్పత్స్యతేఽస్తి మమ కోఽపి సమానధర్మా,
కాలో హ్యయం నిరవధి, ర్విపులా చ పృథ్వీ."

అను శ్లోకముచేఁ దెలుపుకొన్నాఁ డనియు ఉపపత్తి చెప్పిరి. నామత మది కాదు. ఈకవికి రూపకోచితపాత్రరచనా ఫక్కిక మాలతిలో కుదురుపడలేదు. అది వీరచరితములో కుదురుకొన్నది. ఇందులకు మాలతీతృతీయ సప్తమాంకములలో లవంగికా మదయంతి కలు కావించిన ద్రాఘిష్ఠోపన్యాసములే చాలిన నిదర్శనములు. ఇట్టి నిడుద పాత్యములు కడమ రెంటను లేవు. ఇది గాక మాలతిలో కవి తన పెద్దల యుత్కర్షను తన విద్యావిశేషములను విస్తరించి చెప్పి నాఁడు. మాలతీమాధవప్రకరణ సౌభాగ్యమును గూడ వర్ణించినాఁడు. కావున, మాలతీమాధవమే యాతని తొలినాటకము. మఱి యాకొఱంతపలుకు లేల యన ?—అవి యుద్ధతోక్తులే గాని, కొఱంత పలుకులు గావు, అని సర్వజ్ఞసింగమనాయనివారి వాక్య.— "పరాపవాదా త్స్వోత్కర్షోపాధి రుద్ధత ఉచ్యతే। యథా మాలతీ మాధవే 'యేనామ'। అత్ర 'జానన్తి తే కిమ' పీతి. పరాప వాదాత్ 'మమతుకో౽పిసమానధర్మా' ఇ త్యాత్మోత్కర్ష కథనా చ్చ భవభూతే రుద్ధతత్వమ్." ఇట్లు గాదందు రేని, ఈయన మాలతికి ముందు కొన్ని చిల్లరకవనము లెమేని చేసియుండి వానిని లోకులు మెచ్చనందులకై యీ వాక్యముం బల్కియుండవచ్చును. మాలతి చేతఁ గూడ స్ఫుటముగా ఎల్లరను మెప్పింపలేక, శృంగారమున తనకు ప్రజ్ఞ చాలదని యరసికొన్నవాఁడై, ఆ రసమును మానుకొని, చాలమిం గ్రమ్మఱుకొనుటకై వీరాద్భుతప్రియతోపన్యాస పూర్వక ముగా వీరచరితముం దొడంగినాఁడు—

"తే వేద ముద్ధృతజగత్త్రియమన్యమూల
మస్తోకవీర మురుసాహస మద్భుతం చ
వీరాద్భుతప్రియతయా రఘునన్దనస్య
ధర్మద్రుహాం దమయితు శ్చరితం నిబద్ధమ్."

లోకులు వీరచరితమును గూడ ఎక్కువగా మెచ్చుకొనలేదు. ఆ న్యూనతను "యథా స్త్రీణాం తథా వాచాం సాధుత్వే దుర్జనో

జనః." అని ఉ. రా. చ. లో సూచించినాఁడు. అయినను ఆదినుండి తనసారమందు తనకుం గల విశ్వాసము క్రమక్రమముగా ద్రఢిష్ఠమైనందున ఉ. రా. చ. తుదిని—

"తా మేతాం పరిభావయ న్త్వభినయై ర్విన్యస్తరూపాం బుధాః
శబ్దబ్రహ్మవిదః కవేః పరిణతప్రజ్ఞస్య వాణీ మిమామ్."

౭ భవభూతి ప్రతిభాదికము

చదివినవిద్య యిట్లు అపారమైయుండ, ఈయన పర్వతారణ్య నదీ తత్సంగమ జనపద జనవృత్తాదికమును పుస్తకముగా పఠించికొన్నాఁడో యనునట్లు పరికించినవాఁడు. వర్ణనచే వర్ణ్యమును ప్రత్యక్షకల్పముం జేయఁగలఁడు.

ఏనుఁగులు దురదచే వృక్షగ్రంథులకు గండగ్రంథుల నొరసికొని గోదావరిలోనికి పుష్పవృష్టిం గురియించుట; ఎండకు డస్సియడవికోళ్లు చెట్లపై పరుండి కూయుచుండుట; నదీసంగములలో ఒకయేటియలలు వేఱయేటి యలలపైకి లేచి, బొమ్ముపోటు లాడిపొరలి యురలుట; అటవీగహ్వరములలోని సింహముల గర్జనలకును, పులుల గాండ్రు గాండ్రు ధ్వనులకును, గుహలలోని యెలుఁగుబంట్ల యంబూత్కృతములకును, అడవి యెల్లను దిక్కు లెల్లను శ్రోతలకు ఒడలు గగురు పొడుచునట్లు మాఱు సెలంగుట; ఎక్కడనో పాతాళమున ఇంచుక జలము మెఱయుచున్న లోయలలోని పణఁకుల నడిమి పడియలు; డప్పికిం దూలిన తొండలు అజగరముల చెమటయొడికలను త్రాగుట:—ఇట్టి వర్ణనలచేత ఈతఁడు మదికి సినమటోగ్రాపుం జూపుచున్నాఁడు.

కరియువ కరేణుయువతికి తొండముతో కూజాతోనుంబోలె, నీటిసోనను బస్నిటింబోలె, చిలుకుట, దానికి వంపులేని తూఁటికామ

తోడి తామరాకు గొడుగుం బట్టుట; తమ్మితూండ్ల చిఱుగుకశుని యల కవణముతోడి నెత్తమ్మి నెత్తావి నీటిని తన పుక్కిటినుండి దాని పుక్కిటం బెట్టుట :—ఇట్టి రసిక చర్యల వర్ణనలచేతను ఈకవి రసిక హృదయములను వశీకరించుచున్నాఁడు.

ఆకాశసంచారి కాపాలికీ, కన్యాబలిదాతృ కాపాలిక, చాముం డాపూజా, మహామాంస విక్రయ క్రియానుషక్తి దృశ్యాదృశ్య భూత ప్రేత పిశాచ వృత్తి. శ్మశాన త్రైయామ మంధకారవిజృంభణ వర్ణనలచే ద్రష్టృ శ్రోతృ పఠితృ జనముల చిత్తములకు మచ్చు చల్లినవాఁడు.

సాత్త్వికవ్యభిచార్యాది భావములయొక్క సూక్ష్మసూక్ష్మతర భేదములను తత్సంసృష్టి సంకరములను వర్ణించుటయందు ఈయన కవిలోకైకవీరుఁడుగా నున్నాఁడు. ఈ విషయములో ఇతర కవులు ఈయనకు సాటి గాఁజాలరైరి.

ఈయన తాను వశ్యవాక్కని చెప్పుకొన్నాఁడు. వశ్య వాక్కుముఁ డని మనము చెప్పవలయును. మురారి శ్రీహర్షాదులు కొందఱు తప్ప ఇతరకవులు కాళిదాసు మార్గమున నడుగిడ లేక ప్రాయికముగా ఈయన కవనమును ఒరవడిగాఁ గొని యల్లియు, ఈ ప్రజ్ఞ లేమిని ఈ వాక్కును రామిని, భగ్నప్రాయు లైనారు. ఈయనకు భాషయు బంధమును రీతియు వృత్తియు అన్నియు వర్ణ్య భావ దశా విశేషా ద్యుచితముగా మాఱుచునే ఉండును. వాగు త్కర్ష ఉ. రా. చ. లో పరమావధిం బొందినది. బుడుతల గుఱ్ఱంపు వర్ణనము, కొంటెవటుని హేళనోక్తి, కుపితజనక కఠోరోక్తి, శాంత జనక క్షమోక్తి, ఆరంజోతమ్మ వేదకలోక్తి, బాలయోధుల వీర వాదములు, ఇత్యాదులు నిదర్శనములు. అక్షరమును బంధంబును అర్థానుగుణ మగు నందులకు లవచంద్రకేతుల యుద్ధోద్యమవచనము ఒక యుదాహరణము :—

"జ్యాజిహ్వకా వలయి తోత్కటకోటిదంష్ట్రి
ముద్గారి ఘోర ఘన ఘర్ఘర ఘోష మేతత్
గ్రాస ప్రసక్త హస దన్తక వక్త్రియన్త్రి
జృమ్భా విడమ్బి వికటోదర మస్తు చాపమ్."

ఈతని తాటకావర్ణనముపై ఈసు రేఁగి, మురారి రాజశేఖరాదులు పోటికి అల్లిన తాటకా వర్ణనపద్యములను వారి నాటకములయందుం గనవచ్చును; మఱియు విమర్శ వినోదమందేని కనఁగను. కావ్యాదర్శదండి పదలాలిత్యాధిదైవతము. ఆ లాలిత్యమందే అతఁడు జనించినవాఁడు గాని, అతనినుండి లాలిత్యము జనింపలేదు. భవభూతియు కాళిదాసును అర్థముబడి లలితపదములం బ్రయోగించినవారేగాని, లాలిత్యార్థమై తద్గుణోజ్జ్వల పదాన్వేషణముం గావించినవారు గారు. ఈ కిటుకుం గనిపట్టి పాలేటివరి యుద్దండకవి (కాళిదాస మార్గమునుం దలపెట్ట లేక) మాలతిని మించువాఁడై మల్లికం గూడం గను. ఇందుకు తారతమ్యప్రదర్శనము:—ఇతఁడు మల్లికలో ప్రాయికముగా భవభూతి పద్యములకు పోటిగా పద్యము లల్లినాఁడు. మల్లిక కథ మాలతికథకు ప్రతిబింబ మనందగును. మాలతిలోని "చూడాపీడకపాలే" త్యాది నాందీగతపద్యమును ఉద్వేజకప్రాయమునకు పోటిగా తనరూపకములో "చూడాశీతకరే" త్యాద పద్యమును అల్లినాఁడు. వానిని మదీయ విమర్శవినోదమందేని ఆ రూపకములయందేని కనవచ్చును. భవభూతిపద్యములో భక్తిపారవశ్యంబును ఉద్దండకవి పద్యములో వరదానంబును అగపడుచున్నవి. "సంతాపం శమయన్తు" అను చతుర్థ పాదముం జదువుచున్నప్పుడు సంతాపము శమించుచున్నట్లె తోఁచెడిని.

భవభూతికన్న కాళిదాసు వ్యంగ్యప్రధానుఁడు, కాళిదాసుకన్న భవభూతి వాచ్యప్రధానుఁడు, కుమారసంభవమున రతివిలాపమున—

"త మవేక్ష్య రురోద సా భృశం
స్తనసంబాధ మురో జఘాన చ
స్వజనస్య హి దుఃఖ మగ్రతో
వివృతద్వార మి వోపజాయతే."

ఇందలి యుత్తరార్ధమునకు ఉ. రా. చరిత్రములో—

"సంతానవాహీ న్య పి మానుషాణాం
దుఃఖాని సద్బన్ధు వియోగజాని
దృష్టే జనే ప్రేయసి దుస్సహాని
స్రోతస్సహస్రై రివ సంప్లవన్తే."

"దుస్సహాత్వము" ఇందు కంఠోక్తము, అందు ఉపమానముచే సూచితము.

భవభూతికృతనాటకములను వ్యాఖ్యాతలకన్న అనుకర్తలే చక్కఁగా గ్రహించినారు. మాలతిని త్రిపురారి నాన్యదేవ జగద్ధరులకన్న ఉద్దండకవియు, మహావీరచరితమును వీరరాఘవమనీషికన్న మురారియును చక్కఁగా గ్రహించినారు. ఇందులకు నిదర్శనమును "కపోలకుఙ్కమాని" "అపితాటకారిః" అనువానిపై మదీయ విమర్శ వినోదభాగమునం గనవచ్చును. పరశురామాభియోగమును వీరచరితయందుం గని బాలరామాయణానర్ఘరాఘవ ప్రసన్నరాఘవాదులందు తత్కర్తలు నిబంధించుకొనిరి.

ఇతనియొరవడి దొరకిన తర్వాత పూర్వరామచరితము నధికరించి పలువురు పలువగల రామనాటకములను రచించినారు. అందుం గొన్ని—1. బాలరామాయణము, 2. అనర్ఘరాఘవము, 3. ప్రసన్నరాఘవము, 4. ఉదాత్తరాఘవము, 5. మహానాటకము, 6. జానకీపరిణయము, 7. ఉన్మత్తరాఘవ ప్రేక్షణికము, 8. అద్భుతదర్పణము ఇత్యాదులు. వీరందఱును వశ్యవాక్కులే. ఇందఱిలోను అనర్ఘరాఘవకారుఁడు మురారి పాండిత్యపరిమోచ్చపదంబున దీపించుచున్నాఁడు.

పరశురామాభియోగములో భవభూతిని మించినాఁడు. కవులు పూర్వరామచరితము నిట్లు సాధించిరి గాని, ఉత్తరరామచరితములోని లోకాతీత సంవిధాన కల్పనం గని భవభూతిప్రతిభ కాశ్చర్యపడి, ఆ మార్గము తమ కసాధ్య మని యెఱింగి అందుం బద మిడరైరి. జయదేవుఁడు ప్రసన్నరాఘవములో ఉ. రా. చ. మార్గమున నదీదేవతలను రంగమునకుం దెచ్చినాఁడు.

భవభూతి ప్రతిభోజ్జ్వలుఁడు గావున వలసినప్పుడు అపూర్వోపమానములం గల్పించుకొనును. ఉదా—

"బాష్పామ్భసా మృగదృశో విమలః కపోలః
ప్రక్షాళ్యతే : సపది రాజత ఏవ యస్మిన్
గణ్డూషపేయ మివ కాన్త్యమృతం పిపాసు
రిన్దు ర్వితేతమయూఖ మృణాళదణ్డః."

"ప్రకిరతి శకృత్పిణ్డకా నామ్రమాత్రాన్. ("ఆమ్రమాత్రములుగా దించున్ శకృత్పిండములన్." 89 [24]. గుఱ్ఱమును వటువులు వర్ణించుట - ఉ. రా. చ.)

"దళయతి పరిశుష్య త్వోద్ధితాశీపపాణ్డు
స్తిమిరనిరి మధ్య శ్చైన్నవః ప్రాక్పరికాశః" మాలతి.

ఈ తాటియాకే పిమ్మట అల్లసాని పెద్దనగారి దంతపుదువ్వెన యైనది.

"అభినవకరిదన్త చ్ఛేదకాన్తః కపోలః"—మాలతీవిరహవర్ణన.

మఱి యీకవి యిహలోకామృత స్యన్దినీ యగు మేఘసందేశంపు ఫక్కిక ననుసరించి మాలతి 9-వ యంకములో మూఁడు శ్లోకము లల్లినాఁడు.—"కచ్చిత్సౌమ్య" (25), "దైవాత్పశ్యేః" (26), "భవద్భిస్సర్వాఙ్గ" (2·).

## ౮ భవభూతి నాటకముల విమర్శ

ఈ యుపోద్ఘాతమున ఉ. రా. చరిత్రమే ప్రధాన మయినను, కడమ రెంటిం గూర్చి అల్లుకొనుచున్న కొన్ని పొరఁబాట్లను తొలఁగించుటకై వానింగూడ నిట పరామర్శింపవలసియున్నది.

## మాలతీమాధవ కథ

ఇది పద్మావతిలో జరిగినది. కామందకి యను బౌద్ధపరివ్రాజిక యొద్ద కుండినపురమువాఁడు దేవరాతుఁడును పద్మావతీపురమువాఁడు భూరివసువును విద్య నేర్చుచుండిరి. ఆ దినములలో ఆ యిద్దఱును కామందకీశిష్యాసమక్షమున "మనము తప్పక ఒకరితో నొకరము వియ్యమందవలయును," అని ప్రతిజ్ఞ చేసికొనిరి. ఇరువురును తమతమ తావుల మంత్రులైరి. దేవరాతునికి మాధవుఁ డను కుమారుఁడును, భూరివసువునకు మాలతియను కూఁతురును కలిగిరి. వీరికి యుక్తవయస్సు వచ్చినంత మాధవుఁడు ఆన్వీక్షికీవిద్య నేర్చుకొనుటకు పద్మావతికి వచ్చెను. కామందకియు ఈ నగరముననే ఉండెను. పద్మావతీ రాజు తన నర్మసచివుఁడగు నందనునికి మాలతి నిమ్మని భూరివసువును అడిగెను. దానికి ఇష్టపడక భూరివసువు మాధవుని తెలిసికొన్నవాఁడై మాలతికిని మాధవునికిని చౌర్యవివాహము జరుపుమని కామందకిని కోరెను. నాయికానాయకులు మదనోద్యానములో ఒండొరులం గాంచి కాముబారిం బడుదురు. మాలతికి చేటి లవంగిక యను వేశ్య. మాధవునికి చెలికాఁడు మకరందుఁడు, కలహంసుఁడు అనుచరుఁడు. నందనుని చెల్లెలు మదయంతిక మాలతికి సహపాంసుక్రీడ మొదలుకొని చెలికత్తె. మాధవుఁడు గ్రుచ్చిన పొగడదండను లవంగిక కొనిపోయి మాలతికిచ్చును. మాలతి నిరంతము దానిం దాల్చియేయుండును. మాలతి చిత్రఫలకమున మాధవుని ప్రతిమను వ్రాయును. అది లవంగిక మూలముగా కలహంసుని చేతిమీఁదుగా మాధవునికిం జేరును. మాధవుఁడు దానియందు తన ప్రతిమ ప్రక్కను మాలతిప్రతిమను వ్రాయును. అనంతరము ఆ చిత్రఫలకము మరల మాలతిచేతికిం బోవును. ఇట్లుండ, పెద్ద పులియొకటి మఠమునుండి విడఁబడి మదయంతిపైకి వచ్చును. మకరందుఁడు ఆమెను ఆవలి కెత్తుకొనిపోయి కాపాడును. ఆ సందర్భమున నా యిరువుర కన్యోన్యానురాగము జనించి వర్ధిల్లును. ఇట్లుండ,

మాలతిని నందనున కిచ్చునట్లుగా భూరివసువు నిశ్చితార్థముం గావించును. అందలి గుట్టెఱుఁగక మాలతీమాధవులు వెగు లొందుదురు. మాధవుఁడు తన యభీష్టమును సాధించుటకు మార్గాంతరము లేమింగని ఆ రాత్రి శ్మశానమున మహామాంస విక్రయముం దొడంగును. ఆ రాత్రియే అఘోరఘంటుఁ డను కాపాలికుఁడు మాలతిని పై మేడయందు నిద్రించుచున్న దానిని తనశిష్య యగు కపాలకుండలచే తెప్పించి శ్మశానమందలి కరాళాయతనములో కరాళాదేవికి బలి వేయుం గడంగును. తోడ గొట్టం గత్తి యెత్తి అఘోరఘంటుఁడు ఇష్టవస్తుస్మరణము చేసికొమ్మని మాలతిని హెచ్చరింపఁగా. "హా! మాధవా, నే నిదె పరలోకమున కేఁగుచున్నాను. నన్ను నీవు మఱవకుము. అనురక్తులు స్మరించుచున్న జనము మృతము కాదు గదా." అని మాలతి మాధవుం గూర్చి మొఱ యిడెను. అదియి మాధవుఁడు విని గుడిలో చొరఁబడి అఘోరఘంటుని అమ్మవారికి బలిం గావించి మాలతిని రక్షించెను. పిమ్మట మాలతి కులాబలాచారము ప్రకారము పెండ్లికిముందు గ్రామదేవతగుడికి పూజార్థము పోవును. మాధవమకరందులు ఆగుడిలో దాఁగియుందురు, అచట మాలతీ వేషమును మకరందుఁడు ధరించి నందుని యింటికేఁగి వానిప్రక్కను పెండ్లికూఁతు రగును. మాధవుఁడు మాలతిం దోడ్కొని గుడినుండి నూరియొక్క యుద్యానమందు కామందకీ సంవిధానముచేత చోరికావివాహముం బడసి యుండును. ఈ లోపల మకరందుఁడు పెండ్లికూఁతురుగా నందునుని చెట్టపట్టి అతనియింట నుండఁగా, అతఁడు వానితో సరసము లాడవచ్చెను. మకరందుఁడు పాదములతో ఉత్తరము చెప్పి, వాని చెల్లెలిని మదయంతిని తోడ్కొని పలాయితుఁ డగును. అతనిని వీథిలో తలారు లడ్డగింతురు, అంత నాతఁడు మదయంతికను మాలతి యున్నకడకుఁ బంపి తలారిదండును రూపుమాపును. ఈ కయ్యమును కలహంసకునివలన విని మాధవుఁడు మాలతిని ఉన్నచోటన యుంచి,

తానేఁగి మకరందునికిం దోడ్పడును. తలారులం ద్రుంచి యిరువురును మాలతిం గలియఁ రాఁగా ఆమె లేదు. ఆమెను కపాలకుండల తన గురువును అఘోరఘంటుని మాధవుఁడు కడపినపగ దీర్చికొనుటకై యెత్తుకొని యాకాశమార్గమున శ్రీశైలమునకుం బోయెను. ఆమె నిచ్చట మాధవాదులు వెదకి వెదకి వేసారుదురు. కపాలకుండల మాలతింగొనిపోయి యుండునని వీరికి కామందకి చెప్పెను. అయినను దుఃఖము పట్టలేక మాధవుఁడు మూర్ఛితుఁడాయెను. బ్రదుకఁడని వెఱచి మకరందుఁడు భృగుపతనమునకు సమకట్టి కొండనెత్తము నుండి క్రిందికి పడనుండెను. భూరివసువు మాలతీనాశము విని దుఃఖము పట్టలేక అగ్నిప్రవేశార్థమై జతనపడెను. ఇంతలో శ్రీశైలమందు సౌదామని మాలతి నెఱింగి కపాలకుండలను నిర్భర్త్సించి ఆకాశమార్గమున మాలతిం గొనివచ్చి మాధవాదులకును భూరివసువునకును చూపి అందఱను రక్షించినది. తలారులను కొట్టినపరాక్రమమును ఈ యుత్కటానురాగములను విని రాజు సంతసించి మాలతిని మాధవునికిని మదయంతిని మకరందునికిని ఇప్పించి బహూకరించెను.

మాలతి విమర్శ

మాలతి దశవిధరూపకములలో ప్రకరణ మనం బరఁగునది. అందులకు.—

"యత్ర కవి రాత్మబుద్ధ్యా। వస్తు శరీరం చ నాయకం చైవ
ఔత్పత్తికం ప్రకురుతే। ప్రకరణ మితి త ద్బుధై ర్జ్ఞేయమ్."

అని భరతోక్తి. విస్తరము తత్సూత్రమందుం గనవచ్చును.

"భవే త్ప్రకరణే వృత్తం లౌకికం కవికల్పితమ్,
శృఙ్గారోఽఙ్గీ నాయక స్తు విప్రోఽమాత్యోఽథవా వణిక్,
సాపాయ ధర్మ కామార్థపరో ధీరప్రశాన్తకః॥" సా. ద.

ఇందువలన 10 అంకము లున్న మాలతి ప్రకరణ మనఁబడు నని యొకానొకరు వ్రాసినవ్రాఁత యపాస్తము. మాలతినిగూర్చి లక్షణ

కారు లేమి, విమర్శకు లేమి, అందు ఇతివృత్తము కేవలము ఉత్పాద్య మని వక్కాణించిరి.

"His Malatimadhava is a romantic drama, the plot being the creation of his own masterly genius." Kale.

"The Malatimadhava is a Prakarana of ten acts. The plot has been spun out purely from the imagination of our poet."

M. Krishnamachary.

కాని, యీ రూపకము బృహత్కథామూలకము. మల్లికా మారుతము ప్రకరణమ యయ్యును మాలతికి ప్రతిబింబ మనం దగిన యనుకృతిగా నున్నది. అట్లే మాలతియు, బృహత్కథలోని మదిరా వతికథకు ప్రతిగా నున్నది. బృహత్కథ పైశాచీభాషలో నున్నది. అందులకు సరియైన సంస్కృతానువాదము సోమదేవభట్టుని కథా సరిత్సాగరము.

" యథామూలం తథైవేదం న మనాగ వ్యతిక్రమః
గ్రన్థవిస్తరసంక్షేప మాత్రం భాషా చ భిద్యతే."

అని యాతనిప్రతిజ్ఞ. అందు మదిరావతికథక్రింద "ఇయ మేవ కథా మాలతీమాధవస్య మూలభూతా". అని అధోజ్ఞాపిక కలదు. శిశువును యువతిం గావించునట్లుగా ఆ కథను భవభూతి పోషించి పండిత మోహినిం గావించినాఁడు. దానిం జదివిన, ఈతనిప్రజ్ఞ సరిగా నింత యని యేర్పడును. ఆ కథను ఈక్రింద సంగ్రహముగా వ్రాసెద్చెద -

మదిరావతి కథ

కళింగదేశములో శోభావతీనగరమందు యశస్కరుఁడని బ్రాహ్మణుఁడుండెను. ఆయనభార్య మేఖల. వారికి నే నొక్కండ కుమారుఁడ నుద్భవించితిని. బాల్యంబున నే నధ్యయనము చేయుచుం డఁగా నతిక్రూరమయిన కఱవు కలిగెను. దానంజేసి నాయన

అమ్మతోఁగూడ నన్నుం దోడ్కొని ధనపరిచ్ఛదసంయుతముగా విశాలానగరమునకు పోయి, అచట నెలకొనెను. నేనును నాయీడు సహాధ్యాయులతోఁగూడ నొక గురువరునివలన విద్య నేర్చుచు నుంటిని. వారిలో గుణవంతుఁడు మహాధనికుని కుమారుఁడు విజయసేనుఁ డనుక్షత్త్రియపుత్త్రుఁడు నాకు నెచ్చెలి యాయెను. ఒకనాఁడు మా యుపాధ్యాయునింటికి ఆతనితోఁగూడ నతనితోఁబుట్టువు మదిరావతి యనుకన్య వచ్చెను. ఆ కుమారిం గని మిత్త్రునివలన తదీయ నామాన్వయము లెఱింగి వెంటనే తలఁగరానితగులమై మరునానకు బానిస నైతిని. ఆ శుభాంగియు చెలిమి తొలఁకు మనోహరవీక్షణంబుల నన్నుం గాంచుచు, మొలకలెత్తినకూరిమిని చెక్కుల పులకపటలిచే తెలుపుచు, ఆటమిషచే తద్దయుం బ్రొద్దు మసలి, అనంతరము ప్రణయదూతియగు వలితాపాంగనిరీక్షణ మాలికను నా దెసకు ప్రేరించుచు, నెట్టకేలకు తనయింటి కరిగెను. అంత నేనును ఆయెడఁబాపునకు డిల్లవోయి ఇంటి కరిగి నేలఁబడి, నేలఁబడిన మీనువోలె పొరగిలుచు వెకిలింబడుచు దొండ్రిలుచు నుంటిని. ఆయహోరాత్రంబు గడపి నేను మఱునాఁడు ఉపాధ్యాయులయింటి కేఁగితిని.

అచట విస్రంభసంభాషణంబున నాచెలికాఁడు విజయసేనుఁడు హాసోత్ఫుల్ల వదనాంబుజుండై నాతో నిట్లనియె—' మిత్త్రమా, నా చెల్లెలు మదిరావతివలన నా చెలికానిని నిన్ను ఇట్టివాఁడ వని విని నెయ్యంబున మాతల్లి గాంచఁ గోరియున్నది. కావున నామీఁద స్నేహముకలదేని నాతోఁగూడ మాయింటికి రమ్ము. నీయడుగుఁదామరలరజంబుచే మాయిల్లు విభూషిత మగుఁనుగాక.' మరుభూమి తెరువరికి జడివానవోలె ఈమాట నాకు తాపనిర్వాపణం బాయెను. నేను వల్లెయని యాతనియింటి కేఁగి యాతనితల్లిచే సత్కృతుండనై ప్రేయసీదర్శనముచేత సుఖితుండ నైతిని. అంతలో తండ్రి పిలువనం

పంగా విజయసేనుండు నాయొద్దనుండి వెడలిపోయెను. అంతట మదిరావతిదాదికూఁతురు నాకడ కేతెంచి మ్రొక్కి యిట్లనియె:—'భర్తృదారకా, మాభర్తృదారిక మదిరావతి యుద్యానంబులో నొక మాలతీలతం బెంచినది. దాన నిపుడు మధుసంగమసానంద విలాస హాసితోజ్జ్వలంబు నెరసి యున్నది. అందుండి పైఁబడుచున్న పూవింటి శిలీముఖంబుల నోర్చి భర్తృదారిక స్వయముగా మొగ్గలఁగోసి ముత్తియంబులంబోని యీ మొగ్గలతో ఈ యొంటిపేట పేరు గ్రుచ్చి మీకు కానుక పంపినది. క్రొత్తపదార్థమును ముందుగా ప్రియతమునికిఁ గదా ఈవలసినది.' ఇట్లు చదురుగాఁబలికి ధాత్రేయి ఆ పూదండను పంచపలకర్పూరసంయుత తాంబూల దళంబులతోఁగూడ నాకొసంగెను. నా ప్రాణప్రియ తన చేతులతో గ్రుచ్చిన యీ పూదండను నేను మెడం దాల్చి, తదీయాలింగనంబుకన్న నెక్కుడగు ననిర్వాచనీయ సౌఖ్యముం బొందితిని. ఆ తాంబూలము వైచికొని యీ ప్రియాసఖితో 'ఓకల్యాణీ, ఏమి చెప్పుదును, నా యెదయందలి కామ మెట్లున్నదన, నీ చెలికొఱకు ఈ ప్రాణములను వదలుదునేని అదియే నాజన్మఫలము, నా ప్రాణములు నీ చెలివిగదా.' అని పల్కి దానిం బంపి నేను అంతలో వచ్చిన విజయసేనుంగూడి ఒజ్జయింటి కరుదెంచితిని.

మఱునాఁడు విజయసేనుఁడు మదిరావతిం జోడ్కొని మా యింటి కరుదెంచెను. వారిరాకకు నాతలిదండ్రులు కరము సంతసిల్లిరి. ఇక్కరణిని నాకును మదిరావతికిని మాటిమాటికి నేకస్థానస్థితిచేత ననురాగము గాఢముగానే పెచ్చుపెరుఁగుచుండెను. ఇట్లుండ నొకనాఁడు మదిరావతిదాసి వచ్చి నాతో నేకతంబున నిట్లనియె: 'మహాభాగా, నాపలుకులు శ్రద్ధతో నవధరింపుము. ఒజ్జలయింట నిన్నుఁ గన్న యప్పటినుండి మదిరావతి పడునట్టియవస్థ వాక్రువ్వ నలవిగాదు. ఆ లేమ తన మనస్సు నీమీఁద తగులుకొని యున్నదని నాతోఁ

బల్కినది. కావున నోసొబగుఁడా ఆ కుమారిజీవితము నీ కిష్టమేని తన్మనోరథ మెవ్విధంబున ఫలించునో ఆవిధ మాచరింపుము.' ఈ వాగమృతంబున నానందమగ్నుండనై 'ఈపని మీచేతిలోనిద, నేను మీ స్వాధీనుండన' అని యుత్తర మొసంగితిని. ఆమాటకు దాసి సంతోషించి వచ్చినయట్లే పోయినది. నేనును ఆసందర్శనంబుచే నాస్థ వొడమి నెవులు దీఱి యుంటిని.

ఆ మఱునాఁడు ఉజ్జయినినుండి గొప్పవాఁ డొక క్షత్త్రియ కుమారుఁడు వచ్చి మదిరావతిని తన కిమ్మని తజ్జనకు నడిగెను. తండ్రియు నతని కీయ నంగీకరించెను. అంతట లగ్నము నిశ్చిత మాయెను. మహోత్సవ పూర్వకంబుగా పెండ్లిదినము వచ్చినది. తూర్యముల మ్రోఁతతో పెండ్లికూమారుని రాక కోలాహలపడు చుండెను. అంత నేను ఆస లుడిగి బ్రదుకు టిడుమను భరింపఁజాలక విరహముకన్న మరణము మేలనియెంచి ఊరివెలి కరిగి అట నొక మఱ్ఱిమ్రానెక్కి యందొక యురిగట్టి మెడకుఁ దవిలించుకొని చెట్టు నుండి నన్నును ప్రియాప్రాప్తిమనోరాజ్యంబును ఒక్కట దిగఁద్రోచితిని. క్షణము సేపటికి చైతన్యమును మరలం బొంది కనుదెఱచి చూచు నంతట నా యురి త్రెస్సి నే నొక ప్రాయపువానియొడి నుంటిని. అతఁడే నా ప్రాణమును గాచె నని తలంచి, యాతనితో 'మహాను భావా, నీ వేమో కరుణ చూపితివి గాని, విరహాతురునికి నాకు మృత్యువు ఇష్టముగాని ప్రాణము గాదు' అని వచించి, యా యాప ద్బాంధవుని ప్రశ్న కుత్తరముగా మదీయమగుయున మదిరావతీ వృత్తాం తమును నివేదించితిని. అంత నాసజ్జనుఁడు 'ఏల ప్రాజ్ఞుఁడవయ్యు నిటు మోహంబునం బడెదవు. సకలంబును దేనికొఱకో ఆయాత్మను త్యజించుటవలన నేమిఫలము? ఇందులకు నిదర్శనముగా నావృత్తాం తముం జెప్పెద వినుము' అని యిట్లు వక్కాణించెను.

హిమవంతము చెంత నిషధమని దేశ మొందు గలదు. అందు శ్రుతశీలసంపన్నుండయిన యొక బ్రాహ్మణునికి నేను తనయుండను. నేను దేశాంతరములు గన వేడుకనై యిలు వెడలి దేశములు తిరుగుచు ఒజ్జలం గనుచు క్రమంబున శంఖపురమునకుం జనుదెంచితిని. ఆ నగరంబుకడ శంఖపాలుఁ డనునాగరాజుది పావనము శంఖహ్రదమను మహాసరోవరము స్వచ్ఛోదకము కలదు. అప్పురంబున గురుకుల వాసముసేయుచుండి నేనొక్కప్పుడు స్నానయాత్రోత్సవంబున శంఖహ్రదమునకుం బోయితిని. సురాసురులచేత మహాసముద్రమువోలె ఆ తటాకము దరులనెల్ల నానాదిగంతాగతులైన జనులచే నిండి అంతటను కలగుండుపొందుచుండెను. మడువునకు దక్షిణంబున చెట్లగుబురులో నొక వరకన్యక గురువెందతీవ పందిరిదువారంబునం బూలు గోయుచుండెను. ఆ లేడికంటి నాకంటంబడినమాత్రాన ముల్లోకములను మోహంబునంబుచ్చు మారుని కైబల్లెమువోలె నాయెద నడుగంటఁ జొచ్చినది. తానును నన్నుంగాంచిన మాత్రాన వలతేనికి దాసియై నన్ను అపాంగ విశ్రాంతతారకాంతంపు విలోకితంబునం బరికించుచుండెను. ఇట్లొకనిముసంబ మేమిరువురము ఒండొరువులం గాంచుచున్నంతలో మదపుటేనుం గొండు రేఁగి గొలుసు తెంపుకొని మావటీనిం బడఁద్రోవ చెవిమీఁది యంకుసమును నేలరాల్చి పరువున వచ్చుచుండెను. దానిం గని పరిజనులెల్లం బలాయితులు కాఁగా నేను వెఱగూరిన యా ప్రేయసిని అక్కున నెత్తుకొని జనుల నడిమికి తెచ్చితిని. అక్కన్నియ దిగులుతీఱి తత్పరిజనము వచ్చికూడునంతలో జనుల కోలాహలంబునకుం గనలి యా మత్తవారణ మచ్చటికే దుముకుచు వచ్చెను. ఆ భయమునకు జనులెల్లం బరువులువాఱ పరిజనులు ఆవరకన్య నవ్వలి కిచటికో కొనిపోయిరి. నేను వేఱొక చక్కటి కేఁగితిని.

ఏనుఁగుభయము తీఱినతర్వాత ఆనింగినదుముదాని నెచటనుం గానక, పేరేని కులమేని నెలవేనియు నెఱుంగక, శూన్యహృదయుం డనై విద్యక్రోలుపోయిన విద్యాధరుండుంబోలెఁ ద్రిమ్మరుచు నుంటిని. క్రమముగా ధైర్య మవలంబించినవాఁడనై ఆ కన్నియ యీనగరం బున నొకవేళ నుండునో యని యిటకు వచ్చితిని. ఇట కంఠమున కురిఁబోసికొన్న నిన్నుం గంటిని. ఉరి తొలఁగి నీవు నీదుఃఖము చెప్పి తివి. నేనును నా దుఃఖమును చెప్పితిని. మిత్రుఁడా, యివ్విధమున నేను ఊరుం బేరుం దెలియని యాసుందరాంగికై పురుషకారమునకు దారియగపడని విషయంబున యత్నము సేయుచున్నాఁడను. మదిరా వతి నీ గోచరమంద యున్నను నీవు తత్ప్రాప్తికై పురుషకారము మాని దిగులునం గూలెడవేల? రుక్మిణీదేవిని గూర్చిన పురావృత్త మును నీవు వినలేదా? చేదిపతి కిచ్చినను మురారి యామెను పొంద లేదా?

ఇట్లా చెలికాఁడు పలుకుచుండఁగా మంగళవాద్యనాదపురస్స రంబుగా మదిరావతి సపరిజనయై నా యెదుటనే వచ్చినది. అంతట మిత్రునితో నిట్లు చెప్పితిని—"వివాహమునకు ముందు ఈ యమ్మ వారిగుడిలో కులకన్యకలు కామదేవునిం బూజింతురుగదా, కాన నిటకు వచ్చినప్పుడు మదిరావతి తనకై ప్రాణమువిడిచిన నన్ను చూచునుగాక యని ఈ గుడిముందఱనే మఱిచెట్టుకు నే నురిఁబోసి కొంటిని." ఆమాట విని ధీరాత్ముండా చెలికాఁడు 'అటయిన శీఘ్ర ముగా ఈ గుడిలోనె ప్రవేశించి గర్భగృహములో మాతృదేవతల వెనుక దాఁగియుందము, మన కేమయిన నుపాయము దొరకునో దొరకదో చూతము రమ్ము' అనెను. నేను సరియే యని యా సఖు నితోఁగూడ దేవళంబు సొచ్చితిని. అట్లే దాఁగియుంటిమి. అంతట పెండ్లి పాటలతోఁగూడ మదిరావతి మెల్లన ఆ దేవళమునకు వచ్చి

నది. తాను మనస్సులోని వరమును ఒరులకుఁ దెలియకుండునట్లుగా కామదేవుని వేఁడుకొనందలంచినట్లు కారణము చెప్పి సఖీజనమును పరివారమును బయటన నిలిపి, ఒంటిగా లోని కరిగి కామదేవునర్చించి యిట్లు విన్నవించినది — 'దేవా, నీవు మనస్సునం బుట్టినవాఁడవయ్యును నా మనస్సులోని నా ప్రియుని ఎఱుంగవైతి వేల? ఏల నన్ను వంచించి కీడు పఱచితివి? ఈ జన్మమందు నీవు వరదాన సమర్థుఁడవు కావేని జన్మాంతరమందేని, ఓ రతినాయకా, ఆ విప్రకుమారుఁడే నాకు భర్త యగునట్లు ప్రసాదింపుము.'

ఆ బాలిక మేము కనుచును వినుచును నుండఁగా నట్లు పలికి, చిలుకఁగొయ్యకు ఉత్తరీయమును కట్టి కంఠమున ఉరిఁబోసికొనెను. 'మిత్రుఁడా, పోయి అగపడి ఆమె కంఠమునుండి యాపాశమును తొలఁగింపుము' అని యా చెలికాఁడు బోధింపఁగా నేను వెంటనే ప్రత్యక్షమై జని 'ప్రాణేశ్వరీ, సాహసము చేయకు, ఇదె చూడుము, ప్రాణము వెల యొసంగి నీవు గడించినవాఁడను. ఆర్తకాలమందు ఎవని మీఁది సహజ స్నేహమును నీవు తెల్పితివో వాఁడను, నీదాసుఁడను, నీ ప్రమోలన యున్నాఁడను.' అని హర్షంబుచే ఎలుంగు దొట్రిలం బలికి, క్షణంబులో ఆ సుందరాంగి కంఠమునుండి పాశమును తొలఁగించితిని, అంత నచ్చెలువ నన్నుం గని యానందభయంబులపాలయి క్షణము ఉన్నంతలో నామిత్రుఁడు వడిగా నిట్లనియె :— 'చెలికాఁడా, ఈ రేవాయి చీకటిలో నేను ఈమెవేసముదాల్చి యీమెపరిజనులతోఁ గూడ నేఁగెదను. మన యిరువుర యుత్తరీయములను కట్ట నిచ్చి. ఈమెను దోడ్కొని నీవు రెండవ ద్వారము దారిని నీ యిచ్చవచ్చిన దేశాంతరమునకు రాత్రి పొమ్ము, నాకై చింతింపకు, నాకు దైవము మేలు సేయును.' ఇట్లు పలికి, యాతఁడు మదిరావతివేషము తాను గైకొని రాత్రి చీకటిలో తత్పరిజనులతో వెడలిపోయెను. నేను మది

రావతిం దోడ్కొని వెలలేని యొకరత్నముతో ఆ రెండవద్వారమున వెలువడి ఆరాత్రి ఒక యామడదూర మరిగితిని. తెల్లవాఱినపిమ్మట ఆరగించి, దినములవెంట క్రమముగా నడుచుచు ప్రేయసితోఁగూడ అచలపురమను నగరము చేరితిని. అందొకబ్రాహ్మణుఁడు నాకు మిత్రమై యిల్లీయఁగా మదిరావతిని పెండ్లి యైతిని.

ఇట్లు కోరిక నెఱవేఱి యచట నివసించుచు నేను నామిత్రుని కథ యేమాయెనోయని చింతాకులమానసుండనై యుత్తరాయణంబున నిటకు గంగాస్నానార్థము వచ్చినంత నీయకారణబాంధవుండు నాకుం గనులపండువు గావించినాఁడు. నన్నుం గాంచి యాశ్చర్యమగ్నుండయినయీతనిం బెద్దయుంబ్రొద్దు కవుంగిటం బొదివి కూర్చుండి వృత్తాంత మడుగునంతలో, దేవా, నీవిటకు విజయంచేసితివి. వత్సేశ్వరాత్మజుఁడా, ఇట్లిచట నా చెంతనున్న యీ బ్రాహ్మణకుమారుని నాకుప్రాణభార్యాప్రదుఁడైన యాపద్బాంధవునిఁగా నెఱుంగుము.

ఇట్లు నిజవృత్తాంతమును ఆ యిరువురు విప్రకుమారులలో నొకఁడు వర్ణించి ముగించినంతట నరవాహనదత్తుఁ డా రెండవయాతనిని 'ఓ విప్రకుమారా, మిత్రులకై ప్రాణమును సరకుగొనని మిము బోంట్లు లోకములో అరుదుగదా, నీవు ఆ చిక్కుఁబాటునుండి యెట్లు తప్పించుకొంటివో చెప్పుము, నేను సంతసిల్లెదను.' అని అయడిగెను. అంత నాఁతడు తనవృత్తాంతము నిట్లు చెప్పందొడంగెను.

## మదిరావతివేసంబు దాల్చినవాని వృత్తాంతము

నేను మదిరావతివేషంబున దేవళమునుండి వెలువడఁగానే పరిజనులు నన్ను మదిరావతిగానే తలంచి, పల్లకిలోఁ గూర్చుండఁబెట్టి సోమదత్తునిలోఁగిటికిం గొనిపోయిరి. అందు పెండ్లికొమరిత యనుభ్రమచే నన్ను పానమత్తలు ఊడిగంపుం జేడియలు మేల్మ

సుంగు వైచి ఒకయింట ప్రవేశపెట్టిరి, నేను కూర్చున్నంత పెండ్లి పండువు నుబ్బులాటంబుల తబ్బిబ్బుచేఁతల బిబ్బోకవతులు నన్ను చుట్టవేసికొనిరి.

అంతలో వాకిటిచెంగట అందియలసందడియు మొలనూలిరవళియు వినవాయెను. చెలికత్తియలతోఁగూడ నొక కన్నియయు నాగదిలోని కరుదెంచెను. ఎవ్వతెయో యని పరికించితిని. నాఁడు శంఖహ్రదముకడ జలకమాడవచ్చి నాకు కనువిందైన ఏనుఁగునుండి నేఁగాచిన యా నాయెదదొంగయే నాపజ్జం గూర్చున్న యా కన్నియ. ఇదేమి? కాకతాళీయమా, కలయా, నిక్కమా, యని పట్టరాని సంతసంబున నోడలెఱుంగక నేను దలపోయుచుంటిని. అంత నొక్కసమునఁబున మదిరావతిచెలులా కన్నియను 'ఆర్యదుహితా, ఏల యిక్కరణి బెంగపెట్టుకొని యున్నావు!' అని హెచ్చరించిరి. తన మనోగతమును దాఁచి యాకన్నియ యిట్లనియె:—'ఏమి, మీ రెఱుంగరా మదిరావతి నాకెట్టి నెచ్చెలియో! ఈమె ఇపుడు పెండ్లియై మగనింటికేఁగును. ఈమె నెడఁబాసి నేనుండఁజాల నని నెవ్వ లొందియున్నాను. కాన మీరు వెంటనే బయటికిం బొండు, నేను ఇంచుకసేపు మదిరావతితో విస్రంభంబున మాటలాడుచు సుఖముండెదను.' అంతట వారందఱు మమ్మిరువుర నేకాంతంబున విడిచి యరిగిరి. అంత నాచెలువ తలుపు బిగించి గడియ వైచి వచ్చి చెలికత్తె నన్నుభ్రమచే నాచెంతం గూర్చుండి యిట్లనియె.

సఖీ, మదిరావతీ, నీదుఃఖముకన్న గొప్ప దుఃఖము ఉండదు. ఏలన నీ ప్రాణప్రియుఁడు వేఱొకఁడైయుండ తండ్రి నిన్ను మఱివేఱొకని కిచ్చుచున్నాఁడు. అయినను పరిచయవశంబున మరల నెఱుక వడెడి యా నీ ప్రియతమునితో నీకు దర్శనమేని ఒకవేళ ఘటిల్లఁగలదు. నాకన్ననో ప్రత్యాశలేని దుఃఖము సంభవించియున్నది, చెప్పెద

వినుము : నీకు నేనెట్లో నాకు నీవును అట్లే నమ్మకపుఁ దావలమవుగదా. రానున్న నీ యెడఁబాపు దుఃఖమును మఱచుటకై నేను శంఖహ్రాదమునకు స్నానయాత్ర పోయియుంటిని. అచటి యుద్యానవనంబున, పగలు నింగిని దొఱంగివచ్చిన చంద్రుఁడో సౌందర్యసామజంపు బంగారుపుఁ గట్టుకంబమో నా నొప్పువాఁడు లేఁ బ్రాయపు బ్రాహ్మణకుమారుఁ డొక్కరుండు నూనూఁగుమీసంపుఁ దేఁటికొదమలతో విరాజిల్లుచున్న మోముఁదామరవాఁడు నాకన్నులకు విందొనర్చెను. 'అడవులయందు తపంబులచే నిడుమలు గుడిచిన మునికన్నియలు ఈ కొమరుఁగానిని గానరేని వారితపంబునకు ఫలమేమి?' అని యాతనిం గని నేను దలపోసిన మాత్రాన కాముఁడు నాయెద నలుఁగులం జేసిన తూంట్లదారిని నానాయు వెఱపును జాఱిపోయినవి. అంత నన్నుం గాంచుచున్న యాతనిం గ్రేఁగంట నేఁ గాంచుచున్నంతలో కంబము నుండి విడఁబడి మదపుటేనుం గొకటి విచ్చలవిడి నచ్చటికిం బఱతెంచెను. దానిం గని నాపరిజనమెల్ల భయపలాయితంబు కాఁగా వెఱచఱచి తత్తఱిల్లుచున్న నన్నక్కుమారుఁడు పరువున వచ్చి యెద నొత్తుకొని దవ్వునకు జనులనడిమికిం గొనిపోయెను. ఆతని మేని స్పర్శామృతంబుచేత నే నానందనిమీలితలోచననై, చెలీ, ఏమనం గేమో, భయమేమో, నే నవతెనో, ఎట నుంటినో, ఎఱుంగకుంటిని. అంతట పరిజనము నన్నుం గలసికొనఁగా నామదవారణంబు మూర్తీభవించిన విరహంబువోలె నా చక్కటికే యరుదెంచెను. దానిభయంబున నా పరిజనులు నన్నెత్తికొని బసకుఁ బోయిరి. అయ్యాలబలంబున నాప్రియుఁ డా భూదేవకుమారుఁ డెటులరిగెనో నేఁ గాననైతిని. అది మొదలుగా పేరేనియుం దెలియక యాప్రాణదాతను చేతి కబ్బి తప్పిపోయిన లిబ్బికై వడి స్మరించుచు, కలలోనే యతనిం గాంచు కోరికమై ఎల్ల వనటలం బాపు నిదుర నాసించుచు, జక్కవయాలువుటాండ్రతో

సరిగా రాత్రుల నేడ్చుచుందును. ఇట్లు ఉపాయముల కందని యీ దుఃఖములో నీదర్శన మొక్కటి, ప్రియసఖీ, నాకు వినోదసాధనముగా నుండునది : అదియు నింక దవ్వగునుగదా. మదిరావతీ. యిత్తెఱంగున నాకు మరణ మొక్కండే శరణమైనది, కాన ఈ యించుకతడవేనియు ని నెమ్మోముం గాంచుసుఖము ననుభవించెదను.

ఆ లతాంగి యబ్బంగిని నాపీనుల నమృతంపుసోనలు గురిసి, నా మోమునుండి జలుంగుముసుంగు నెగఁదివిచి, నన్నుం గని యానన వాలుపట్టి, యొక్కట హర్షాశ్చర్య భయంబుల పాలాయెను. 'ఏల తోముద్దరాలా, ఇట్లు నివ్వెఱపడెదవు? అతఁడ నేగదా నేను, తలంపునకందని యర్థంబులసయితము అనుకూలదైవము ఘటియించును జుమా. నీకై నేనెంతటిదుస్సహవేదనం బొందితినో విధి సేయు నీప్రపంచ విలాసం బెట్టిదియో, పిమ్మట నీకు విస్తరంబుగా వివరించెద. మాటల కిపుడు అదను గాదు. ప్రేయసీ యిపుడు మనము వెలువడు నుపాయమును మాత్రము ఆలోచింపుము.' అని నేను వక్కాణించితిని. అంత నాకోమలి సమయోచితంబుగ నిట్లనియె. 'ఎవ్వరికిం దెలియనీక ఈ వెనుకదారిని వెలువడుదము. దీనిబయట నాతండ్రి సుకృతియుని యింటి యుద్యానము. దానివాకిని వెలువడి యెక్కడేనియుం బోదము.'

అట్లు లతాకాంత పలికినయంత తదీయాభరణంబుల కానరానిక మాటుగట్టుకొని తద్దర్శితపథంబున నట నుండి వెలువడితిని. రాత్రియే తత్సహితంబుగా నడులున వడివడిం గడుదవ్వు నడచి వేగునప్పటికి ఒక కాఱడవిం జేరితిమి. ఆనిర్జనారణ్యంబున మే మరుగుచుండ మిట్ట మధ్యాహ్నమైనది. ఆ సమయంబున నెట్టకేనియు నొకచెట్టునీడ దొరకఁగా, నడకచే నలసి నీరువట్టియున్న ప్రాణేశ్వరిని నేను మెల మెల్ల నానీడం జేర్చి యుత్తరీయంపువీవన తెమ్మెరల సేద దేర్చుచుండ, నాకస్మికంబుగ నచటికి దున్న యొకటి గాయపడి చాపరువు వాఱుచు

వచ్చెను. దానిని వెనువెంటన ఆకృతిచేగనే మహాసత్త్వుఁ డని యెఱుంగనైన యొకపురుషుఁడు చేత విలుపూని గుఱ్ఱముపై తఱుముకొని వచ్చెను. ఆ వీరుఁడు ఆ శాఱుమున్నను ఒక బల్లెంపుఁబోటునం గూల్చి మమ్ముఁ గని మాచెంత కేతెంచి 'ఎవరయా సాధూ, మీరు? ఈమె నీ కేమి గావలయు! ఈదారి నెట కేఁగుచున్నారు?' అని యడిగెను. అంత నేను జందెమెత్తిచూపి 'అయ్యా నేను బ్రాహ్మణుఁడను, ఈచిన్నది నాపెండ్లాము. మేము కార్యవశంబున నొక బిడారుతోఁగూడ దేశాంతరమున కేగుచు, ఆ బిడారును దొంగలు కొట్టఁగా చెదరి దారి తప్పి యిటకు వచ్చితిమి, నిన్నుఁ గంటిమి, మా కష్టములు తీఱినవి' అని కల్లనిక్కువముం బలికితిని. నామాట విని బ్రాహ్మణుఁడ నని నాపై జాలిగొని యాతండు 'అయ్యా! నేను అడవిదొరను, వేఁటకై యిటు వచ్చితిని. మీరు దారి నడచి బడలినవారు నాకు అతిథులు లభించితిరి. ఈ సమీపంబున నే నా నెలవు. అచటికి వచ్చి మీరు విశ్రమింపుఁడు.' అని చెప్పి నా ప్రియను అలసియున్నదానిని తన గుఱ్ఱముపై నెక్కఁ జేసి తాను పాదచారియై మమ్ము తన యింటికిం గొనిపోయి అచ్చట చుట్టమువోలె మజ్జన భోజనాదికముల నుపచరించెను. చెడు దేశములయందును ఒక్కొక్క చోట నెవరేని దొడ్డవారు ఉదయింతురు. అనంతర మాతఁ డిచ్చిన తోడుతో నాయడవిని దాఁటి యొక యగ్రహారము చేరి అం వశాక్కంతను నే బరిణయమైతిని. అప్పటినుండియు భార్యతోఁగూడ దేశములు తిరుగుచు ఒక బిడారుం గలసి యిపుడు గంగాస్నానమునకై యిట కేఁగుదెంచితిని. ఇటనే యీ నాస్వయంవర మిత్రునిం గంటిని—

ఈ రెంటను కథ ఇంచుమించుగా నొకటే, పేరులు వేఱు. మాలతిలో మాధవ రచిత వకుళమాలం గొనివచ్చిన లవంగిక పలికిన చతురోక్తి మదిరావతి కథలో నాయికారచిత పుష్పదామముతో

నాయకుని అలంకరించిన దాదికూఁతు వాక్యమే అనవచ్చును. ఇందలి మదయంతికా మకరంద నందనులకు బదులు స్త్రీ పురుషులు అందునుం గలరు. ఇందలిపులికి అందు ఏనుఁగు. ఈరీతిగా ఆ కథయే యీ కథగా నున్నది.

(1) ఆ కథలో నాయకుఁడు బ్రాహ్మణకుమారుఁడు, నాయిక క్షత్రియకన్య, ఆమెయున్న నాయకునికి సతీర్థ్యుఁడు. మాలతిలో నాయికానాయకులజనకులు సతీర్థ్యులు. ఇందును అందునుం గూడ సతీర్థ్యులకు గురువున్నొద్దనే సమావేశము. ఆకథయే దీనికి మూల మగుటంబట్టి ఇందును నాయిక (మాలతి) క్షత్రియకన్యయే. అందు వలన ఆమెతండ్రి భూరివసువును క్షత్రియుఁడే. కావున ఆ కాలమున బ్రాహ్మణులే అమాత్యులుగా నుండి రనుట పొల్లు.

(2) మాధవుఁడు బ్రాహ్మణుం డని యఘోరఘంటుని యీ క్రోశవాక్యవలనం దెలిసినది. కావున ఆతనితండ్రి దేవరాతుఁడు బ్రాహ్మణుఁడే. భూరివసువు క్షత్రియుఁడని నిరూపించితిమిగదా. కామందకి బౌద్ధపరివ్రాజిక. ఆమె బ్రాహ్మణ దనం బ్రమాణము లేదు. కావున ఈ మువ్వురును బ్రాహ్మణులే యనువ్రాత నిలువదు.

(3) కామందకి భూరివసుదేవరాతులకు ఉపాధ్యాయ గాని సహాధ్యాయగాదు. ఈ మంత్రుల సహాధ్యాయ కామందకీశిష్య సౌదా మని. వీరి కిరువురకు అపత్యసంబంధవిధిప్రతిజ్ఞ సౌదామనీసమక్షమున జరిగినది. సౌదామనిని కామందకి తన పూర్వశిష్య యని వ్యవహ రించినది. గురువుకడ విద్యాంపుఁబ్రతిన సేయుటకు సంకోచ ముండును. సతీర్థ్యకడం జేయుటకు ఉండదు, పైగా ఉత్సాహమే కల్గును. ఆ సతీర్థ్య గురువునకు ఈ ప్రతినవృత్తాంతము నంటించి యుండఁ దగును. ఇదిగాక, గ్రంథములో ఈ పరివ్రాజికను ప్రస్తావించునప్పుడు జర చ్ఛబ్ద మొకటి వినఁబడుచున్నది. " సౌగతజరత్పరివ్రాజికాయాస్తు "

ఇత్యాది మాలతీప్రస్తావన. ఆ ప్రకారము మంత్రులకు "జరన్మంత్రీ" త్యాది వ్యవహారము మాలతిలో లేదు. "అనేన మత్ప్రియాభియోగేన స్మారయసి మమ పూర్వశిష్యాం సౌదామనీమ్" అనియు. "అస్మత్సౌదామనీసమక్షం...ప్రవృత్తేయం ప్రతిజ్ఞా" అనియు, కామందకీవాక్యములు. ఈ విస్తరముచే కామందకి ఆ మంత్రులకు గురువే గాని సహాధ్యాయ గాదని స్పష్టము.

(4) మాలతీయౌవనోదయముంబట్టి భవభూతి కాలమున బ్రాహ్మణయువతీ వివాహము లుండె నని యిదానీంతనులు ఒకానొకరు వ్రాసినారు. కాని, మాలతీమూలభూత మదిరావతీ కథానుసారమున మాలతి క్షత్రియకన్యయ యని తెలియుచున్నందున, ఆ భ్రమను వదలుకొనుట మంచిది.

(5) ఆ కథలో నాయికను మదిరావతిని క్షత్రియను పెండ్లియాడిన నాయకుఁడు బ్రాహ్మణకుమారుఁడే యైనను, ప్రకటముగా వరించినవాఁడు ప్రతినాయకుఁడు క్షత్రియుఁడు. తదనుసారమున ఇందును మాలతిని రాజముఖముగా వరించినవాఁడు ప్రతినాయకుఁడు నందనుండును క్షత్రియుఁడే అనఁదగును. కావున, మాధవమిత్రమయిన మకరందుఁడు పెండ్లియాడిన మదయంతిక నందనుని చెల్లెలు యువతి క్షత్రియయే. మాలతిలోని యావేశ్యాపరిజనము కూడ క్షత్రియవిభవమునే సూచించుచున్నది. మఱియు మాలతిమాధవ కథను జూచి తదనుసారమున సోమదేవుఁడే కథాసరిత్సాగరములో ఆ మదిరావతీకథను రచించుకొనె నని యాతనిప్రతిజ్ఞ నెఱుంగని ప్రజ్ఞావాదమేని, ఆ పక్షమందును ఆకవి మాలతిని క్షత్రియకన్యగానే గ్రహించె నని యేర్పడి యీ ప్రజ్ఞావాదమును వమ్ము చేయును. కావున భవభూతికాలమున బ్రాహ్మణ యువతీవివాహము లుండె నన్న కల్పన ఈ విస్తరముచే పరాహతము.

(6) మాలతిలో భృగ్వగ్నిపతనములు (సాధుసంకల్పితములుగానే) చెప్పఁబడియున్నవి. దానింబట్టి కొందఱిదానీంతనులు భవభూతికాలమున నవి ధర్మ్యములుగానే యుండె నని భ్రమపడిరి. కలినిషిద్ధము లైన భృగ్వగ్నిపతనాదులలో సన్న్యాసమును శ్రీ శంకరాచార్యులవారు ఉద్ధరించి రనియును, వారు కుమారిలభట్టును దర్శించి రనియు, ఆదర్శనమైన వెంటనే కుమారిలభట్టు తన్ను అగ్నిసాత్కరించికొనె ననియు, ప్రసిద్ధిగలదు గావున, వారు కుమారిలభట్టు శిష్యుఁడైన భవభూతికి సమకాలికులో సన్నిహితానంతర కాలికులో కావలయును. కావున, కడమ కలినిషిద్ధములలో చేరిన వైన భృగ్వగ్నిపతనములు లే వనియే యెన్నవలయును. ఇందువలన ఏకాలమున నవి ధర్మ్యములుగా నుండెనో ఆ యాదికాలమునే, చాతుర్వర్ణ్యమందు అనులోమవివాహము లుండినకాలమునే, మాలతీమాధవ కథాకాలముగా భవభూతి గ్రహించె నని తలంప నగును. ఇంతియగాని కవి వ్రాయు వాస్తవావాస్తవాచారములను కవికాలమునకే ఆరోపించుట యసమంజస మని వివేకులకు చెప్పనక్కఱ లేదు.

(7) రామాయణమే సంస్కృతములో నాదికావ్య మను భవభూతి నమ్మకమే మనకు ఆ నమ్మకమును గలిగించిన దని తలంచినవారును ఇదానీంతనులలో కలిగినారు. భవభూతికి పూర్వు లయిన కాళిదాసాదులనమ్మకము మనకు మార్గదర్శకముగాదా? అందఱును ఆ యాదిత్వమును రామాయణమువలననే గ్రహించినవారు గారా? రఘువంశములో —

"తా మభ్యగచ్ఛ ద్రుదితానుసారీ। కవిః కుశేధ్మాహరణాయ యాతః
నిషాదవిద్ధాణ్డజదర్శనోత్థః। శ్లోకత్వ మాపద్యత యస్య శోకః." 14 (70)

"సాఙ్గం చ వేద మధ్యాప్య కిఞ్చిదుత్క్రాన్తశైశవౌ
స్వకృతిం గాపయామాస కవిః ప్రథమపద్ధతిమ్." 15 (33)

"అథ ప్రాచేతసోపజ్ఞం రామాయణ మిత స్తతః
మైథిలేయౌ కుశలవౌ జగతు ర్గురుచోదితౌ." (63)

(8) ఒకానొకరు మహామాంసవిక్రయము బ్రాహ్మణోచితమైన యాత్మహత్యా సాధన మనియు, దానిని భవభూతికి ముందు ఎవ్వరును కల్పించియుండ లేదనియు వ్రాసియున్నారు. అది బ్రాహ్మణునికి కార్యసిద్ధికి క్షుద్రసాధనము గాని ఆత్మహత్యకు ఉత్తమసాధనము గాదు. మాలతీమాధవటీకలో త్రిపురారి ఇట్లు వివరించినాఁడు:- "ఇదానీం జాత్యనుచితేనాపి క్షుద్రఫలప్రదేన శాస్త్రాగమప్రసిద్ధేన సాహసిక జనకృత్యేన మహామాంసవిక్రయే ణాపి ప్రయోజనం సాధనీయ మితి విచిన్త్య నిర్ధారయతి."

విద్యాసిద్ధికై యీ మహామాంసవిక్రయకల్పమునే శ్రీమ దాచార్య హేమచంద్రశిష్య రామచంద్ర కవి విరచిత సత్యహరిశ్చంద్ర నాటకములో నొక విద్యాధరి ప్రయోగించినది. అందు మహామాంస హోమమే తద్విక్రయము.

(9) భవభూతికి ముం దెవ్వరును దీనిని కల్పించి యుండ లేదన్నమాటయు వట్టిపొల్లే.—భవభూతి దీనిని కల్పించినవాఁడు గాఁడు. అతఁడు తన నాటకపురుషులలో నొకఁడు దీనిం బ్రయోగించినట్లు సంవిధాన మల్లినవాఁడు. మఱియు,—కార్యసిద్ధికై దానిం బ్రయోగించుట భవభూతికి పూర్వమే అనాదిసిద్ధము. క్రీస్తుశకమునకుముందు నాలవశతాబ్దియం దుండిన నందునిమంత్రి యైనవరరుచిచే కాణభూతికిని, కాణభూతిచే గుణాఢ్యపండితునికిని, వాక్రువ్వంబడి, గుణాఢ్యపండితునిచే పైశాచిభాషయందు ప్రణీతమయి సోమదత్తునిచే సంస్కృతీకరింపఁబడిన కథాసరిత్సాగరములోని యీ మహామాంస విక్రయ ప్రస్తావముం గనుఁడు. అచట లం. ౧౮. త. ౨. లో మదనమంజరి కథను 1986 పు. మొ., డాకినేయుని కథను 1989 పు. మొ., చదు

వ్రుఁడు. ఇందు తొలిదాన కాపాలికుఁ డొకఁడు మదనమంజరి యను యువతింగనను కృత్యాప్రభావంబున శ్మశానమున ఆకర్షించి ధ్వంసము సేయ నుండఁగా, ఆమె శ్రీ విక్రమార్కునిం బేర్కొని యాక్రందింపఁగా, ఆయన ఖడ్గపాణి దేదీప్యమానవిగ్రహుఁడు ప్రత్యక్షమై, అగ్నిశిఖ బేతాళునిచే నాకాపాలికుని సంహారింపించి తినిపించి వైచెను.

ఈ కథలో మదనమంజరి విక్రమాదిత్యునిం బేర్కొనఁగా ఆయనవచ్చి కాచెను, మాలతిలో మాలతి మాధవునిం బేర్కొనఁగా ఆయనవచ్చి కాచెను, అని కొంత సామ్యము.

రెండవ కథలో డాకినేయుఁ డనుజూదరి ఒకపాదునూత విక్రమాదిత్యుని యాజ్ఞచే బందీకృతుడై పడియున్న శ్మశాన బ్రహ్మరాక్షసులకు తన ప్రాణముం గాచుకొనుటకై యాహార మిడవలసిన వాఁడై అందులకు ఉపాయాంతరము గానక శ్మశానమున మహామాంసము విక్రయించి కార్యమును సాధించుకొనెను.

"స హూపా దుర్గతోఽపశ్యన్ తదర్థప్రాప్తి మన్యతా
పణాయితుం మహామాంసం శ్మశానం ప్రావిశ న్నిశి,
తత్కాలం తిష్ఠతా తత్త్రి స దృష్టః కితవో మయా.
గృహ్ణాతు కశ్చి ద్విక్రీణె మహామాంస మితి బ్రువన్.
అహం గృహ్ణామి కిం మూల్యం మార్గసీ త్యుదితే మయా.
రూపప్రభావౌ స్వౌ దేహి మహ్య మి త్యబ్రవీ చ్చ సః.
తత్త్రద్రూపప్రభావాభ్యాం తా నాకృష్య దదామ్యహమ్,
కితవాః బ్రహ్మరక్షోభ్యాం భక్ష్యం సభ్యయుతా నరీః.
తచ్ఛ్రుత్వా ధైర్యతుష్టేన తస్మై ద్యూతకృతే మయా,
దత్తౌ రూపప్రభావౌ స్వౌ వాతాష్య దినసప్తకమ్."

* మఱియు, "ఉన్మిమత్తా విస్వాత్కపిలేన ఆత్మ తేజసా మహామాంస విక్రయ క్రీతేన మనశ్శిలా పశ్యేనేవ శిష్యలోకం

* శ్రీ శాస్త్రిగారి ప్రతిలో వారు తమ్ముక వ్రాసికొన్న 'మార్జినల్ నోట్సు.'

లిప్సన్త" అను నీహర్ష చరితలోని వాక్యము వలన మహామాంస విక్రయ ప్రయోగము అనాదిసిద్ధమనియు దానిని తన కథలో కార్య సిద్ధికై నిబంధించినాఁ డనియు నెఱుంగనగును. అట్లుగాక అతఁడు తానే కల్పించినచో కథలో కార్యసిద్ధి యెట్లు కలుగును! రంజన యెట్లు గలుగును! వెండియు హర్ష చరితము—"అపరత్ర ప్రకాశ నరపతి కుమారక క్రియమాణ మహామాంస విక్రయప్రక్రమమ్ .. స్కన్ధావారం సమాససాద-" "మహాకాల మహేచ మహామాంస విక్రయ వాదవాతులం బేతాళ స్తాళ జఙ్ఘాజఘాన జఘన్యజం ప్రద్యో తిస్య పౌణకిం కుమారం కుమార సేనమ్."—vi

"మాలతీలో విప్రలంభశృంగార వర్ణనార్థము కవి కపాల కుండలాకృత మాలతీ హరణమును కల్పించినాఁడు. కాని, ఆ కల్పన పూర్వకథతో చక్కఁగా అతుకలేదు." అని విజ్ఞు లొకా నొకరు వచించినారు. వారి మతమును కా దనఁజాలను; అయినను, ఇట వలసినయతుకును కవి పెట్టియే యున్నాఁ డని నాతలంపు. అది లకే, బలివేయు నిమిత్తమై యఘోరఘంటుఁడు తనశిష్యురాగు కపాలకుండలచేత మాలతిని అంతఃపురమునుండి తెప్పించుకొన్నట్లు కవి రచించినాఁడు. పిమ్మట కపాలకుండల తనగురుని మాధవుఁడు చంపె నన్నపగ తీర్చుకొనుటకై అతనిప్రియ యైనమాలతిని హరిం చుట అదికియే యున్నది. మాలతిని మరల తెచ్చుటకై సౌదామనిని కవి ప్రథమాంకమందే ప్రస్తావించినాఁడు. అఘోరఘంటుఁడు. కపాల కుండల, సౌదామని, వీ రందఱును శ్రీశైలమువా రగుటయు, ఈ యతుకులే దృఢపఱుచుచున్నది.

మాలతి యల్లికఁగూర్చి భవభూతిస్వాభిప్రాయము.

"భూమ్నా రసానాం గహనాః ప్రయోగాః। సౌహార్దహృద్యాని విచేష్టితాని.
ఔద్ధత్య మాయోజితకామసూత్రం। చిత్రా కథా, వాచి విదగ్ధతా చ."

మాలతింగూర్చి కాళే (Kale) పండితులు వ్రాసిన యభిప్రాయము నిపుణముగాను ఇమిడికగాను ఉన్నది. అది యేమన.—" ఈ రూపకములో పెక్కుగుణములు కనంబడుచున్నను ఇది ఒకవిధమైన (Clumsiness) మొద్దుతనము (లేక మోటుతనము, లేక, మడ్డితనము) చేత చెడినది. ఇట వృత్తము నేరిమితోనే సంవిహితమైనను గ్రంథము యొక్క అతిదైర్ఘ్యముచేత దానిరంజన కొరంత నొందియున్నది. ఈ లోపములంబట్టి చూడఁగా ఇది రూపకరచనయం దాతనిప్రథమప్రయత్నమును, ప్రథమప్రయత్నములకు అనుషంగికము లగుగుణదోషమిశ్రము కలదిగాను ఉన్నది."

## వీరచరితముంగూర్చి యించుక

ఇది పట్టాభిషేకాంతము పూర్వరామచరితము. ఇందు కవి రామాయణకథలో కొన్నిభాగములను కొంచెకొంచెము మార్చినాఁడు. ఆదిలోనే విశ్వామిత్రాశ్రమమందే విశ్వామిత్రరామలక్ష్మణులతో సీతోర్మిళానుగత కుశధ్వజసమ్మేళనంబును, అటనే కుశధ్వజస్మృతాగతమును శివధనుస్సును శ్రీరాముఁడు భంజించుటయు, రామలక్ష్మణులకు కుశధ్వజుఁడు సీతోర్మిళలను వాగ్దానము సేయుటయు.— ఇది యొకమార్పు. ఇంకొకటి మంథరావేషమున శూర్పణఖ వచ్చి రామప్రవాసమును కైకేయీప్రార్థితముగా దశరథునికిం దెలిపి సాధించుట. కైకేయి మహారాజభార్య, ఆమెయందు నిందనీయవృత్తము చెప్పుట సరిగాదని కవి యిట్లు మార్చినాఁడు. రామునికి ఒరునితో పోరుచున్న వాలిని చెట్టుచాటునుండి కూలనేసినాఁడను నింద లేకుండునట్లుగా కవి వాలిరాములకు ద్వంద్వయుద్ధముం గల్పించినాఁడు. ఇది యొకమార్పు, అని దిక్కు. ఇప్పుడు ఉపలబ్ధమైనమహావీరచరితపుస్తకములలో పంచమాంకములో 4"-వ శ్లోకము మొదలుగాఁ గలగ్రంథము భవభూతికృతము కాదు. సుబ్రహ్మణ్యకవి

కృతము. భవభూతికృతము నష్టము. ఇందువలన ఈ గ్రంథమును కూడ లోకులు అంతగా మెచ్చలేదని తలంపఁదగియున్నది. ఆ కారణంబున ఇందులో లేని విచికిత్సను ఈకవి ఉత్తరరామచరితలో చూపినాఁడనియు, తలంపఁ దగియున్నది. ఈరూపకత్రయముంగూర్చి భండారకారపండితుల యాశయమును కనుఁడు :—

Dr. Bhandarkar's Preface to Malatimadhava.—"The Viracharitra seems to have been Bhavabhuti's first attempt, for it does not exhibit that power and felicity of expression and insight into the human heart that the other two display and is often heavy and uncouth. Malatimadhava must have been his second work and the Uttararama Charitra the last."—

"The genius of Bhavabhuti was however, more of a lyric than of a dramatic nature. Notwithstanding the originality of conception involved in the plot of Malatimadhava, the poet does not show such a skill in the arrangement of his incidents and in the denouncement as is displayed by the author of the Mrichchakati or even of the Mudrarakshasa. The incidents subsequent to the scene in the cemetery look like clumsy appendages and not like parts of a whole. Kapalakundala is represented to have taken away Malati, simply to give an opportunity to the poet to display his power of dipicting the feelings of a man in Viraha, and the incident appears by no means to harmonize with or to arise naturally out of the previous story. Neither is the poet very skilful in the potraiture of varied character. In this also he is surpassed by Sudraka. Bhavabhuti had not the power of putting himself mentally into various situations, of forgetting one and becoming quite a new man in another. But as the poet of nature and of human passion and feeling generally, he occupies a very high rank among Sanskrit authors. Kalidasa, as Prof. Wilson remarks, has more fancy. He is a greater arist than Bhavabhuti. The former suggests or indicates the sentiment which the latter expresses in forcible language ... ... The excellences and shortcomings of Bhavabhuti's genius are fully seen in the Uttararama Charitra. The incidents of that play are but few. There is very little movement. But the description of the forest scenery of Janasthana in the second act, and the portraiture of the grief of Sita and Rama in the third are unrivalled. Uttararamacharitra

is more adapted for the hall, than for the stage, it is more a *Sravya* than a *Drisya Kavya,* while the beauties of Sakuntala are more perceptible when acted than when read. The merits of the poet are also observable in Malati-Madhava, but not in such a developed form as in the other play, while to his usual faults, must be added the use of long prose speeches containing bewildering compounds. Such a thing can never succeed on the stage. Perhaps in this as in several other respects, Bhavabhuti was carried away by the conventionalism which had begun to prevail and the rules laid down by the critics: and the free play of his genius was obstructed. Long compounds constitute the poetic excellence called *Ojas* and this *Ojas* is according to Dandin the very soul of prose "

ఉత్తరరామచరితంగూర్చి మెక్డోనెలుగారు యభిప్రాయము గనుఁడు :—

The Uttararama Charitra, or "The Later Fortunes of Rama." is a romantic piece containing many fine passages. Owing to lack of action, however, it is rather a dramatic poem than a play. The description of the tender love of Rama and Sita, purified by sorrow, exhibits more genuine pathos than appears perhaps in any other Indian drama.

### ఉ. రా. చ. కథ

శ్రీరాములవారికి పట్టాభిషేక మయినది. ఋశ్యశృంగుఁడు పొడంగిన ద్వాదశవార్షికసత్త్రమునకు కౌసల్యాదిరాజమాతలు వసిష్ఠారుంధత్యధిష్ఠితలై చనిరి. అనంతరము సుగ్రీవ విభీషణాదిమిత్రులు విడుకోలువడసిరి. అటుపిమ్మట జనకమహారాజుకూడ వీడుకోలు గైకొని యేఁగెను. తండ్రిగారు తన్ను విడిచిపోయినందులకు దుర్మనాయమానయైన సీతాదేవిని రాముఁడు ఓదార్చుచుండెను. ఆసమయాన ఋశ్యశృంగాశ్రమమునుండి అష్టావక్రముని సీతారాములకు గురుజనసందేశముం దెచ్చెను. అందు సీతకు వసిష్ఠులవారు "అమ్మాయీ, నీకన్న భాగ్యవతి యెవ్వరు! వీరప్రసవవగుదువు గాక" అని సందేశించిరి. "అది యట్లే యగును, ఋషులవాక్కు తప్పదు" అని శ్రీరాములవారు వక్కాణించిరి. శ్రీరాములకు వశిషసందేశము

1 (4); అందులకు వారియుత్తరము 1 (5). సీతకేమని వేఁకటికోర్కి కలిగెనేని తప్పక దానిం దీర్పవలసిన దనియు శ్రీరాములకు వసిష్ఠ సందేశము. అష్టావక్రులు నిర్గమింతురు. అంతట లక్ష్మణుఁడు వచ్చి సీతాచిత్తవినోదనార్థము తాను వ్రాయించిన పూర్వరామచరిత్రము పటములందు సిద్ధమైనదని తెలుపును. దానిం గనుటకు అందఱును చిత్రశాలకుం బోవుదురు. అచ్చట చిత్రగతవృత్తాంతములం బరికించుచుందురు. అందు జృంభకాస్త్ర దర్శనంబున శ్రీరాములవారు అయ్యాస్త్రములను సీతాప్రసూతికి ప్రసాదింతురు. చిత్తరువుం జూడఁగా సీతాదేవికి వెండియు ప్రసన్నగంభీరములైన వనవీథులయందు విహరింపను భాగీరథీనదియందు పవిత్రశీతలజలంబుల నాడనుం గోరిక పొడమును. గర్భదోహదమును తప్పక నెరవేర్పుమన్న వసిష్ఠసందేశమును శిరమున వహించి శ్రీరాములవారు వెంటనే సీత కోరిన యా కోర్కిని తీర్చువారై కుదుపులేనితేరుం దెమ్మని లక్ష్మణుం బంపిరి. సీత బడలికచే రామబాహువు తలయంపిగా నిద్రించును. ఆసమయాన దుర్ముఖుఁడనుపరిచారకుఁడు వచ్చి లోకులు సీతాదేవికి పాతిశుద్ధ్యమున సడివెట్టుచున్నారని శ్రీరాములవారిచెవిలో చెప్పెను. అంతట శ్రీరాములవారు దుఃఖాబ్ధిమగ్నులై సీతతోఁగూడ వరణ్యమునకు పోవందాము మున్నుచేసికొన్న సంకల్పము నుజ్జగించి ఆమెనుమాత్రమే పంపువారై ఎదుటనున్న కూడఁబోవలసివచ్చునని ఆమెను నిద్రితను వీడి గంగాపృథ్వీదేవతలే రక్షింతురని వారిని స్మరించి వేడుకొని యేగుదురు. ఆమెను అడవిలో వదలి రమ్మని లక్ష్మణునికి ఆజ్ఞ పంపుదురు. అతఁడు తేరుదెచ్చి ఆమె నందులోనుంచుకొని పోయి వాల్మీకాశ్రమముచెంత గంగకడ వదలి మరలును.

సీత ఈవిధమున తన్ను ఒంటిగా నడవిం ద్రోచినందులకు కారణ మెఱుఁగక శోకించుచున్నదై ఘాతుకమృగములు తన్ను

మెసవఁజూచుచు పైకొనుచుండ, ప్రసవవేదనలుం బాడమఁగా భరింప లేక ఎట్టులో పోయి మృతికై భాగీరథియందు పడినది.

అనంతరము కొన్ని యేండ్లకు పాలు గుడుచుట మానిన ప్రాయము వారిని ఇరువురం గవలను భాగీరథి వాల్మీకికి తెచ్చి ఇచ్చి వారి నామధేయములు కుశలవు లనియు వారికి జృంభకాస్త్రములు జన్మసిద్ధము లనియు వచించి పోయినది. వారిని మహాముని అతి హర్షముతో నైకొని అతిప్రీతితోఁ బెంచి చూడాకర్మము గావించి వేదము దక్క కడను సకలవిద్యలను నేర్పి పిమ్మట గర్భైకాదశ వర్షంబున క్షాత్రకల్పంబున ఉపనీతులం గావించి వేదములు నేర్పినాఁడు.

ఒకనాఁడు వాల్మీకి మాధ్యందినసవనమునకై తమసానదికిం బోయి అట కలయికలోనున్న క్రౌంచలలో మగక్రౌంచను వేటకాఁడొకఁడు కోలనేయం గని శోకముచే వానిని చెట్టచేసితివిరా యని మందలించెను. ఆ మందలింపువాక్యము అనుష్టుప్ఛందస్సుగానుండెను. దాని నరసి యాశ్చర్యపడుచున్న యా మునికడకు బ్రహ్మ వచ్చి ప్రత్యక్షమై "ఓఋషీ, వాగ్బ్రహ్మమును ఎఱింగితివి. కావున రామచరితమును రచింపుము. నీప్రతిభకు సర్వము ఎఱుకపడును. ఆదికవి వైతివి." అని హెచ్చరించి యంతర్హితుఁ డాయెను. అట్లే వాల్మీకి రామాయణమును రచించెను.

ఇట శ్రీరాములవారు యజమానురాలింగా సీతకు బదులుగా బంగారు సీతా ప్రతిమను చట్టుకొని అశ్వమేధ యాగముం దొడంగి లక్ష్మణకుమారు చంద్రకేతు రక్షితముగా గుఱ్ఱమును వదలిరి.

పిమ్మట బ్రాహ్మణుఁ డొకఁడు తన మృతపుత్త్రుని బాలుని రాజద్వారమునం బెట్టి ఱొమ్మున బాఁదుకొన సాగెను. కరుణామయుఁడు శ్రీరాముఁడు రాజాపచారము లేక రాష్ట్రమున అప

మృత్యువు లుండ వని తనమీఁదనే దోషము మోపుకొనెను. అంతట నశరీరవాక్కు 'ఓ శ్రీరాముఁడా, శూద్రుఁ డొకడు శంబూకుఁ డను వాఁడు తపస్సు చేయుచున్నాఁడు. వాని తలద్రుంచుట నీకు విహిత కృత్యము; వానిని కడపి బ్రాహ్మణబాలుని బ్రదికింపుము.'' అని వినఁబడెను. వెంటనే శ్రీరాముఁడు ఖడ్గపాణియై పుష్పక మెక్కి ఎల్ల దిక్కుల నరసి జనస్థానమందు ఆ శూద్రతాపసుని కనిపట్టి తలఁగొట్టెను. వెంటనే వాఁడు దివ్యపురుషుఁడై రాముని పాదముల కెరఁగి, ఎల్ల వారును వెదకుచున్నట్టి యీ రామపాదములు దుష్టశూద్రుని తన్ను వెదకుకొని యీ దండకారణ్యమునకు వచ్చిన యనుగ్రహమును కీర్తించి సత్సంగజమైన మృతిసయితము దివ్యమహిమ ప్రదమయిన దని వారిని స్తుతించెను. ప్రభువు వానికి దివ్యలోకములకుం బోయి దివ్యభోగము లనుభవించుట కనుజ్ఞ యొసంగెను.

"దండక యంటివే ఇదేమి దండకారణ్యమా?'' యని శ్రీ రాములు శంబూకు నడిగిరి. దండకయే యని యాతఁడు వచించెను. అంతట శ్రీరాములకు దాని నానా భాగములును ఆనవా లయినవి. శంబూకుఁడు వానికి వారిచేత ఖర దూషణ త్రిశిరసులు మడిసిన తావగు జనస్థానమును, అక్కడి కాఱడవులను, ఎఱుకపఱచెను. రాములవారు "తేనియతావులు గుబులుకొనుచున్న యీ వనములయందు సీతతో కాఁపురముండెదను'' అని సీత పూర్వము చెప్పిన తత్ప్రియకాంతారములం జూచి పూర్వపరిచితములైన యీ ప్రశాంత గంభీర మధ్యమారణ్యములను, ఏళ్లను, కుహరములను, ఆనవాలు పట్టుచు వ్యగ్రచిత్తులై యుండిరి. "క్షణములో అగస్త్యమహర్షి దర్శనము చేసికొనివచ్చెదను'' అని చెప్పి శంబూకుఁడు పోయి, శ్రీ రాములరాకను ఋషికిం దెలిపి "దన్ను దర్శించి పోయి యశ్వమేధముం గావింతువుగాక'' యని రాములకు అగస్త్యులవారు పంపిన సందేశమును అందించెను. రాములవారు జటాయు శిఖరమును

దానిక్రింద తమ పర్ణశాలయుండిన తావును, తమకు చిరనివాసమయిన పంచవటిని కని, కడు దుఃఖితులైరి. వారికి శంబూకుఁడు వారు మున్నెఱింగిన క్రౌంచావతగిరిని ఆ గోదావరిని చూపి వీడుకోలు వడసి తన దివ్యగతికిఁ బోయెను. రాములవారు అగస్త్య దర్శనము నకుం బోయి వచ్చెద నని పంచవటితో చెప్పుకొని నిర్గమించిరి.

శ్రీరాములవారు అగస్త్య దర్శనము గావించిరి. అంతట అగస్త్యపత్ని లోపాముద్రాదేవి విరహాకృశుని శ్రీరామునిం గాంచి, ఆయన తమ కడనుండి తిరలుచో సీతా విస్రంభసాక్షు లయిన యా పంచవటీ ప్రదేశములను చూచుటకు పోకమానఁడనియు, ఆదర్శన ముచే ఆయనకు ప్రమాదము కలుగుననియు వెఱచినదై గోదావరీ దేవికి మురళయను నదీదేవతముఖంబున ఆవార్తం దెలిపి, శ్రీరాముఁడు మూర్ఛిల్లినప్పు డెల్ల కమలకింజల్క పరిమళబంధురము లగు తన యలల చల్లని పిల్లతెమ్మెరలచే తేర్చుచుండు మని హెచ్చరిక పంపినది.

పూర్వము సీత భాగీరథిలోఁ బడియెఁగదా; అట నామె నీటిలో నిరువురం గుమారులం గవలం గన్నది. వారే కుశలవులు, వారినే భాగీరథి వాల్మీకికి అప్పగించినది. వారి కిప్పుడు పండ్రెండవ యేఁటి మంగళంపుముడిం గట్టెడుదినము రాఁగా, అందులకై ఆ దేవి తానును లోపాముద్రగొన్న వెఱపునే వహించి సీతను తమ రాజర్షి వంశజనకుఁడైన భగవంతుని సూర్యుని శ్రేయఃప్రదుని స్వహస్తాపచిత కుసుమములతో పూజింప వలసినదని యుపదేశించి, ఏదో గృహాచార పువ్యాజమున రామరక్షార్థము ఇటకు గోదావరికిం బంపినది. గోదా వరినుండి వెలువడు ననంతరము సీతకుం దోడుగా నుండ తమస యను నదీదేవతను నియమించినది. తనప్రభావముచేత వన దేవతల కంటికి నైతము, మఱిమనుష్యులమాట చెప్పవలయునా, సీతను అగపడ

కుండంజేసి ఆ నాట ఆ యిరువురకుం దెలిపినది. సీత గోదావరినుండి లేచివచ్చి పూవులుగోయుచుండును.

శ్రీరాముఁడు అగస్త్యాశ్రమమునుండి వచ్చి పుష్పకము దిగి అచటి యా యా పరిచిత ప్రదేశములం గని శోకాభిభూతుఁడై మూర్ఛిల్లును. దానిం గని సీత వడవడ వడంకుచు తమసాప్రేరణచే సమీపించి శ్రీరాములను ఎదయందును నొసటను దాఁకును. రాముఁడు తెప్పిరిలి ఆస్పర్శ సీత చేతిది యని గ్రహించి సీతను నలుగడలను వెదకును. భాగీరథీ ప్రభావమునంజేసి సీత ఆయనకుఁ గానిపింపదాయెను. అంతలో "సీత పెంచిన గున్నయేనుఁగును వధూద్వితీయమును ఒక మదపుటేనుఁగు ఆ పిడిబెదఁగులకై పైకొన్నది. ఎవరేని ఆ యేనుఁగుఁ గొదమను కావరా!" అని వనదేవత బిగరగా పలికెను. శ్రీరాముఁడు ఆ దుష్టగజమును దండించుటకై లేచును. అంతలో ఆకూయి యిడిన వనదేవత వాసంతి వచ్చి యాతనిని ఆనవాలుపట్టును. రాముఁడును ఆమెను కనుంగొని ఆమెమాటబడి ఏనుఁగుల పోరాటపుస్థలమునకుం జనును. ఇంతలో నాతని పుత్త్రకుఁడైన యేనుఁగుఁగొదమ ఆమత్తేభమును మోఁది తఱిమివైచి తన ప్రియకు అనువర్తన సేయుచుండును. అందులకు సీతారాములు సంతసిల్లుదురు. ఆకొదమం గని సీత తన కుమారులు ఎట్లున్నారో అని తలఁచుకొనును. అంత నట ఆమె మున్ను పెంచిన నెమలియు, గన్నకడపయు, కనఁబడును. రాముఁడు సీత పెంచిన తరులను పక్షులను లేళ్లను కనుచు శోకాతివేగముచే నేడ్వం దొడంగును. "ఆయడవిలో సీత ఏమయినదయ్యా?" అని వాసంతి యడుగఁగా రాముఁడు ఘాతుకమృగభక్షిత యైనదని చెప్పి, మఱి మఱి యేడిచి మూర్ఛిల్లెను. సీత పొడియుం బోయి తాఁకును. రాముఁడు తేఱి ఆమె చేయిపట్టుకొని సీత దొరకినదని వాసంతితో పలుకును. వాసంతి అతనికి ఉన్మాదావస్థ కలిగినదని తలంచి యుండ,

రాముఁడు సీతా కరస్పర్శచేత మోహితేంద్రియుఁడై తన చేతిపట్టు నిలుపుకోలేక రవంత నీవుపట్టుకొని యుండుమని సీతాకరమును వాసంతికరమున నిడఁబోవును ఆసందులో కరము లాగికొని సీత అపసరిల్లును. అప్పటికి రాముఁడు వాస్తవముగా తాను ఉన్మత్తుఁడే అని నమ్మెను. రాముఁడు తాను పోవలయు ననియు బంగారు సీతాప్రతిమను సహధర్మచారిణిగా నుంచుకొని అశ్వమేధము చేయనున్నట్లును వాసంతితోఁ బలికి సెలవుకోలు వడయును. తన ప్రతికృతియే యయినందులకు సీత కరము సంతసిల్లును. రాముఁడు అయోధ్యకు తరలును. సీత సతమస సూర్యుని పూజింపంబోవును.

శ్రీరాముఁడు వాల్మీకాశ్రమము మీఁదుగా పుష్పకమును సాగించును, అప్పటికి సత్త్రము ముగిసి ఋశ్యశృంగునిచే అంపకముం బొంది అరుంధత్యాదులు కోడలులేని యయోధ్యకు మేము పోమని నిశ్చయించుకొన్నవారై వసిష్ఠ ప్రతిబోధన బడి వాల్మీకాశ్రమమునకుం జనిరి. చంద్రకేతుండును జన్నపు గుఱ్ఱము వెంట నటకే వచ్చెను. జనకరాజు తనపురాణమిత్త్రుని వాల్మీకిని దర్శించుటకు తన తపః ప్రదేశమయిన చంద్రద్వీపమునుండి అటకే వచ్చును. కౌసల్యాదులు జనకుం గలయుదురు. జనకరాజు రామునిపై కోపోద్రేకము సూపును. అరుంధతివచనములచే శాంతిం జెందును. వసిష్ఠాదులు వచ్చిన కారణమున వటువులకు శిష్టానధ్యయనము లభింపఁగా లవుఁడు విప్రవటువులతో గూడ అట మెయి ఈవృద్ధు లున్న తావున కరుదెంచును. వాని క్షత్త్రియబ్రహ్మచారి లక్షణలక్షితు నితనిం గని ఇతనియందు సీతారాముల పోలికఁ గని వారిపుత్త్రుఁడోయని ఆసతో భావించియు మరల నిరాశఁ జెందుచును ఉందురు. బాలు నడిగినను దెలియదాయెను. ఇంతలో గుఱ్ఱము వచ్చును, దానిం గన లవుఁడు వటువులతో పరుగు నఁబోవును. అశ్వరక్షకులు "సప్తలోకైక వీరునిది యీ గుఱ్ఱము.

పృథివిలో మఱి వీరుఁ డున్న దీనిం బట్టును గాక!" అని ఘోషింతురు. అబిభీషికకు కినిసి లవుఁడు గుఱ్ఱమును పట్టును. వదలు మని సైనికులు శస్త్రలు జళిపించుచు లవుని బెదరింతురు. బాపనవటువులు ఈగొడవ మన కేల, లేడిదాఁటులం బరారి యగుదము రమ్మని పిలిచిన, లవుఁడుపోఁడు. వారు పలాయితులైరి. లవుఁడు ఒంటరి, లెక్కకు మించిన సైనికులను జక్కాడుచుండెను. వారు దిగులుపడి సాయమునకై కుయివెట్టుచుండఁగా చంద్రకేతువు వచ్చి లవు నెదుర్కొనెను. ఇరువురును ఒండొరులపై అకారణప్రేమ వహింతురే గాని పోర నిచ్ఛగింపరు. అయినను చేయునది లేక పోరుదురు, లవుఁడు జృంభకాస్త్రముచేత సైనికులను స్తంభితులం జేయును. చంద్రకేతుఁడు ఆగ్నేయాస్త్రమును, లవుఁడు వారుణాస్త్రమును, చంద్రకేతుఁడు వాయవ్యాస్త్రమును, ప్రయోగించిరి. ఇంతలో శ్రీరాములు పుష్పకమున వచ్చి మంచిమాటలతో వారి పోరాటమును మానిపించుచు వారినడుమనే దిగుదురు. ఆమహాపురుషుని వాక్కుచే బాలురు యుద్ధము మానిరి.

చంద్రకేతువు రాములవారికి నమస్కరించి, లవుని ఆయనకు తన చెలికానిఁగా ఎఱుకపఱిచి యుద్ధకారణమును విన్నవించును. లవుఁడు చంద్రకేతువువలన ఆయన శ్రీరామచంద్రుఁ డని తెలిసికొని ఆయనకు ప్రణామము చేయును, రాములవారు ఆగాలుని ఒడిలో కూర్చుండఁబెట్టుకొని, సీతాసాదృశ్యముం గని ఆసగొని తదీయ వృత్తాంత మడుగుదురు. బాలునివలన తత్త్వము తెలియదాయెను. బాలుఁడు వాల్మీకి శిష్యుఁడనియు తల్లిదండ్రుల నెఱుంగఁడనియు, ఆతనికి కుశుఁ డని యన్న కలఁ డనియు, ఆయన్న వాల్మీక్యాజ్ఞచే తత్ప్రణీతమయిన శ్రీమద్రామాయణములోని యంతిమభాగమును రూపక రూపకమున నిబద్ధమును అచ్చరలచే ఆడించుటకై భరత

మునిచేతి కిచ్చుటకు భరతాశ్రమమునకుం బోయియున్నాఁ డనియు, ఆరామాయణమును సీతాపరిత్యాగము వఱకు తాము గఱచి యున్నా రనియుం దెలియును. ఇట్లు వీరు భాషించుచుండఁగా కుశుఁడు భరతాశ్రమమునుండి ప్రతినివృత్తుఁడై వటువులవలన లవచంద్ర కేతు యుద్ధవార్త విని అతికోపముతో చంద్రకేతువుమీఁదికి వచ్చుచుండెను. శ్రీరాములం గనఁగానే అతని హృదయమున గురుభక్తియు తదాజ్ఞాకరత్వవాంఛయుం బొడమెనుగాని వైరమన్నమాట లేదాయెను. అతఁడును రామమూర్తిని లవునివలన నెఱింగి వినీతుఁడై దరిసి ప్రణమిల్లెను. రామమూర్తి సీతపోలిక అతనియందునుగని అతనిని ఒడిలోఁ గూర్చుండఁబెట్టుకొని రామాయణ శ్లోకములు చదివించి విని అవి తమ (సీతారాముల) యనురాగాతిశయముం దెల్పువాక్యములగుటచే ఆస్మరణమువలన శోకమున మునింగి బాష్పపూరితవదనుఁడైనంత నచటికే బుడుతలకయ్యంపువార్త విని దిగులున అరుంధతీ వసిష్ఠ జనకాదులందఱును వచ్చిరి. రాముఁడు వారిం గలసి సంభాషించును.

అనంతరము వాల్మీకాజ్ఞచేత సకల స్థావరజంగమ భూత గ్రామము ప్రోల శ్రీరామాదుల సన్నిధిని పూర్వోక్తరూపకము ఆడంబడును. అది కుశలవుల జననమును చూపును. సీతను భూదేవి కాపాడుచుండుటను ఇత్యాదికమును తెలుపును. బయట రామాదులు చూచిన కుశలవులే ఈసీతకుమారులు. అంతలో అరుంధతీ వాక్యములచే సీతా ప్రభావము నెఱింగినవారై త్రిలోకవాసులును సీతకు నమస్కరింతురు. అరుంధతి ఆమెను కైకొమ్మని శ్రీరామునికి ఆనతిచ్చును. శ్రీరాముఁడు కైకొనును. సీత శోకము తీఱి రామునిం గలయును. వాల్మీకి కుశలవులను తెచ్చి తల్లిదండ్రుల కప్పగించును. వారును కౌసల్యాజనకాదులను ఆసమయానకు మధురనుండి వచ్చిన లవణాంతకుఁడు శత్రుఘ్నుఁడును, శాంతాఋశ్యశృంగులును అందఱును కలసికొందురు.

## ౫ ఉ. రా. చ. కథ విమర్శ

### (౧) విపర్యాసములు

ఈకథలో భవభూతి కొన్ని విపర్యాసములు గావించినాఁడు. ఎట్లన.—మూలములో శత్రుఘ్నుఁడు సీతావివాసనమయిన కొలఁది కాలమునకు లవణహననార్థము తరలినాఁడు. దారిలో నాయన వాల్మీకీయ తపోవనంబున బసచేసిననాఁడే కుశలవులు జన్మించిరి. ఆయన లవణుని సంహరించి మధురాపురిని విస్తీర్ణము గావించి పండ్రెండు వేండ్లు ఏలి అందు శత్రుఘాతిని, విదిశయందు సుబాహువును, తనతనయులను నిలిపి తాను అన్నను చూడ నయోధ్యకుం బోయి, అన్ననే సేవించుచుండెను. పిమ్మట కొన్ని మాసములకు బ్రాహ్మణశిశుమృతి, తత్సంజీవనార్థము రామకృత శంబూకహననము, అనంతరము అగస్త్యదర్శనము, మరల అయోధ్యం జేరినతర్వాత అశ్వమేధమున కుత్సహించి లక్ష్మణరక్షితముగా గుఱ్ఱమును విడుచుట. సంవత్సరము ముగియునప్పటికి లక్ష్మణుఁడు గుఱ్ఱముతో పృథివియెల్లం దిరిగి, ఎల్లరాజులవలనను కట్నంబులు తెచ్చి యయోధ్యం జేరును. యాగము జరుగుచుండును. కుశలవులు వాల్మీకియానతిని రామునికడ రామాయణముం బాడుదురు. ఆసందర్భమున రాముఁడు ఈశిశువులను తన పుత్త్రులనకా శంకించి నిరూఢ్యర్థమై సీతను వాల్మీకాశ్రమము నుండి రప్పించును. సీత వచ్చును. సీత నిష్కల్మష యని వాల్మీకి సభాసదులతోను రామునితోను వాక్రుచ్చును. సీత,

శా. "రామస్వామిపదాంబుజంబు లెద నారాధింతు నేనిన్ సదా
రామాజ్ఞన్ జరియింతునేనిఁ దగుజాగ్రత్స్వప్నసుప్త్యాదులం
రాముం దప్పవిదాన నౌటయు యథార్థంబేని నాతల్లి యో
భూమీ యీయెడఁ ద్రోవఁ జూపి నన్ గొంపోవమ్మ నీలోనికిన్." ఉ. రా.

అని పలికి భూమిలోనికి అడంగును.

"ఏవ ముక్తే తయా సాధ్వ్యా రన్ధ్రాత్ సద్యోభవా ద్భువః
శాతహ్రద మివ జ్యోతిః ప్రభామణ్డల ముద్యయౌ.
తత్ర నాగఫణోత్క్షిప్తసింహాసనవిషేదుషీ
సముద్రరశనా సాక్షాత్ ప్రాదురాసీ ద్వసున్ధరా.
సా సీతా మఙ్క మారోప్య భర్తృప్రణిహితేక్షణామ్
మా మేతి వ్యాహర త్యేవ తస్మిన్ పాతాళ మభ్యగాత్." రఘు. 15.

శ్రీరాముఁడు నిజపుత్త్రిలను కుశలవులను గ్రహించి అశ్వమేధంబును సమాప్తి నొందించును.

ఇది వాల్మీకివిరచితోత్తర కాండ కథాఫక్కిక. ఇందు కుశలవులు గుఱ్ఱముం బట్టుటయు. వారితో పోరును, లేవు. జైమినిభారత కథ ఇంతకన్నను ఉ. రా. చ. కథంబోలి యున్నది. అందు అశ్వమేధయాగకథ యిట్లున్నది :—

యజ్ఞాశ్వముతో శత్రుఘ్నుం బంపుదురు. అది వాల్మీకాశ్రమమునకుఁ జనును. లవుఁడు దానిని కట్టివైచును. శత్రుఘ్నుఁడు లవునోర్చితురగమును విడిపించుకొని మూర్ఛితుని లవునిం దనయరదముపై నిడుకొని తురగము వెంబడిం జనును. ఈవృత్తాంతము విని కుశుఁడు తఱుముకొనివచ్చి, శత్రుఘ్నుం దాఁకును. శత్రుఘ్నుఁడు పడును. లవుఁ డన్నం గలియును. పిమ్మట శ్రీరాములు లక్ష్మణుం బంపుదురు. అతఁడును కుశునిచేఁ గూలును. అంత రాముఁడు శోకించి భరతుం బంపును. అతఁడునుం గుశుచేత పడును. అనంతరము శ్రీరాములు స్వయముగా వచ్చి బాలురతో పోరి మూర్ఛితులగుదురు. వాల్మీకి వరుణలోకమునకుం బోయియున్నప్పుడు ఈగందరగోళము జరిగినది. ఆయన వచ్చి వృత్తము విని శ్రీరామాదులకడకుం జని మూర్ఛితుల నాభ్రాతల నెల్లం దేర్చును. రాములవారికి కుశలవులను తత్పుత్త్రిలని తెలిపి సీతతోఁగూడ అప్పగించును. వారిందోడ్కొని రాముఁడు

తానును సోదరులును అయోధ్యకుం బోవును. అచట రాముఁడు సుత భార్యాయుతుఁడై యజ్ఞము ముగించి సుఖముండును.

భవభూతి ఈ జైమినిభారతీయకథా సరణిని హెచ్చుగా నవలంబించియు ఔచిత్యపోషణకై పెద్దలకు తమనిసుఁగులచే అప జయముం బెట్టక, వారి బాలునే ఇంకొకని చంద్రకేతువును తెచ్చి ఈయిరువురలో చిన్నవానికే ఉద్దిగా పెట్టినాఁడు. అతనికేనియు అప జయము వఱకు రానీయక భావి సంఘటనార్థము రాములవారినే యుద్ధము మాన్ప రప్పించినాఁడు. ఆరాక వారికార్యమార్గముననే సంభవించినదిగా నుండునట్లుగా ఉత్తరకాండలోని కథ ననుసరించి నాఁడు. అదియెట్లన.—విప్రబాలక మృతి, తత్సంజీవనార్థము శంబూకవధ, అగస్త్యులవారిని దర్శించుట, వారికడనుండి అయో ధ్యకు మరలఁబోవుచు మార్గవశాసను పూజ్యాతిక్రమ పరిహారార్థ మును వాల్మీకాశ్రమ సమీప గమనము. అని యివ్విధమున సంవి ధానము విరచితము.

### (b) కొన్ని లఘువిషయములు

ఈసందర్భముననే కొన్ని లఘువిషయములను హెచ్చరించెద. ఈ నాటకమందు సకల వృత్తములును ప్రయత్నపూర్వములుగాక, ఎవరును ముందుగా పన్నినవిగాక నాయకాది లోకయాత్రానుషం గికముగానే సముత్పన్నములుగా మహాకవిచేత గ్రువ్వఁబడినవి. అంత టను ఆయా మహనీయుల యౌన్నత్యమునకు ఏలోపము రాకుండు నట్లు ఔచిత్యము కావఁబడినది. మహారాజ భార్యకుఁ గలిగిన నిందను కవి ఆమెచెవిని బడిన అదుఃఖము వివాససమయమున అనిర్వచనీయ మగునని ఆమెకుఁ దెలియనీయ లేదు. కవి దాని ప్రస్తావము ఎక్కడ వలసినను చెవిలో చెప్పించినాఁడు. స్పష్టముగా చెప్పవలసిన సమయములలో అపవాదమని మాత్రము పలికించినాడేఁగాని కంఠోక్త

ముగా తత్స్వరూపమును ఉచ్చరింప లేదు. ఈతీరున ఆదివ్యాదివ్యుల మహిమం గాచిన నేర్పు కరము హృదయంగమమై ఈనాటకమున కెల్ల నుత్తమాలంకారమై యున్నది. అపవాదకథను జైమినిభారతములోఁ గనుఁడు :—

చ. "రజకి యొకర్తు నాథుఁడు తిరస్కృతి సేసినఁ బుట్టినింటి కేఁ
గ జనకుఁ డాత్మజం గని జగజ్జనగాత్రమసీమసాంశుక
వ్రజములు శుద్ధిసేయువిజవంశము మైలపడంగఁజేసి, తిం
టి జగడ మింటిలోన హవణింపక నీ విటు లొంటి వచ్చుటల్.

చ. అని తనకూఁతుఁ దోడ్కొనుచు నల్లునియింటికి నేఁగ మామఁ జూ
చలనముతోన నే యొరికినట్లుగ మండుచు నిల్లువెళ్లి నా
ల్దినములు నేఁడు నాకడకుఁ దెచ్చితి నే నలరాఘవుండనే
దనుజగృహీత సీతఁ దనదారఁగఁ గ్రమ్మరఁ దెచ్చి యేలఁగన్."

అష్టావక్రుఁడు రామసన్నిధినుండి పోవునప్పుడు 'ఓహో! కుమారలక్ష్మణుఁడు ప్రాప్తుఁ డాయెను' అని వచించుట—అతని యతర్కితోపనతదర్శనముచేత నయిన తనసంతోషమును తెలుపుచు కథామార్గముననను, పాత్రసూచనగా రూపకమార్గముననను అన్వయించుచున్నది. సీతం బంపుటకన్న ముందే లవణునిమీఁదికి శత్రుఘ్నుని పంపుటకై శ్రీరాములవారు నిష్క్రమించుట—సీతను అడవింద్రోయుటకు ఒంటిని కొనిపోవు దుఃఖమును చూడలేక ఆ తావుం దలంగుటకై యని కథామార్గము, అంకాంత నిష్క్రమణ నిమిత్తమని రూపకమార్గము. చిత్రదర్శన సంవిధానంబును పునస్సంఘటనంబును వట్టివై చిత్రికొఱకే అని కతిపయులతలంపు గాని, చిత్ర ప్రదర్శనము ఏతన్నాటక బీజభూతమైన సీతావివాసనమును సమకూర్చుటకై భాగీరథీదేవియందు పవిత్ర శీతలజలంబుల నాడను ప్రసన్నగంభీరము లైన వనవీథులయందు విహరింపను సీతకు గర్భదోహదము నుప్పతిలం జేయుటకును, ఆకోరికను, తీర్చుటకై యని

యాఁడు తలంచునట్లుగా ఆమెను కానకుం బంపుటకొఱకును; అట్లు వ్యాజమునం బంపుట—అపవాదమును మొగమునం బలికి బందిగా ఆపరమపునీతను పతిదేవతను జగన్మంగళమూర్తిని బలాత్కారమునఁ బంపించుఘోరతను తప్పించుకొఱకును, అని యెఱుఁగఁదగును. కావున, చిత్రదర్శనకల్పన అప్రయోజకము గాక భవభూతియొక్క సమర్థ సంవిధానరచనావైదగ్ధిని కరము నిరూఢము సేయుచున్నది.

వసిష్ఠులవారు "ఎప్పాటనైన లోకారాధనము సేయుమా" యని రామునికి ఆనతిం బంపుట తప్పక సీతను అడవికిం బంపు మనుటయే. వీరప్రసవవు కమ్మని సీతను దీవించుటయు ఆదీవన తప్పదని రాముఁడు భావించుటయు—ప్రవాసమందును సీత కేమియుం గీడు గలుగ దని సూచించుటచే పునస్సంగమప్రత్యాశను ఉచ్ఛిన్నము గానీయక కాపాడుటకు. గర్భాంకము పునస్సంఘటనార్థమై సీతాప్రభావమును త్రైలోక్యమునకు ప్రత్యక్షీకరించుటకు; పునస్సంఘటనము మంగళాంతతకొఱకు. అది సామాజికాది చిత్తోద్వేగ శాంతికొఱకు; పునర్ఘటనము లేనిచో లోకులకు సత్ప్రవర్తన యందు శ్రద్ధ తఱుఁగును. నాటకము హృద్యము గాక పీడాకర మగును. గర్భాంకాంతమున "ఏమి వైదేహికి విలయమే సమకూడినది! హా దేవి!" అని రాముఁడు మూర్ఛిల్లుటయు, లక్ష్మణుఁడు "భగవంతుఁడా, వాల్మీకీ, కావుము కావుము! ఇదియా నీ వాక్యార్థము!" అని యాక్రోశించుటయుం గనుఁడు. లఘుహృదయులు ఇట్లు బెదరుదు రనియు భవభూతి తాదృశ జన పరితోషార్థము ఈ పునర్ఘటనమును కల్పించినాఁ డనియు ఉక్త విమర్శకుల వచనము. కాని అతనికి పూర్వమే జైమిని మునియే కథను మంగళాంతముగా మార్చినాఁడు. భవభూతి తదనుసారముగా రచించినాఁడు గాని వట్టి చిత్రముకొఱకు మార్చినవాఁడు గాఁడు. ఈవిషయము వక్ష్యమాణమున ఇంకను ద్రఢీకృత మగును.

భాగీరథ్యాదులు శ్రీరామునికడకుం బంచవటికి సీతాదేవిం బంపుట రామరక్షార్థంబును, రాముని తీవ్రానురక్తిని ప్రత్యక్షము సేయుటచేత సీతను తత్పునస్సంగోత్సుకం గావించుటకును. శంబూక వధాదివృత్తములను ఒకటినుండి యొకటి యుత్పన్నమైనట్లు కల్పించుట - అయోధ్యనుండి పెక్కు పయనములు తప్పించుటకు. పుట్టఁబోవు సీతాప్రసూతికి చిత్రదర్శనమున జృంభకాస్త్రముల నిచ్చుట - ఆ కారణమున వారిని రాముఁడు తన తనయులనుగా అనుమానించుటకు. పునస్సంఘటన సమయమునకు శత్రుఘ్నుఁడును వచ్చినట్లు వర్ణితము. అతఁడు లవణునిఁగూల్చుటకు ప్రథమాంకమునం దరిలినవాఁడు. వానిం గొట్టిరా నింతకాలము (పండ్రెండు వేండ్లు) పట్టెనా యని కొందఱాక్షేపించిరి. అతఁడు లవణుం గూల్చి, మథురను మరలం గట్టి, అందు పండ్రెండేండ్లు ఏలి, తనపుత్త్రుల నిరువుర నచట రెండు రాజధానులందు దొరలం గావించి, అనంతరము తాను శ్రీరామపాద సేవార్థము వచ్చినట్లు ఉత్తరకాండ కథ. ఈతీరున ఇందు కవికృతి సంవిధానములకు నిమిత్తములం గనునది.

కవి ఈ నాటకమునందు సీతారామ పునస్సంగమును ఆది నుండియు పన్నుచునే గ్రంథము నల్లినాఁడు. ప్రస్తావనలోనే కవి "ఎల్లవిధములను ఋషులును దేవతలును మేలుసేయుదురు" రను నట వాక్యముచే వాల్మీక్యాది ఋషులును గంగారుంధత్యాది దేవతలును సీతాశుద్ధిని స్థాపించి సీతారాములను మరలం గూర్తు రని భావార్థమును సూచించినాఁడు. మఱియు "అమ్మాయీ...పుత్త్రిపూర్ణమైనయొడితోడి నిన్ను ఆయుష్మతిని చూడఁగలము" అని సీతకు ఋష్యశృంగులవారు పంపిన సందేశమందు అభిప్రాయములు వెల్లిగానున్నవి. అప్పుడే ఆయన తొడంగినది ద్వాదశవార్షికము సత్త్రము. అనంతర మేగదా ఆయన ఆమెను చూడఁగలుగును, కావున, ఆ

పంద్రెండు ఏండ్లును ఆమె సురక్షితగా నుండు నని యేర్పడుచున్నది. అందువలన శ్రీరాముని ప్రత్యాశ సురూఢమైయున్నది. సుఖితం గాంచెద మని మునిహృదయమగుఁ గాని దుఃఖితం గాంచెద మని యుండదు. కావున ఆయన వాక్కుచే పునస్సంగమే సూచితమైనది. అట్లే పునస్సంగ సమయంబున ఋశ్యశృంగుఁడు తన మాటచొప్పున పుత్రీపూర్ణోత్సంగనే ఆమెను దర్శించినాఁడు. ఈ పునర్ఘటనము వాక్యములందు మిక్కుటముగా సూచిత మయినను దిక్ప్రదర్శనార్థము కతిపయములనే ఉదాహరించెద. తృతీయాంకము కడపట—

"అవని యమరనదియు నస్మద్వధలు గూడఁ,
దొలుతఁ గవిత గన్న కులపతియును,
అలవసిష్ఠుఁ డనుగతారుంధతీకుండు,
నిత్యమంగళములు నింత్రు మీకు."

అని తమసా వాసంతులు సీతారాములకు నిత్యమంగళమును ఏ పృథ్వీ భాగీరథీ వాల్మీకి వసిష్ఠారుంధతులు నింపుదురుగాక యని యాశీర్వదించిరో ఆపృథివ్యాదులే సప్తమాంకమున సీతారామసంయోజన మందు సోద్యములై దానిని సాధించిరి. ఇందువలన ఆభావివృత్తమును ఇప్పటికే ఆదినుండియే భవభూతి పన్నుకొని తదనుగుణముగా అంకములను అల్లుకొనుచుండుట స్పష్టము గాదా? తృతీయాంకమునకు ముందు విష్కంభములో—

"ఇట్టివారు విపాకంబు నెనయ, నదియుఁ
బరమ విస్మయకారిగాఁ బరిణమించు;
అందు సాహాయ్యకము సేఁత నట్టివారు
పూనుదురు తముఁదామ యపూర్వగతుల."

అను వచనముచేతను కవి పూర్వోక్తార్థమునే సూచించినాఁడు. అట్టివా రనఁగా పృథ్వీభాగీరథు లని దీని ముందువెనుక వాక్యము లందు స్పష్టము.

శ్రీరాములవారు దుర్ముఖునిచే లక్ష్మణునికిం బంపినయాజ్ఞ సీతను వాల్మీకాశ్రమముచెంతవిడువుమని. చూ. "అప్పుడు వాల్మీకి తపోవనసమీపమున" ఇత్యాది, 29 పు. ఆమె వాల్మీకాశ్రమము చేరమియు భాగీరథిలో పడుటయు తృతీయాంకముకొఱకును. సీతారామసంయోజనమందు ఆమె చక్కఁగా వ్యాపృతి యగుటకొఱకును. సీత వాల్మీకాశ్రమము చేరినచో ఇందలితృతీయాంకవృత్తము– అనఁగా రాములవారు వాల్మీకాశ్రమమునకు రాకముందే వారిని ఆమెచూచుట– ఘటింపదు. ఈమార్పు భాగీరథీమూలముగా సీతాహృదయమునుండి పరిత్యాగశల్యోద్ధరణము సేయించుకొఱకు. అది పునస్సంయోజనాపేక్షచేత. ఆశ్వస్త గాదేని పునస్సంయోజనము నొల్లదు. అట్లే ఉత్తరకాండకథలో పునర్యోజనము నొల్లక యడంగినది. అట్లుగాకయుండ మంగళపర్యవసానమునకై భాగీరథిప్రయత్నము. భాగీరథిని చిత్రదర్శనమున రామునిచే "ఆ తల్లీ నీవు కోడలు సీతయందు అరుంధతియుంబోలె శివమును అనుధ్యానింతువు గాక" అని వేడించుటచేత ఆయమను కవి పునస్సంయోజనార్థము అప్పుడే ఆదిలోనే నిబంధించినాఁడు. పుత్త్రపూర్ణోత్సంగనుగాఁ దెచ్చి రామునితోఁ గూర్చుటకన్న శివమేమున్నది? తనశ్రేయముం దలంపుమని రాముఁడు ఆమెను వేఁడలేదు. తృతీయాంకమున మాటిమాటికిని రామునిం బ్రమాదములనుండి సీతమూలముగా తప్పించుటయు సీతాశ్రేయముకొఱకే. అట్లేగంగాపృథ్వులు ప్రథమాంకములో రాముఁడు వేఁడినమాటబడి సీతారాములకు మేలు గావించి వారిని సమకూర్చుచు సప్తమాంకము తుదిని ఆయనమాటను ఆయనకు అప్పగించి తమ కృతార్థతం దెలుపుకొనిరి. అరుంధతీ వసిష్ఠాదులు కోడలు లేని యయోధ్యకు తాము పోరని ప్రతినసేసి వాల్మీకాశ్రమమున నిలుచుట– సీత జగదేకపావని యని లోకమునకు దెలుపుటకును, ఆమూలముగా పునస్సంయోజనము సాధించి సీతారాములకు దుఃఖా

పనోదనము గావించుటకును, అగునేగాని ముందు కానకు పంపితీఱ వలసిన దని తామే వ్యాజముగా చోదనచేసి పంపినందులకై పిమ్మట తామే అసమ్మతిం దెలిపి దుఃఖార్ణవమగ్నునికి శ్రీరామునికి మెడం బాషాణము గట్టుటకుఁ గానేరదు. చతుర్థాంకమున లవునిఁగూర్చి ప్రశ్నించిన జనకునికి అరుంధతి ఉత్తర మొఱంగియు చెప్పకుండుటయు, “సమయమున నెఱింగెదరు లే” అని పలుకుటయు, లోలోపల జరుగుచున్న పునస్సంయోజన ప్రయత్నమునే సూచించుచున్నది. చతుర్థాంకములోని యీయుద్ధారముం గనుఁడు:—54 పు. “కౌస.—నాతూనా, జానకీ!.....వీరినుడులు 16.” నాటకము పునస్సంయోజనప్రవణ మనుటకు ఇంతకన్నను ప్రమాణము ఉండునా? పుత్రపూర్ణోత్సంగ సీతాసమాసత్తి రామునికి కాఁగల దను నీరహస్యమును వసిష్ఠులవారు ఋశ్యశృంగాశ్రమములోనే ఆదిలోనే కౌసల్యతో చెప్పినా రని యీ గ్రంథార్థము.—ఇట్లీనాటకము సీతారామ పునస్సంగ మంగళార్థమే వ్రాయఁబడిన దనుట స్పష్టము.

ఈలోకోత్తరనాటకము శ్రవ్యప్రబంధముగా రంజించును గాని దృశ్యముగా రంజింపదని పాశ్చాత్య సంస్కృత పండితులును నూతనమతప్రియు లగునస్మదీయులే కతిపయులును పలికిరి. కాని, ఇది దృశ్యముగా నత్యంతరంజక మగు నని ఆబాల్యము నాతలంపుగా నుండెను. మదరాసు క్రిస్టియన్ కాలేజిలో ప్రధానసంస్కృతోపాధ్యాయుఁడనై నంతట, బి. ఏ. పరీక్షకు ఉ. రా. చ. పఠనీయము కాఁగా, నా శిష్యులకుం బైమతభేదమును నామతమును తెలిపి, తదీయ స్థాపనార్థము వారిచేత ఈనాటకమును మదరాసు పౌరసౌధములో ఆడించి, ఇది రంగమందు అత్యంతరంజకంబనియు, అభిశాకుంతల మనియు, క్రిక్కిఱిసిన వేగురు రసికవిద్వజ్జనులకు ప్రత్యక్షము గావించినాఁడను. ఆప్రయోగము జరిగి ఇప్పటికి 34 సంవత్సరము లయినను, ఆ

శంబూకదివ్యపురుషుని రామస్తుత్యాది పద్యంబులు ఇప్పటికిని నావీనులలో అనురణనముం గావించుచుచే యున్నవి. సీతాదిసకలపాత్రములును వారివారిచర్యలును కన్నులయెదుర ఇప్పటికిని మెలఁగుచున్నవి. అనంతరము ఎన్ని నాటకములు చూచినను ఈ విధముగా డెందమును బందిగొన్నట్టిది మఱిలేదు.

ఈనాటకమున ప్రథమాంకములో శ్రీరాముఁడు తనకంఠమున సీతబాహువును ఉంచుకొనును. శ్రీరామునియురమున సీత శయనించును. ఇట్టిది పరిషత్ప్రమోల ప్రీడాకరము గాదా? అట్టి యాస్థితిలో నున్న శ్రీరామునితో దుర్ముఖుఁడు సంభాషించుట తగునా? ఇచట పాత్రములు వాక్యములను మాత్రము యథోక్తముగాఁ బలికి క్రియను ఇంచుక సంక్షేపించి ఇంచుక మార్చుకొనవచ్చును.

"చరణగతాధ్వఖేదమున" 8 (17). "ఒక్కొకకేల" 9 (20)- ఇట్టి పూర్వారహోవృత్తములను రాముఁడు సీతతో లక్ష్మణుని వినికిలో నిర్లజ్జముగా ఎట్లు వచించును? ఇట్టిసమయములందు లక్ష్మణపాత్రము ఈపాత్రముల వాక్యములను వినక ఆవలికి జరిగి, వీరికి చూపట్టై చిత్రవీథిలోని పైపైవినోదములను అరయు చుండుట నభినయింప వలయును.

అంతర్నాటికాదర్శనమునకు హనుమత్సుగ్రీవ జాంబవద్విభీషణులను రావింపలేదా యేమి? లేదు. ఏలన, వారికి వహ్నియందు సీతాశుద్ధి ప్రత్యక్షీకృత పూర్వమే.

సప్తమాంకమున శ్రీరాముఁడు లక్ష్మణునితో కుశలవులకు చంద్రకేతు సమముగా స్థానమర్యాదల నొసఁగు మని యానతియ 84, లక్ష్మణుఁడు అట్లే కావించితినని ఉత్తరము చెప్పును. రామవాక్యమందు 'ఈబాలుర నిరువురను' అను పదములలోని యేతచ్ఛబ్దము చేతను, లక్ష్మణోత్తరములోని భూతప్రయోగము చేతను ఆబాలు

రచట వచ్చి కూర్చుండియున్నా రని తోఁచును. అట్లుండ, వారు పిమ్మట వాల్మీకితో ప్రవేశింతురు. వారు సమాజమునుండి ఎప్పుడు లేచిపోయిరి? పాత్రనిర్గమము అసూచితముగా జరుగఁగూడదుగదా. ఇది యెట్లు సంగతపడును? అని ప్రశ్న. వాస్తవముగా వారు సమాజములో వచ్చికూర్చుండియే యున్నయెడల వారిని రాములవారు చూడనే చూతురు, కావున లక్ష్మణునితో ఆయాసతిం బలుకవలసిన పనియే యుండదు. పలికిరి గావున అప్పటికి ఆబాలురు వచ్చి గూర్చుండలేదు పిమ్మటను సమాజములోనికిరా లేదుఁ. వాల్మీకి తేరఁగా తండ్రిం జేరవచ్చిరి. లక్ష్మణవాక్యమునకు "వారికి చంద్రకేతువుతో తత్సమాన మయినస్థాన మేర్పఱచియున్నాను" అని యర్థమే గాని "వచ్చి కూర్చున్నారు" అని అర్థముగాదు ఇందుచేత శ్రీరాములవారు ఆ బాలురు తమపుత్త్రులనియెడు భ్రమను వదలుకొనుట సూచితము.

ఈనాటకమున హాస్యరసము లేదని హాణపండితులవచనము. లేమి వాస్తవమే. ఇందులోనే గాదు, ఈయన నాటకములు మూఁడింటను అది మృగ్యమే. ఇందు సౌధాతకి మాటలలో కొంచెమున్నది. మాఁటను వెదకినచో మందునకు నించుక యగపడును. ఇందలి స్త్రీపురుషులు అత్యుదాత్త ప్రకృతు లగుటంబట్టి హాస్యప్రసక్తి లేదాయెనని చెప్పుదముగాక, మాలతింగూర్చి యేమి చెప్పగలము?

ఈనాటకములో పంచమాంకముతుదను లవుఁడు చంద్రకేతునికడ శ్రీరామ ప్రభావాధిక్షేపము సేయుచో 70 (౩౫) "ముందడుగుల్ ఖరాజనవి మూఁడడుగుతో భయముల్ సెలంగవే" అని సడివెట్టుచున్నాఁడు. ఈమూఁడు వెనుకంజల వృత్తము వీరచరితలో వర్ణితము గాదు. పైగా "ఇంద్రజు సేయు నేరుపును" అని యధిక్షేపించినాఁడు. ఈమాట రాముఁడు వాలిని ఎదుర్కొని కొట్టనేరక

చెట్టు చాటునుండి కొట్టుటను తెలుపుచున్నది. వీరచరితమందు వాలి రాముని మడియింప నుద్యుక్తుఁడై అతనిమీఁదికి పోర వచ్చి యత నిచే మడిసె నని యున్నది. ఇట రెండు నాటకములు పరస్పర విరుద్ధముగా నున్నవి. లవుఁడు రామాయణకథ ననుసరించి పల్కె నేగాని, భవభూతివీర చరితముం బట్టి పలుకలేదు. ఐనను మహాకవి తనతొలి పల్కు తాను అడంచి యిట నొండునగం బలుకుట చిత్రము.

మఱియొకటి—ఇందు "నడిమియమ్మవృత్తాంతమును అన్నయ్య అణఁచి వైచినాఁడు" అని చిత్రప్రదర్శనములో లక్ష్మణవాక్యము. వీరచరిత్రలో శూర్పణఖ మంథరావేషమున వచ్చి రామప్రవాసమును కైకేయీప్రార్థితముగా సాధించె ననియున్నది. ఇట లక్ష్మణవాక్యమున తద్విరుద్ధమైన రామాయణోక్త వృత్తాంతమే పరాస్పృష్టమై యున్నది. ఇటనుం గవి తనపూర్వరచనను తాను పాటింప లేదు.

క్షేమేంద్రుఁడు చేసిన యుత్తరరామచరిత్రగత కతిపయవిషయాచిత్యచర్చ.

1 ప్రబంధౌచిత్యముక్రింద.—యథావా భవభూతేః—

(నేపథ్యే) యోఽయ మశ్వః పతాకేయ మథవా వీరఘోషణా

సప్తలోకైక వీరస్య దశకణ్ఠకులద్విషః.

లవః—(సగర్వ మివ) అహో సంతాపనా న్యక్షరాణి। భో భోః, కి మక్షత్రియా పృథివీ య దేవ ముద్ఘుష్యతే। (విహస్య) ఆః కిం నామ స్ఫురన్తి శస్త్రాణి। (ధనురారోపయన్)

జ్యాజిహ్వయా వలయితోత్కటకోటిదంష్ట్ర
ముద్గారి ఘోరఘనఘర్ఘరఘోష మేతత్
గ్రాసప్రసక్తహసదన్తక వక్త్ర యన్త్ర
జృమ్భావిడమ్బి వికటోదర మస్తు చాపమ్.

ఇందుల తెనుఁగు మదీయము—పు. 60 - 61 (నేపథ్యమున) అశ్వమిదె...(26)

లవు—[వ్యథతోనుం బోలె] అహో రగిలించుచున్నవి యక్షరములు! ఓహోయి, ఇల్లు ఘోషించెదరే!, పృథివిలో క్షత్రియులు లే రనుకొన్నారా యేమి? [నవ్వి] ఏమి! శస్త్రములను జళిపింతురా! [విల్లెక్కువెట్టుచు] జ్యారసన...(27)—ఇందుపై విమర్శ—

అత్రార్థే రామాయణ కథాక్రమేణ సూత నోత్ప్రేక్షితా రామకనయస్య సహజ విక్ర మానుసారిణీ శౌర్యోత్కర్షభూమిః పరప్రతాపస్పర్ధాసహిష్ణుతా ప్రబన్ధస్య రస బన్ధురా మౌచిత్యచ్ఛాయాం ప్రయచ్ఛతి.

(2) వీరరసౌచిత్యము క్రింద—న తు యథా భవభూతేః—

వృద్ధా స్తే న విచారణీయచరితా స్తిష్ఠన్తు హుం వర్తతాం
సున్దస్త్రీదమనేఽప్యఖణ్డయశసో లోకే మహాన్తో హి తే
యాని త్రీ ణ్యకుతోభయా న్యపి పదా న్యాసన్ ఖరాయోధనే
య ద్వా కౌశల మిన్ద్రసూనుదమనే తత్రా ప్యభిజ్ఞో జనః.

ఇందుల తెనుఁగు మదీయము.—ఉందురు,...70 (85), ఇందు విమర్శ.

అ త్రాప్రధానస్య రామసూనోః కుమారలవస్య పరప్రతాపోత్కర్షాసహిష్ణో ర్వీరరసోద్దీపనాయ సకల ప్రబన్ధ జీవితసర్వస్వభూతస్య ప్రధాననాయక గతస్య వీర రసస్య, తాటకాదమన ఖరదూషణాపహర ణాన్యరణసంసక్తవాలివ్యాపాద నాది జనవిహితాపవాదప్రతిపాదనేన స్వవచసా కవినా వినాశః కృత ఇత్యనుచిత మేతత్.

(3) దేశౌచిత్యము క్రింద.....యథా భట్టభవభూతేః।

పురా యత్ర స్రోతః పులిన మధునా తత్ర సరితాం,
విపర్యాసం యాతో ఘనవిరళభావః క్షితిరుహామ్.

బహో ర్దృష్టం కాలా దపర మివ మన్యే వన మిదం,
నివేశ శ్శైలానాం త దిద మితి బుద్ధిం ద్రఢయతి.

ఇందులకు తెనుఁగు 25 (18). దీనిపై విమర్శ.—

అత్ర బహుభి ర్వర్ష సహస్రై రతిక్రాన్తైః శమ్బూకవధప్రసఙ్గేన దణ్డకారణ్యం రామః పూర్వపరిచితం పునః ప్రవిష్టః సపన్తా దవలో క్యైవంబ్రూతే....'పురా యత్ర నదీనాం ప్రవాహ స్త త్రేదానీం తటమ్, వృక్షాణాం ఘనవిరళత్వే విపర్యయ శ్చిరా ద్దృష్టం వన మిద మపూర్వ మివ మన్యే, పర్వతసన్నివేశస్తు త దై వైత దితి బుద్ధిం స్థిరీకరోతి.' ఇత్యుక్తే చిరకాల విపర్యయ పరివృత్త సంస్థాన కానన వర్ణనయా హృదయసంవాదీ దేశస్వభావః పరమ మౌచిత్య ముద్ద్యోతయతి.

సీతా వివాసనము ధర్మ్యమా, అధర్మ్యమా

పూర్వోక్తమును చక్కఁగా నవగాహించిన, ఈ ప్రశ్నకు అవకాశమే ఉండదు. అయినను వ్రాచెద. ప్రజారంజనార్థము శ్రీ రాముఁడు సీతను దూరీకరించెను. తద్రంజనమే తద్ర్వతము, "అర్మి లినిగాని" 4(5) వివాసనోపదేష్టలును తత్ప్రేరకులును "తప్పక వేక టికోరికం దీర్చునది" యనియు, "ప్రజల రంజింపఁ దివురు మెప్పాట నైన" 4 (4) అనియు, చెప్పిపంపిన యరుంధతీవసిష్ఠులు, సీతం గూర్చి నడివచ్చినంత తన్నివారణముకై సీతావివాసనముకన్న నుపా యాంతరము లేదు ["ఏసాధు" 14 (35)]. ఎల్లవారింగూర్చి సీతా శుద్ధిం దెలుపరాదాయనిన, అది ఆ పెద్దలు లేక నిరవమానముగా నెట్లు జరుగును? వారు జన్నమును అకాలమున వీడి యెట్లు వత్తురు? వారికి సమయమై వారు వచ్చి ఆయుపాయమునే ప్రయోగించువఱకు (7 అం) వివాసనము తప్పదాయెను. ఈలోపల వియుక్తి శుభోద ర్కమే యని ఆశీర్వాద వాక్యములచే సీతారాములకు తెలిపినవారు (అరుంధతియు) వసిష్ఠుఁడును ఋశ్యశృంగుఁడును: "వీర ప్రసవవు గమ్ము" "మఱి పుత్త్రపూర్ణమైన నొడిలోడి నిన్ను ఆయుష్మతిని

చూడఁ గలము." రాముఁడు సీతాశుద్ధి నెఱుఁగనివాఁడు గాఁడు 5 (6), (7), 14 (36). పౌరులు సీత నింట నుండనీయనందులకు వారు నింద్యు లని తమస స్థూలదృష్టిచేఁ బలుకుఁగాక; సూక్ష్మమతి శ్రీరాములవారు పౌరులను నిందించుట తగవుగా దని పలికినారు: "విశ్వసించు నెవఁడు దవిష్టవృత్తి" 15 (37). భాగీరథియు రాముని మతమే వహించినది: "జ్ఞేయం దల్లైను..."87 (6), తెలియక, "తర మెవ్వరికౌను వారితత్త్వము తెలియ" 21 (7). వాసంతి వివాసన మకార్య మన్నది-"ఏల యీ యకార్యమును దేవర గావించెను?" 40, "ఓయి కఠోర" 40 (20), "ఈవె మదీయ జీవితమవు" 89 (19). పితృత్వకారణంబున జనకుఁడు రామునిపై అలిగియు, "ఈవిశసాశనిప్రహతి" 59 (23), అరుంధతి హెచ్చరించిన ప్రజాపాలన కారణమునకు 59 (22) సమాధాన మొందినాఁడు "ప్రోవక" 58 (23). అట్లె గర్భప్రీతి కారణంబున పృథ్వీదేవి రామునిపై కడు నలిగియు, 'శాల్యమునను' 86 (5), భాగీరథీ బోధనచే 87 (6), సమాధానపడినది. ఈమెయు భాగీరథియును సీతావిశుద్ధిని స్తుతించుటచేత పౌరజానపదులు సమాధానపడి సపుత్త్రి సీతారామ సమ్మేళనము నంగీకరించిరి. ఆశుద్ధిని స్థాపించి పౌరులను సమాధానపఱుచుట సీతాశుద్ధికిని రామునియశమునకును అత్యంతావశ్యకమని పెద్ద లెల్లరుం దలఁచి, అట్లె సంవిధానముం గూర్చిరి. ఇట్లు సీతావివాసనము సాధువేగాని అసాధువుగాదు.

ఈ విషయంబున కేలు (Kale) పండితుల యు. రా. చ. యుపోద్ఘాతము నందలి యీసంవాదముం గనుఁడు:—

"Shallow critics, with their gratuitous sympathy with Sita for her cruel abandonment in the forest, are inclined to find fault with Rama for his undue solicitude for the contentment and happiness of his overnice subjects. They miss the very beauty of Rama's life when they

take such a narrow view of it. Judged by the ideal standard of duty, Rama deserves our approbation of his wonderful self sacrificing nature rather than condemnation for the seemingly cruel deed. No one was more conscious of the cruelty of the action than Rama himself as is evident from his utterances in the drama, but as he lived for his subjects he was bound to please them at any cost to himself. No one was more conscious than Rama himself of the sterling womanly qualities of Sita—almost an idealistic picture of every virtue that ennobles womanhood and gives it a peculiar majesty and grandeur, but when called upon by the stern voice of duty, Rama throws her off inwardly feeling the deepest anguish for the cruel step that he is forced to take."

## ౧౦ రసచర్చ

ఈ నాటకమందు రసము ధర్మవీర మనియు, నాయకుఁడు ధర్మవీరుఁ డనియు వక్కాణించువారుం గలరు. అందులకు వారియుపపాదనము.

"ఉత్సాహాత్మా భవేద్వీర స్త్రిధా ధర్మాజిదానతః
నాయకోఽత్ర భవేత్సర్వైః శ్లాఘ్యై రనుగతో గుణైః." — వాగ్భటః.

"ఉత్సాహాత్మా వీర స్స్యాత్త్రేధా యుద్ధధర్మదానేషు
విషయేషు భవతి తస్మి న్నషేధో నాయకః ఖ్యాతః." — రుద్రటః.

"ధర్మ దాన యుద్ధభేదా త్త్రిధా వీరః." — హేమచన్ద్రః.

"వీర శ్చతుర్ధా। దానదయాయుద్ధధర్మై స్తదుపాధే రుత్సాహస్య చతుర్విధత్వాత్."

ఈ నాటకమున నాయకునందు ధర్మవీరతా సాధకము లయిన వాక్యములు :—

ఆముఖములో అపవాదప్రస్తావము. ప్రథమాంకమున :— ఆర్మిలినిగాని 4 (5), కష్టా! లోకులు 5 (7), పుత్త్రిలకు నిజ 8 (15),

అకటసీతకు 14 (33), ఏకార్యముచే నైనను (34), ఏసాధుశుద్ధ (35), నీవలన (36), లోకులకు 15 (37), పిన్నతటి (38), నేరనిముగుదా (39), గోడుగుడువ (40), ఎదను 16 (42).

ద్వితీయాంకమున :—స్వరుపు 21 (7), కుడికరమ 22 (1), వెలికి 28 (9).

తృతీయాంకమున :—దండమున 32 (4), ఈవె మదీయ 39 (9), ఓయి కఠోర 40 (21), పూనికతోడ 41 (2), సరిపడ దామె (25), ప్రిలునుగాని (24), చకిత 40 (21), వెల్లి (22), దేవి పాడిడి 4 (26), అడ్డముగ 42 (28), పాయక (29), హా ప్రాణేశ్వరి 43 (31), సరవి 46 (37), ఎచట (38).

షష్ఠాంకమున ;—మొదలనే 81 (24), నిరతిశయంపు (26), ఆకృతి 82 (31), అనుభావ 83 (34),

సప్తమాంకము ·—మహాత్ములు ధర్మములను సాక్షాత్కరించిన వారు 84, బాల్యమున 86 (15), తన్మాయం దల్లెను 87 (6), కుందు 89 (12).

ఇందు సీతావిరహశోకోద్ధురతా పరము లైన వాక్యములు తత్కారణ భూత ప్రజారంజన ధర్మైక శాభినివేశ తాత్పర్యకములు. నాటకము ఆదిలోనే అపవాద మూలకము. అంతమున నిరపవాద కరణపరము. లోకరంజనము ఆదిలో త్యాగముచేత, అంతమున తత్సమాకలన పూర్వక తత్ప్రతిబోధనముచేత, ఏతదను సారముగా భరతవాక్యమందు "త్రుంగంజేసి యఘుంబు" అను వాక్యము అపవాదనిరసనపూర్వక ధర్మనిర్వాహపరముగాను, "శ్రేయముల సందోహంబుఁ బొందించుతన్" అనుట సీతా పునః ప్రాప్తిపరము గాను గ్రాహ్యములు; కడమపద్యంబును అట్లే. ఈ మతమున వీర

రసమునకు అంగికి కరుణవిప్రలంభము అంగము, ధర్మాభినివేశ దార్ఢ్యబోధకము.

సీతాపునస్సంప్రాప్తికై వ్యాఖ్యలయందు చేయఁబడునట్టి బీజాద్యారంభాది సుఖాదిసమన్వయముల నెల్ల నిరపవాదసాధనకై చేయవలయును.

### కరుణ విప్రలంభ సిద్ధాంతము

ఈ నాటకంబున కరుణరసము అంగి యని యొకమతము కలదు.—సాహిత్యదర్పణమందు నాటకలక్షణమున "ఏక ఏవ భవేదఙ్గీ శృఙ్గారో వీర ఏవ వా" అని రెండు ఏవకారములతో నియమము నిబద్ధమై యుండఁగా, "శృఙ్గారో వీరో వేతి కథనం తు సముచితరససూచనమ్। తేనోత్తరామచరితే కరుణరసస్య, ప్రబోధచన్ద్రోదయే శాన్తస్య చాఙ్గిత్వ మవ్యాహతమ్." అని ముద్రకజ్ఞాపిక. ఈ జ్ఞాపిక గ్రాహ్యముగా నుండలేదు, ఎట్లన—ప్రబోధచంద్రోదయమందు వీరరసమే అంగిగాని శాంతరసముగా దని మతాంతరము గలదు; అదే సాధువుగాఁ దోఁచుచున్నది. మఱి యీజ్ఞాపికచే ఏరూపకమందుఁగాని తత్తల్లక్షణోక్త రసమే ఉండవలయునను నియమము జలలిపి యగును. మఱియు నీజ్ఞాపిక కరుణవిప్రలంభలక్షణమునకు విరుద్ధముగా నున్నది. ఎట్లన—సా. ద.

"యూనో రేకతరస్మిన్। గతవతి లోకాన్తరం పునర్లభ్యే
విమనాయతే యదైక। స్తదా భవేత్కరుణవిప్రలమ్భాఖ్యః."

"యథా కాదమ్బర్యాం పుణ్డరీక మహాశ్వేతావృత్తాన్తే। పునరలభ్యే శరీరాన్తరేణవా లభ్యే తు కరుణాఖ్య ఏవ రసః." అని తద్వృత్తి. సీత పునర్లభ్య యైనది గావున కరుణరసము గాదు. దీనిని మరలం దడవెద.

కరుణశబ్దముగాని, (కరుణాశబ్దముగాని, దీనిం గూడ సాధకముగాఁ గొనియున్నారు.) అక్కడక్కడ నాటకమందు కనఁబడుట సాధకము గాదు. అగునేని, మాలతియందును అంగి కరుణరసమే గావలయును. ఎట్లన—అందు 9, 10 అంకములలో ఈ ప్రయోగము లున్నవి—(సకరుణం నిశ్వస్య),—(సకరుణం పరివృత్యావలోక్య చ)—(సకరుణంవిముచ్య),—(సోచ్ఛ్వాసం సకరుణం నిశ్వస్య),—(సకరుణం సాస్రమ్),—మఱియు "క రు ణ వ నే చ ర వ చ నా త్" 10 (14), "కరాళాయతనాచ్చాయ ముచ్చర త్కరుణధ్వనిః." 5 (21). ఇంత మాత్రకే మాలతియందు కరుణము అంగి యగునా? కా దని చెప్పవలయునా? "ప్రకరణమందు శృంగారము అంగిగా నుండు" నని తల్లక్షణము గదా. మఱియు మాలతియందు—

"అకరుణ, వితర స్మితోజ్జ్వలాం। దృశ, మతిదాపణ, దేహి మే గిరమ్,
సహచర మనురక్తచేతసం। ప్రియమకరన్ద, కథం న మన్యసే।" 9 అం.

అను శ్లోకమున కరుణరస మని వ్యాఖ్య. అందువలన మాలతిలో కరుణరసమే అంగి అగునా? మఱియు—

"జనస్థానే శూన్యే వికలకరణై రార్య చారితై
రపి గ్రావా రోదిత్యపి దళతి వజ్రస్య హృదయమ్" 1 (28)

అను నుత్తరరామచరిత శ్లోకమున పూర్వరామచరితాంశము వర్ణితమై యున్నది. దానింగూర్చి ఆర్యాస ప్తశతిలో—

"భవభూతే స్సమ్బన్ధా ద్భూధరభూరేవ భారతీ భాతి
ఏతత్కృతకారుణ్యే కిమన్యథా రోదితి గ్రావా?"

అని యున్నది. ["కారుణ్యం కరుణా ఘృణా" అమర. కరుణము గాదు.] ఇందువలన మహావీరచరిత్రలోఁగూడ కరుణరసమే అంగి యగునా? శాకుంతలమున పంచమాంకములో—

"వత్స శార్ఙ్గరవ, అనుగచ్ఛ తీయం నః కరుణపరిదేవినీ శకున్తలా।
ప్రత్యాదేశపరుషే భర్తరి కింవా మే పుత్రికా కరోతు?"

ఇందలి కరుణశబ్దముంబట్టి శాకుంతలమందును అంగి కరుణమే యగునా?

కావున కరుణశబ్ద ప్రయోగము కరుణాంగికత్వ సాధకము గాదు. అట్లే "రామస్య కరుణోర్మయః" 89 (12) "రామస్య కరుణో రసః" 28 (1), ఇవియు కరుణాంగికత్వ సాధకములు గావు. ఇందు కారుణ్య కరుణరస శబ్దములు నిరుక్తకరుణరస పరములుగావు. ఏలన, రసము కథాపురుషులయందుఁ గాని నటులందుఁగాని ఉండదు. అది సామాజికుల హృదయమునందు ఉద్బుద్ధ మగును. మఱి "కరుణస్య మూర్తి రథవా శరీరిణీ విరహవ్యథైవ వన మేతి జానకీ" ["కరుణమూర్తియొ" 30 (4)]. ఇదియు సాధకము గాదా? కానే కాదు. ఇట కరుణపదము నిరుక్త కరుణరసపర మే అని యంగీకరింతుమేనియు, ఉత్ప్రేక్షా ప్రభావముచేత విరహవ్యథాతిరేకమును తెలుపుచున్న దే గాని, ఈనాటకమందు కరుణరసము అంగి యని నెలకొల్పఁజాలదు; పైగా అంగి కా దనియే నిరూపించుచున్నది; దీని పర్యాయ మే "శరీరిణీవిరహవ్యథైవ" యను వాక్యంబును ["మెయిగొన్నవిరహాధర మొ." 30 (4)].

మఱి "రామస్య కరుణో రసః" ["రాముని కరుణరసము" (28)] అనుచో కరుణశబ్దము నిరుక్తరసపరముగా దేని కవి దానిని రస మని వ్యవహరించినాఁడే, అది యెట్లు సంగతమగును? అందు రేని, ఇట్టి స్థలములలో రసశబ్దము భావపరము గాని శృంగారాదిరస పరిగణనాంతర్గత కరుణరసపరము గాదు. మాళవికయందలి యీ క్రింది ప్రయోగముం గనుఁడు :—

"అత్రైవ స్తన్నిహితవచనై స్సూచిత స్సమ్య గర్థః.
పాదన్యాసో లయ మనుగత, స్తన్మయత్వం రసేషు."

ఇందులకు—"రసేషు సాత్త్వికవ్యభిచారిభావేషు" అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. "అత్ర రసశబ్దేన ఉపచారాత్ పరిపోషాతిశయవన్తో భావాః కథ్యన్తే ప్రకృతత్వాత్। రసే ష్వతిప్రసఙ్గాత్." అని కాటయవేమవ్యాఖ్య,

'రసము రామాదులయందుండ దని మీరు చెప్పుచున్నారు. రామాదులయం దుండు నని యిదె నరసరాజీయ వచనము.—

మ. రమణీయోల్బణతాసమేత మగు నీరత్యాదిభావాబ్ధిలో
నమరం బుట్టుచు మున్గుచుం దగుఁ దరంగారూఢి సంచారిసం
ఘము; లేతత్ప్రతిపన్నమౌ రసము దత్కాలంబునం దైన స
త్యము రామాదులయం ద, నాట్యమున సభ్యావాసమై భాసిలున్.

ఇందుల కేమి చెప్పెదరు?' అని యాక్షేప మేని—నిరుక్త కరుణరసము రామాదినిష్ఠముగాదని సిద్ధాంతము—సా. ద., తృ. పరి., చూచునది.

"పారిమిత్యా ల్లౌకికత్వా త్సాన్తరాయతయా తథా
అనుకార్యస్య రత్యాదే రుద్బోధో న రసో భవేత్.
శిక్షాభ్యాసాదిమాత్రేణ రాఘవాదేః స్వరూపతామ్
దర్శయన్ నర్తకో నైవ రసస్యాస్వాదకో భవేత్.
కావ్యార్థభావనే నాయ మపి సభ్యపదాస్పదమ్."

మఱియు—"రామస్య కరుణో రసః" ఇత్యాదివాక్యములందు కరుణపదము నిరుక్త కరుణరసపరము యేని కవికి నాయకునియందు రసమును స్వశబ్దముచేతనే చెప్పిన దోషము సంభవించును. ఎట్లన—సా. ద. సప్తమపరిచ్ఛేదము—

"అథ రసదోషా నాహ—రస స్యోక్తి స్స్వశబ్దేన"—
"రసస్య స్వశబ్దో రసశబ్దః శృఙ్గారాదిశబ్దశ్చ-క్రమేణ యథా—

"తా ముద్వీక్ష్య కురఙ్గాక్షీం రసో నః కోఽప్యజాయత,
చన్ద్రమణ్డల మాలోక్య శృఙ్గారే మగ్న మన్తరమ్"

అట్లయిన, "రామస్య కరుణోరస," ఇత్యాది వ్యవహారములయందు ఆశబ్దమున కర్థమేమన, దుర్భరవిరహవ్యథయే యర్థము; అదియే కరుణ విప్రలంభోన్మోధకము. అట్లే "ఏకో రసః కరుణ ఏవ నిమిత్త భేదాత్" అను వాక్యమున దుర్భరవియోగవ్యథయే విప్రలంభ శృంగారాది వివర్తములం జెందు నని భావము

ఈనాటకమున కరుణవిప్రలంభ మంగిగాని కేవలకరుణము అంగి గా దని సువ్యక్తముగా తెలియుట్కై కరుణరస కరుణవిప్రలంభాది స్వరూపచర్చలను అభియుక్త కృతులం గొన్నిటి నుద్ధరించెద :—

రసతరఙ్గిణీ

"యూనో రేకతరస్మిన్। మృతే ప్రలాపః కరుణరసః। జీవితే ర్విశ్లిష్టయోః ప్రలాపః శృఙ్గారః। అతఏవ రసరత్న దీపికాయాం కరుణరసోదాహరణమ్। 'అయి జీవితనాథ' ఇతి। నను విప్రలమ్భశృఙ్గారస్య పూర్వానురాగ మాన ప్రవాస కరుణాత్మకత్వాత్ జీవతో౽పి విప్రలమ్భస్య కరుణరసత్వ మాయాత మితిచే న్నత్యమ్ తత్ర కరుణరస స్యాఙ్గత్వేన భాసమానత్వాత్ తత్ర కరుణాత్మకత్వవ్యపదేశః."

"శోకస్య పరిపోషః కరుణః - ఆశావిచ్ఛేదే సతి సర్వేన్ద్రియ క్లమోవా। న చ విప్రలమ్భేఽతివ్యాప్తిః - తత్రేష్టాశాయాః సత్త్వాత్। తద్విచ్ఛేదే తు స విప్రలమ్భః కరుణ ఏవ - శోకో దుఃఖమ్."

వాగ్భటాలఙ్కారః

"స్యా దేకతరపఞ్చత్వే దమ్పత్యో రనురక్తయోః
శృఙ్గారః కరుణాఖ్యోఽయం వృత్తవర్ణన ఏవ సః."

"చతుర్థ మాహ। స్యా దితి। స్నిగ్ధయో ర్నాయకయో రేకస్య పఞ్చత్వే మరణే అపరస్య ప్రియాయాః విరహః కరుణాఖ్యోఽయం కరుణనామా స్యాత్। పరం స వృత్తవర్ణనే ఆచారదార్ఢ్యఖ్యాపన యైవ ప్రయోజనవా నితి గమ్యమ్. యథా।

……ఇత్థం చతుర్ష్వపి విప్రలమ్భేషు నాయికానాయకపరతయా ఉదాహరణద్వయం ప్రదర్శితమ్."

రుద్రటః

"అథ విప్రలమ్భనామా। శృఙ్గారోఽయం చతుర్విధో భవతి
ప్రథమానురాగ మాన। ప్రవాస కరుణాత్మకత్వేన."

వ్యాఖ్యా.—కేచిద్ధి కరుణరస ఏవ విప్రలమ్భభేదం కరుణ మన్తర్భావయన్తి। తదసత్ వైలక్షణ్యాత్। శుద్ధే హి కరుణే శృఙ్గారస్పర్శ ఏవ నవిద్యతే। కరుణ విప్రలమ్భస్తు శృఙ్గార ఏవ। యథా కాళిదాసస్య 'ప్రతిపద్య మనోహరం వపుః ..'

"కరుణ స్స విప్రలమ్భో యత్రాన్యతరో మ్రియేత నాయకయోః
యది వా మృతకల్పః స్యాత్ తత్రాన్య స్తద్గతం ప్రలపేత్."

హేమచన్ద్రికావ్యానుశాసనమ్

"కరుణ విప్రలమ్భ స్తు కరుణ ఏవ। యథా—'హృదయే వససీతి' ఇత్యాది రతి ప్రలాపేషు." "విప్రలమ్భోఽనవచ్ఛిన్న ఏవ సంభోగమనోరథః. విరాశత్వే తు కరుణ ఏవ స్యాత్."

సరస్వతీకణ్ఠాభరణమ్

"అభ్యఙ్గానార్ద్రత్వే కరోతి చిత్తం దుఃఖేన యథా. 'దళతి హృదయమ్'— అత్ర రామాదేః దుఃఖేన చిత్త మభ్యజ్యతే."

"భావో యదా రతి ర్నామ ప్రకర్ష మధిగచ్ఛతి
నాధిగచ్ఛతి చాభీష్టం విప్రలమ్భ స్తదోచ్యతే.
పూర్వానురాగో మాన శ్చ ప్రవాసః కరుణ శ్చ సః
పురుషస్త్రీప్రకారేషు చతుఃకాష్ఠః ప్రకాశతే.
పూర్వానురాగపూర్వేషు విప్రలమ్భేషు తత్క్రమాత్
విశేషద్యోతకే నేహ వ్యపసర్గేణ సూచ్యతే.
ప్రత్యాదానం పున స్తేషాం కరుణే కో న మన్యతే
స్వయం దత్తాని హి విధి స్తాని తత్రాపకర్షతి."

(టీ. కరుణే = కరుణాఖ్యే విప్రలమ్భే, తేషా మభీష్టారిజనాదీనామ్. ప్రత్యాదానమ్ = పునర్గ్రహణమ్. న మన్యతే = న జానాతి.)

“మూర్చావిలాపౌ కురుతే కురుతే సాహసే మనః
కరోతి దుఃఖం చిత్తేన యోఽసౌ కరుణ ఉచ్యతే.”

[ఇది కరుణవిప్రలంభముంగూర్చి చెప్పిన వ్యుత్పత్తి.]

“‘మృ తేతి ప్రేత్య సంగన్తుం యయా మే మరణం మతమ్।
సై వావన్తీ మయా లబ్ధా కథ మత్రైవ జన్మని।

అత్ర స్థాయినో విభావానుభావవ్యభిచారి సంయోగాత్ రసనిష్పత్తి రితి రతి రేవ శృఙ్గారరూపేణ నిష్పద్యతే। అత్రావన్త్యా వాసవదత్తాయా ఆలమ్బనవిభావ భూతాయాః సకాశాత్ ఉత్పన్నో వత్సేశ్వరస్య రతిస్థాయిభావ స్తస్యాః పునర్జీవనాదిభిః ఉద్దీపనవిభావైః ఉద్దీప్యమానో మృ తేత్యాదినా వాగారమ్భానుభావేన అనుమీయమానైః హర్ష ధృతిప్రభృతిభిః సుఖాత్మభిః సంస్పృజ్యమానః కరుణానన్తరసంభోగ శృఙ్గారాఖ్యాం లభతే”

“ఔపమానికీ యథా—‘అపి జనకసుతాయాః....’ సేయం సీతావిషయిణీ రతిః తదుపమానదర్శనేన రామం రమయతే॥”

“...విప్రలమ్భ శృఙ్గారాఖ్యాం లభతే। స చతుర్థా, పూర్వానురాగో. మానః, ప్రవాసః, కరుణశ్చ” ఈ ప్రకరణములో - పూర్వానురాగము, మానము, ప్రవాసము అయిన తర్వాత నాలవదైన కరుణవిప్రలంభ స్వరూపము :—సంగతయో రేవాన్యతరవ్యపాయే కరుణః - అథ సంభోగః, చతుర్థా - ప్రథమానురాగానన్తరః, మానానన్తరః. ప్రవాసానన్తరః. కరుణానన్తర ఇతి—తేఽమీ చత్వారోఽపి సంభోగాః చతుర్భి రేవ విప్రలమ్భైః ప్రకర్ష మాపద్యన్తే.”— [ఇచ్చటను నాలుగింటికిని వరుసగా ఉదాహరణములు దత్తములు. అందు తుదిది ]—“కరుణేన యథా—

‘న మర్త్యలోక స్త్రిదివాత్ప్రహీయతే మ్రియేత నాగ్రే యది వల్లభో జనః
నివృత్త మేవ త్రిదివప్రయోజనం మృత స్స చేజ్జీవత ఏవ జీవతి॥’

(టీ.—మరణానన్తరజీవనం ప్రియజనస్య స్వర్గా దపి సుఖకర మితి భావః.)”

"కరుణానన్తర మాలిఙ్గనం యథా—

'చన్ద్రాపీడం సా చ జగ్రాహ కణ్ఠే కణ్ఠస్థానం జీవితం చ ప్రపేదే
తే నాపూర్వాం సా సముల్లాసలక్ష్మీ మిన్దుం స్పృష్ట్వా సిన్ధువేలేవ భేజే.'"

"పుంస ఏవ ప్రవాసకరుణే యథా—

'సీతావేశ్మ యతో పరీక్ష్య హరతే దృష్టిం రుదిత్వాకులామ్,
అన్యోన్యార్పిత చఞ్చుసత్త్వ కలశైః పారావతై ర్ధ్యాయతే,
ఇన్దో ర్ద్వారత ఏవ నశ్యతి, విశ త్యన్తర్గృహం దుఃఖితః,
ప్రచ్ఛాద్యాననమఞ్చలేన రజనీ ష్వన్తస్త్రపం రోదితి'"

"అవస్థాపనార్థత్వే కురుతే సాహసే మనో యథా—'ఇయ మేత్య .' అత్ర రతేః కామశోకేన మరణసాహసే మనో వస్థాప్యతే—"

"అభ్యఞ్జనార్థత్వే కరోతి చిత్తం దుఃఖేన యథా—'దళతి హృదయమ్ .' అత్ర రామాదేః దుఃఖేన చిత్త మభ్యజ్యతే"—

ఈ యుద్ధారము మాలతిలో 2 (12) నుం గలదు.

కరుణానన్తరే అనుభవాదో యథా—

'అనుమరణ ప్రస్థితయా ప్రత్యాగతజీవితే ప్రియతమే।
వైధవ్యమణ్డనం కులవధ్వాః శోభనకం జాతమ్॥'

అత్ర య శ్చేయం మత్ప్రాణభూతా ఏవ మహ్యా అహ మపి జీవిత మే వేతి పత్యా విస్రమ్భజో రాగః। పశ్చాచ్చ పునః ప్రేత్యాపి యత్సంగమో మయా అభిలషితః సోఽయం జీవ న్నైవ జీవితేశ్వరః సమాసాదిత ఇతి విస్రమ్భాత్ అతిసుఖమేవ అనుభూయతే."

"కరుణానన్తరే సమృద్ధో యథా—'తీర్థే తోయ...'

అత్ర ఉత్తరార్ధేన ఇన్దుమత్యజయోః లోకాన్తరప్రత్యుజ్జీవనేన సమ్భోగ సమృద్ధిః ప్రతిపాద్యతే॥"—

ఇదియు సమృద్ధి క్రింద పూర్వానురాగ మాన ప్రవాసముల వెంబడి చెప్పఁబడినది.

"సోయం కరుణధర్మ సమన్వయః తదనన్తరేఽపి సమాససామర్థ్యాద్భవతి॥— విప్రలమ్భ శృఙ్గారాఖ్యాం లభతే। స చతుర్ధా పూర్వానురాగో మానః ప్రవాసః కరుణ శ్చ—

అని యుపక్రమించి క్రమముగా ఆమూఁటిని విశదీకరించి చతుర్థమైన కరుణ విప్రలంభమును చెప్పుట.

"సంగతయో ర్వే వాన్యతరవ్యపాయే కరుణః - స స్త్రీవ్యపాయే పురుషస్య యథా—'ధ్రువ మస్మి శఠః' అత్ర ఇన్దుమతివ్యపాయాత్ అజస్య దుఃఖాతిశయః కరుణ' ఉచ్యతే॥ స ఏవ పురుషవ్యపాయే స్త్రియా యథా—'హృదయే వస సీతి....' ఇహ అనఙ్గవిషయే రతేః శోక ప్రకర్షాత్ కరుణ ఇత్యాఖ్యాయతే।"—

[ఇది ప్రవాసానంతరము అవ్యవహితోక్తము కరుణ విప్రలంభ విస్తరము.]

## దశరూపమ్

"ఇష్ట నాశా దనిష్టాప్తే శ్శోకాత్మా కరుణః.—

ఇష్టనాశాత్ కరుణో యథా।—'అయిజీవితనాథ...' ఇత్యాది రతిప్రలాపః। అనిష్టావాప్తేః సాగరికాయా బన్ధనాత్। యథా రత్నావళ్యామ్॥

మృతే త్వేకత్ర య త్రాన్యః ప్రలపే చ్ఛోక ఏవ సః,
వ్యాశ్రయత్వా న్న శృఙ్గారః, ప్రత్యాపన్నే తు నేతరః,

య థేన్దుమతీమరణా దజస్య కరుణ ఏవ రఘువంశే। కాదమ్బర్యాం తు ప్రథమం కరుణ, ఆకాశ సరస్వతీ వచనా దూర్ధ్వం ప్రవాస శృఙ్గార ఏవ.

'ఏకతో రోదితి ప్రియాఽన్యతః సమరతూర్యనిర్ఘోషః
ప్రేమ్ణా రణరసేన చ భటస్య దోలాయితం హృదయమ్॥'

ఇత్యాదౌ రత్యుత్సాహయోః (సమావేశః అని వాక్యశేషము)—అ త్రోచ్యతే - అ త్రాప్యేక ఏవ స్థాయీ। తథాహి—ఎక్కత్తో రుఅఇ పిఅ (ఏకతో రోదితి ప్రియా) ఇత్యాదౌ స్థాయిభూ తోత్సాహ వ్యభిచారి లక్షణ వితర్కభావ హేతు సందేహకారణ

తయా కరుణ సంగ్రామయో్యరయో రుపాదానం వీర మేవ పుష్ణా తీతి భట స్యే త్యనేన పదేన ప్రతిపాదితమ్।—అతో భర్తు స్సంగ్రామరసికతయా శౌర్యమేవ ప్రకాశయితా ప్రియతమాకరుణో వీర మేవ పుష్ణాతి.

రసగఙ్గాధరః

"పుత్త్రాది వియోగమరణాదిజన్మా వైక్లబ్యాఖ్య శ్చిత్తవృత్తివిశేషః శోకః। స్త్రీపుంసయో స్తు వియోగే జీవిత్వజ్ఞానదశాయాం వైక్లబ్య పోషితాయా రతే రేవ ప్రాధాన్యాత్ శృఙ్గారో విప్రలమ్భాఖ్యో రసః। వైక్లబ్యం తు సంచారిమాత్రమ్॥ మృతత్వ జ్ఞానదశాయా స్తు రతి పోషితస్య వైక్లబ్య స్యేతి కరుణ ఏవ। యదాతు సత్యపి మృతత్వజ్ఞానే దేవతాప్రసాదాదినా పునరుజ్జీవన జ్ఞానం కథఞ్చి త్స్యా త్తదాఽఽలమ్బనస్యాత్యన్తిక విరహాభావా చ్చిరప్రవాస ఇవ విప్రలమ్భ ఏవ, నస కరుణః। యథాచన్ద్రాపీడం ప్రతి మహాశ్వేతావాక్యేషు। కేచి త్తు రసాన్తర మేవాత్ర కరుణవిప్రలమ్భాఖ్య మిచ్ఛన్తి।"

రసార్ణవసుధాకరః

"స విప్రలమ్భో విజ్ఞేయ స్స చతుర్ధా నిగద్యతే
పూర్వానురాగమానౌ చ ప్రవాసకరుణా వితి.
ద్వయో రేకస్య మరణే పున స్సంజీవనావధౌ
విరహః కరుణో న స్యా త్సంగమాశానువర్తనాత్.
కరుణే భ్రమకారిత్వాత్ సోయం కరుణ ఉచ్యతే
సంచారిణోఽనుభావా శ్చ కరుణేఽపి ప్రవాసవత్.

యథా—'అథ మదనవధూ రుపప్లవాన్తమ్'। అత్రాకాశసరస్వతీప్రత్యయేన రతే ర్విప్రలమ్భః...అత్ర కేచి దాహుః-కరుణో నామ విప్రలమ్భశృఙ్గారోనాస్తి-ఉభయాలమ్బనస్య త స్యైకత్రైవాసంభవాత్। యత్ర త్వేకవ్యపాయే సతి తదితరగతాః ప్రలాపాదయో భవన్తి స శోకా న్న భిద్యత ఇతి। త దయుక్తమ్ యదాపునరుజ్జీవనేన సంభోగో న విభాతి తత్ర సత్యం శోక ఏవ। యత్ర సోఽస్తి తత్ర విప్రలమ్భ ఏవ।..."

సాహిత్యదర్పణః

"యూనో రేకతరస్మిన్ గతవతి లోకా న్తరం పునర్లభ్యే
విమనాయతే యదైక స్తదా భవే త్కరుణవిప్రలమ్భాఖ్యః.

యథా-- కాదమ్బర్యాం పుణ్డరీకమహాశ్వేతావృత్తాన్తే। పున రలభ్యే శరీరాన్తరేణవా లభ్యే కరుణాఖ్య ఏవ రసః। (టీక—పున రలభ్యే ఇతి—రతే ర్నాశాత్ ఉత్కట శోక సంభవాచ్చ కరుణాఖ్యో రసః. న పున ర్విప్రలమ్భ ఇతి భావః) కించా (శాకాశ సరస్వతీభాషానన్తర మేవ శృఙ్గారః: సంగమప్రత్యాశయా రతే రుద్భవాత్। ప్రథమం తు కరుణ ఏవ' ఇ త్యభియుక్తా మన్యన్తే। య చ్చాత్ర సంగమ ప్రత్యాశానన్తర మపి భవతో విప్రలమ్భ శృఙ్గారస్య ప్రవాసాఖ్యో భేద ఏవ' ఇతి కేచి దాహుః, త దన్యే 'మరణరూప విశేషసంభ వాత్తద్భిన్న మేవ' ఇతి మన్యన్తే ॥

యత్ర తు రతిః ప్రకృష్టా నాభీష్ట ముపైతి విప్రలమ్భోఽసౌ

అభీష్టం నాయకం నాయికాం వా। స చ పూర్వరాగ మాన ప్రవాస కరుణాత్మక శ్చతుర్ధా స్యాత్. (టీ.—ప్రకరణాదినా ప్రధానత్వం ప్రాప్తా-కరుణాదౌ శోకోద్దీపన తయా రతిసత్త్వేన త త్రాతివ్యాప్తి వారణాయ ప్రకృష్టేతి.)"

శృ ఙ్గా ర తి ల కః

"విప్రలమ్భాభిధానోఽయం శృఙ్గార స్స్యా చ్చతుర్విధః,
పూర్వానురాగ మానాఖ్య ప్రవాస కరుణాత్మనా.
యత్రైకస్మిన్ విపన్నేఽన్యో మృతకల్పేఽపి తద్గతమ్
నాయకః ప్రలపే ద్దుఃఖా త్కరుణోఽసౌ స్మృతో యథా.
కేషాఞ్చి త్కరుణభ్రాన్తిః కారుణ్యా దత్ర జాయతే,
ఏతస్య మిథునావస్థాం విస్మృత్య రతిమూలజామ్,
స్త్రీపుంసయో ర్భవే దేష సాపేక్ష స్సఙ్గమే పునః
శృఙ్గారవచనప్రాయః కరుణ స్స్యా త్స నాన్యథా.
తస్మా చ్ఛృఙ్గార ఏ వాయం కరణే నానుమోదితః
సౌన్దర్యం సుతరాం ధత్తే నిబద్ధో విరళం బుధైః."

రు ద్ర టః

"కరుణః శోక ప్రకృతిః। శోక శ్చ భవే ద్విపత్తితః ప్రాప్తేః
ఇష్ట స్యానిష్టస్య చ। విధివిహతో నాయక స్తత్ర"

సా హి త్య ద ర్ప ణః

"అత్ర హి రామవనవాస జనితశోకార్తస్య దశరథస్య దైవనిన్దా। ఏవం బన్ధు వియోగ విభవనాశా దా వ ప్యుదాహార్యమ్। అస్య కరుణవిప్రలమ్భా ద్భేద మాహ।

శోకస్థాయితయా భిన్నో విప్రలమ్భా దయం రసః
విప్రలమ్భే రతిః స్థాయీ పునః సంభోగహేతుకః."

కావ్యదీపికా

"కరుణ రసోదాహరణమ్.—

యస్య భృత్యా శ్చ దాసా శ్చ స్వాదూ న్యన్నాని భుఞ్జతే
కథం స భోక్ష్యతే రామో వనే మూలఫలా న్యయమ్." రామా.

కరుణారసమున శోకస్థాయితయు, కరుణావిప్రలంభమున రతిస్థాయితయు భేదకారణములు. ఉత్తరరామచరితమందు ఎక్కడఁ జూచినను రతి స్థాయిగానే యున్నది.

యజ్ఞము తొడంగుటయు, యజ్ఞ సహధర్మచారిణినిగా ఏదో ఒక స్త్రీమాత్ర ప్రతిమ సేయించు కొనక సీతాప్రతిమనే చేయించు టయు. 21.

"కరుణ నీ కేడ దుర్భరగర్భఖిన్న।
సీతఁ దఱిమినరాముని గాత్రమునకు!" 22.

"హా! నెయ్యం బట్టి దార యబలకా నాప్తె" 24 (9, 10).

"కంటి వెండియు నిప్పు డాకాననంబు..." -5 (౮)

"దానికిఁ గ్రింద నయ్యుటజధామములన్ రహి నుంటి మేమునన్." 26 (16)

"చిరమునకు రేఁగి నొంచుఁ బెన్గిలుమువోలె." 26 (17).

"ఎచటఁ జర ముంటి సఖితోడ నింపుమెఱసి." 32 (8).

"హా! దేవి। దండకారణ్యావాసప్రియసఖ."

"మూర్తిగొన్న ప్రసాదముంబోలె...
నందినీ గానఁబడవు నీవెందు నకట." 25 (7)

"కలువదళంపు సొరొలసి...38(15) సీత.—చూచు చున్నాను....

"చండీ, జానకి, ఇట నటం గినఁబడుచునే యున్నావు! జాలి గొనవేమి!" 43

"ఎట నున్నావు? అనుగ్రహింపుము. ఈదశలో నున్నవానిని నన్ను విడనాడుట నీకుం దగదు" 45.

"ఎచటఁ గపీంద్రు చెల్మివృథ..." 46 (38)—ఇందుల మూలశ్లోకమును భోజ హేమచంద్రులు విషాదమున కుదాహరించినారు:—

"విషాద శ్చేతసో గ్లాని రుపాయాభావనాశయోః—తద్రూపేణ రసస్య ప్రకర్షో యథా—'వ్యర్థం యత్ర ..' అత్ర సీతా సమాగమవిషయే రామస్య ద్రష్టావదాన సుగ్రీవసఖ్యాదేః ఉపాయస్య అభావాత్ విషాదః ప్రకృష్యతే."

"కార్యాభఙ్గా ద్విషాదః సహాయాన్వేషణ ముఖశోషాది కృత్। ఉపాయాభావ నాశాభ్యాం ప్రారబ్ధస్య కార్యస్య భఙ్గా న్మనఃపీడా విషాదః। యథా—'వ్యర్థంయత్ర కపిన

"వాల్మీకిరుల..." 40 (22) "పూనికతోడ" 4 (23), "ప్రీలును" (24), "సరిపడ దాయె" (25), "దేవి పాడిడి" (26), "స్నేహాశ్రితంబులు" (27), "హా! ప్రాణేశ్వరి." 43 (31), "నిరతిశయంపు" 81 (26), "నాకుఁ బ్రియాంగన" 82 (27, 28, 30, 31), "దైవవశత" 86 (7), "కనఁబడుచున్న పీఠికయుఁగం బున" 80 (19)—దీనిమూలమును "అపిజనక" ఇత్యాది శ్లోకమును గూర్చి సీతా విషయకి మఱియు రతి శ్రీరాములవారిని తనూప మాన దర్శనముచే రమింపఁజేసిన" దని భోజ జ్ఞాపిక. "అబల క్రవ్యాత్కులవిలుప్త యయ్యె నిజము" 40 (21) అని వాసంతికి రాముఁడు ఉత్తరము చెప్పుట వైక్లబ్యముచేతఁ గాని విలుప్తి నిశ్చయముచేతఁ గాదు. "వైక్లబ్యానుభావమాత్ర మితి స్థితమ్" అని టీక. అట్లే "నిరవధి నివృత్తి క్రియము నివృరి" 46 (37) అనుట

ఉత్కట రతిహేతుక మయిన దుఃఖముచేత-" అజ్ఞాతావధి, అజ్ఞాత ప్రతిక్రియము " అనియే భావము.

'వస్తుస్థితి యిట్లున్నను, ప్రత్యాశ లేదే విప్రలంభ మెట్లగును?' అనఁగూడదు. ఏలన ఋశ్యశృంగాదుల వాక్కులయందు రామునికి విశ్వాసము ఎప్పుడును అవ్యాహతము. ఈక్రిందివి రామవాక్యములు.-

"వాక్కు వెంబడి నర్థంబు పఱచివచ్చు
నాద్యులయినట్టి పరమ మహర్షులకును" । (8)

"మహర్షులు ధర్మములను సాక్షాత్కరించినవారు. అమృత సారములును పరోక్షదసములును అయిన తత్ప్రజ్ఞానములు ఎటను భంగ మొందవు. కావున వానియందు శంక వహింపఁగూడదు,"84.

ఋశ్యశృంగుఁడు " పుత్త్రపూర్ణోత్సంగను నిన్ను చూచెదము" అని సీతకు సందేశము పంపినవాఁడు. శాకుంతలమందు శాపలక్షణము మొదలు అంగుళీయకదర్శన క్షణపర్యంతమును దుష్యంతునికి శకుంతలయందు ఎట్టి రతి గాని ఎట్టి యాశ గాని లేదు. మఱి ప్రత్యాశ లే దని చెప్పవలయునా? అంగుళీయకదర్శనానంతరము ఆశగలదే గాని ప్రత్యాశ ఏమో? అందును.

"నూనం ప్రసూతివికలేన మయా ప్రదత్తం
ధౌతాశ్రుశేష ముదకం పితరః పిబన్తి."

అని దుష్యంతుఁడు దుఃఖపడుచున్నాఁడు, ఇట్లున్నను శాకుంతలమున అంగి శృంగారమే గాని కరుణము గాదు. ఇటను అట్లు. " అత్ర సమయాన్తరేషు సత్సు గ్రీష్మర్తూపాదానం ప్రకృతనాటకస్య శృఙ్గారాఙ్గికత్వాత్ " అని వైఖానస శ్రీనివాసాచార్య టీక. మఱియు ఈ టీకలోని యీక్రింది వాక్యముం బరికింపుఁడు :—" బీభత్సభయానకయోః ప్రతినాయకాశ్రితత్వేన వర్ణనీయత్వాత్, హాస్య రౌద్ర కరుణాద్భుతానాం మహాప్రబన్ధరసత్వే చమత్కారాభావాత్ ."—కరుణము అంగిగా నాటకమునకు పనికిరా దన్నమాట.

మాలతియందు ప్రత్యాశాసందేహము కలదు—.

"న యత్ర ప్రత్యాశా మనుపతతి నో వా రహయతి,
ప్రపిక్షిప్తం చేతః ప్రవిశతి చ మోహాన్ధతమసమ్,
అకిఞ్చిత్కుర్వాణాః పశవ ఇవ తస్యాం వయమహో
విధాతు ర్వ్యాపారా ద్విపది పరివర్తామహ ఇమే." 9 (8).

పూర్వోదాహృత లక్షణ వాక్యములవలన ప్రాయికముగా అనురక్త స్త్రీపురుషులలో ఒకరు మృతిఁజెందిన ఆద్వితీయులు ప్రలపించుట పునస్సంగము లేకున్న కరుణ మగును. పునస్సంగ మున్న కరుణవిప్రలంభ మగును, అని యేర్పడుచున్నవి.

ఈనాటకమందు దర్పణోక్త్యనుసారమున అంగివ్యవస్థ యిట్లు సేయవచ్చును: ..[సీత లోకాంతరమునకుం బోయినది.] ''పృథ్వీ-రావే పట్టీ పాతాళమును పవిత్రము గావింపుము. రామ—హా! ప్రియా! లోకాంతరమున కేఁగితివే''—పిమ్మట సీత మరల లభించినది. లభించునదాక రాముని విలాపము కరుణవిప్రలంభము. [ఇట దర్పణవాక్యముం గూర్చిన టీకావాక్యమున కర్థము—మరల లభింపని యెడల రతి నశించుటచేతను, ఉత్కటశోకము కలిమిచేతను, కరుణరసము గాని విప్రలంభము గాదు.] ఈ నాటకమున రతి నాశ మొందక ఉత్కటముగా నున్నందునను ప్రత్యాశయు కలిగినందునను అంగి విప్రలంభ మయినది, అని సిద్ధాంతము.

## ౧౧. ఉ. రా. చ. ప్రాశస్త్యము

"ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే."

ఈ వాక్యమునకు శాకుంతలముకన్న ఉ. రా. చ. ఉత్కృష్ట మని కాళిదాసు పలికినట్లుగా ఆభాణకము. [పై ఆభాణకమునకు

భవభూతి కృతనాటక త్రయములో ఉ. రా. చ. శ్రేష్ఠమని యర్థముగా కొందఱు గ్రహింతురు ]

ఈ నాటకమందు ప్రధానులగు స్త్రీ పురుషులు ఉత్తమోత్తములును లోకాతీతులును. నాయికా నాయకులు నరత్వాభిమానమందున్నను సాక్షాల్లక్ష్మీనారాయణులు: అంతకన్న నుత్తము లెవ్వరుందురు! శ్రీరాముని మించిన ధీరోదాత్త నాయకుని సీతకన్న పతిపరాయణను ధర్మప్రవణను ఊహింపలేము. అరుంధతి పృథ్వీ భాగీరథి వాసంతి ఆత్రేయి తమస వాల్మీకి జనకుఁడు—వీరి చరిత్రమును, వీరు మెచ్చిన సీతా రాముల చరిత్రమును, బోధించు నీ రూపకము ఆర్యావర్తమునకు ఉత్తమోత్తముల సూక్ష్మ ధర్మాచరణమునకు లక్ష్యభూతముగా నున్నది.

కవి యిందు గృహిలోక వృత్తమును నిపుణముగా నిబంధించి నాఁడు పుత్రుఁడని యెఱుఁగకయే పుత్రవాత్సల్యము, నాయన యని యెఱుంగకయే పితృభక్తి, అన్న యనియు తమ్ముఁడనియు నెఱుంగకయే భ్రాతృప్రేమ—వీనిని అత్యద్భుతముగా అత్యంతహృదయంగమముగా నిరూపించినాఁడు. మఱియు నిట్టియహేతుక పక్షపాతములు ఏదో ఆంతర హేతువువలనం గలుగును గాని బహిరుపాధికృతములు కావని వాక్రుచ్చినాఁడు. మహాకవి గావున ఈ విధముగా చిత్తప్రవృత్తిని చర్చించినాఁడు. ఇట్లె కాళిదాసు గూడ శాకుంతలమున ఒకచో చేతఃప్రీతిని శివమునకు జన్మాంతర సౌహృదమును కారణముగా నుపన్యసించినాఁడు: ఎట్లన—

"రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య భావాన్
పర్యుత్సుకో భవతి య త్సుఖితోఽపి జన్తుః
త చ్చేతసా స్మరతి నూన మబోధపూర్వం
భావస్థిరాణి జననాన్తర సౌహృదాని."

శాకుంతలము.

కాళిదాసువలె భవభూతియు తండ్రిని పుత్త్రునికడకుం దెచ్చియు ఆసంబంధమును ఒక్కమ్మడింగాక క్రమముగానే వెలువరించినాఁడు.

పెద్దలు ఎప్పుడును లోకక్షేమ దీక్షితు లనుటకు ఈరూపకము ప్రబల నిదర్శనముగా నున్నది. ఉ. రా. చ. యందు కవనసౌభాగ్య మటుండ, సంవిధాన వైదగ్ధియు నటుండ, శిక్షికలో నుక్తమైన యాభాణకోక్తికి కారణభూత మైనట్టి దేమనఁగా, ఇదమీయు నాయికా నాయకసర్వలోకాతిశాయి సముత్కర్షోచితముగా గ్రంథనిర్వాహము. “నాటకేషు శకున్తలా” అని పేర్వడ్డ శాకుంతల నాటకమందు దుష్యంతుఁడు అధర్మభీరువ యయ్యును (5 అం.) స్వార్థముగా పని వడినవాఁడు. తద్భ్రంశముచే దుఃఖితుఁడు (6 అం). శ్రీరాముఁడు లోకారాధనవ్రతి. ఇరువురును ధీరోదాత్తులే. అయినను, తారతమ్య మపారము. దుష్యంతుఁడు విదూషకునితో శకుంతలాసంకథ యంతయుఁ జెప్పి కడపట “పరిహాసోక్తులు మిత్రమ పరమార్థంబనుచు మనని భావింపకుమా.” అని బొంకినాఁడు. శ్రీరాము లట్లు సేయుదు రని ఎవరేని భావింపఁగలరా?

శకుంతల మహాపతివ్రత యయ్యును,—

“వసనే పరిధూసరే వసానా। నియమక్షామముఖీ ధృతైకవేణిః
అపి నిష్కరుణస్య దుఃఖశీలా। మమ దీర్ఘం విరహవ్రతం బిభర్తి.”

దుష్యంతుని “అనార్యా” అని తిట్టినది. సీత రామునిఁగూర్చి ఆయన తనకుం గావించిన యాయిక్కట్టున కుపితోక్తి వచించినట్టిది గాదు. అపకృతి తారతమ్యమునసిన సమత్వమే యొప్పదు నని తోఁచెడిని: సీత జగద్వంద్య యనియు తనకు ఆమెయందు భక్తి యనియు అరుంధతి వక్కాణించినది 53 (9). కావున శాకుంతలము గంగ యగునేని ఉ. రా. చ. మందాకిని యగును. కాళిదాసు అగంగను సారాయి సాక్షిగా సఖ్యముసేయుట లోనగు నోడికవాఁగులతోఁ జేర్చి మర్త్య

మునం బాఱుదల సేయించినాఁడు. భవభూతి ఆమందాకినిని ఆ యౌన్నత్యమున కర్హముగా కల్మషములు చేరనీయక స్వర్గమందే పర్వించినాఁడు. కవనమును తత్తదనుగుణమయినందుల ఉ. రా. చ. నాటకరాజమై వెలుఁగుచున్నది.

## ౧౨. నాటక స్త్రీ పురుషుల విమర్శ

### అరుంధతి

ఈమె జగద్వంద్య యనియు, ఈమె వలననే వసిష్ఠులవారు గురువులకెల్ల గురువైనారనియు, ఈమె త్రిలోకమంగల్య యనియు, జనక వాక్యము 52 (8). కోడలు లేని యయోధ్యలో నే నడుగిడ నని యీామె వచింపఁగానే, ఆ వచనమునే కౌసల్యా వసిష్ఠులు నెఱవేర్చినారు. జనకుఁడు లవుం జూపి, ఈ బాలు నెవ్వానిఁగాఁ దలఁతువు? అని యీామె నడిగినప్పుడు, ఈమె ఆబాలుఁ డెవ్వఁడో తా నెఱింగియు సత్యమయిన యుత్తరమును అప్పుడు చెప్పంబూనక యుండుటఁ బట్టి, మేము ఇప్పుడే వచ్చుచున్నామని పలికి ఆప్రశ్నను తొలఁగించుకొన్నది. అట్లు టక్కుగా బల్కుట సంభవింపని యట్లుగా కవి ఈమె విషయమై సంవిధానమును వేఱువిధముగా కల్పించియుండిన ఈమె యొక్క మహిమకు అనుగుణముగా నుండును. ఈమె యానతిచే ఎల్ల లోకులును సీతామహిమను అంగీకరించిరి. ఈమె యానతిచే శ్రీరాముఁడు సీతను వెండియు స్వీకరించెను. ఈమె సీతాదోహదమును తప్పక తీర్పవలసిన దని రామునికి చెప్పిపంపుట తత్పరిత్యాగమును జరుపుటకే. కావున, ఈమె పనివడి పునస్సంఘటనమును సాధించినది. పరిత్యాగము సేయించుట లోకారాధనకు అంతకన్న నుపాయము లేనందున.

### వాసంతి

ఈమె జనస్థానవనదేవత, సీతాదేవికి నెచ్చెలి. ఏవ్రతమునకు హిందువులు జగత్ప్రఖ్యాతులో ఆయతిథి పూజావ్రతమును 17 (1),

ఆర్యమాతుల సౌజన్యమును 18(2), ఈమె చరిత్రము విశదీకరించుచున్నది. దేవత యయ్యును ఈమె శ్రీరాములకన్న న్యూనప్రభావ. వారి యంత సత్త్వమును తాను గనలేకపోయినది, ఎవ్వరునుం గనలేరనియుం దలంచినది; రాముఁడు లోకోత్తరుఁ డని యెఱింగినది 21(7). రాముఁడు సీతను త్యజించినందులకు ఈమె కరము దుఃఖితురాలై ఆయనను గ్రుచ్చి గ్రుచ్చి కారణ మడిగినది. లోక మొప్పదే దని ఆయన వచించిన కారణమును పరిత్యాగమునకు చాలినట్టి దని ఈమె తలంపదాయెను 40 (21). రామునియందును ఈమెకు పరమానురాగమును చనువును గలవు. ఈమెయుం దమసవోలె సీతారాముల పునస్సంఘటనమును పృథ్వీభాగీరథీ వసిష్ఠారుంధతీ వాల్మీకులు సమకూర్తురని తలంచినదే 47 (41).

[వసిష్ఠులవారు]

[వీరు నాటకములో ప్రత్యక్షముగా వ్యవహరింపకపోయినను శ్రీరామునికి లోకారాధన వ్రతమును అతిక్రమింపవల దని సందేశము పంపుటచే వీరును సీతాపరిత్యాగమును నెఱవేర్చినవారే; లేక, వీరే సీతాపరిత్యాగమును చేయించినవారు. లోకారాధనకు ఒండు ఉపాయము లే దని అంతలి ధర్మరహస్యమును వీరును అరుంధతియు శ్రీరాములవారును ఎఱుఁగుదురు. అట్లు వీరు సమాధానము సేయించి సీతాశుద్ధతను లోకహృదయంబుల నాటి సీతారాముల మీఁది ప్రేమాతిశయముచే వారిని మరలం గూర్చినవారు. సీతావిరహము నిరవధి యని రాముఁడు పలికినను సావధియని వీరు నరుంధతియు నెఱుఁగుదురు. ఆయవధిని త్వరపఱుచుటకే వీరు సారుంధతీకులు అయోధ్యకుం బోక వాల్మీకాశ్రమమున నిలిచినారు.]

భాగీరథి

చిత్రదర్శనములో "సీతకు మేలు తలంపుము" అని ఈమెకు శ్రీరాములవారు సీతను అప్పగించినది మొదలు, ఈమె సీతను

రక్షించుచునే యుండెను. తల్లిని "నీ కడుపులో నన్ను అణఁచి వైచుము, అమ్మా!" అని సీత వేఁడినప్పుడు, ఆమె "శిశువులు పాలు వదలువఱకు వేచుము, తర్వాత నీయిచ్ఛ" అని చెప్పెను. అట్లు శిశువులను భాగీరథి వాల్మీకికడం జేర్చినపిమ్మట సీత యేల విలయ మొందలేదు, అని యడుగం దగును. భాగీరథి పునస్సంఘటనము సాధించునదై సీతను అంతరింప నీయక తానును పృథ్వియు తమ కడన యుంచుకొని కాపాడుచుండెను. సీతను తదీయదుఃఖశాంతికై గృహాచారవిశేషమిషచే గోదావరికడకుం బంపి రామదర్శనము ఘటింపం జేసినది. ఈ దర్శనముచేత సీతకు తనపైని రామానురక్తి అపరిక్షీణ మని విశదపఱిచి ఆమెను పునస్సంఘటనమునకు ఆతురం గావించినది. ఇట్లు తుదవఱకు హెచ్చరిక వహించి యీామె సీతం గాపాడి ఆమెను అరుంధతీ మూలకముగా రాముని కడం జేర్చి రాముని ప్రథమాంక వాక్యమును రాముని కప్పగించినది.

జనకుఁడు

ఈయన గొప్ప బ్రహ్మవాది, తపోధనుఁడును. అట్టి యీాయ నకు అపవాద పూర్వకమయిన సీతాపరిత్యాగ దుఃఖము దుస్సహాతమ మని చెప్పవలయునా? ఈయన త్యాగమునకై రామునిమీాఁదం గోపము వహించి క్షాత్త్రధర్మంబున సంహరింపను, తపోధన ప్రభా వంబున శపింపనుం గడంగియు, అరుంధతీ బోధచేతను, సూక్ష్మ ధర్మజ్ఞత చేతను, ఆకోపము నడంచుకొన్నాఁడు. ఈయన సీతా దుఃఖము తీర్చుకొనుటకై ఆత్మహత్య గావించుకొని యుందునుగాని, ధర్మజ్ఞుఁ డగుటంబట్టి ఆత్మహంతలకు అంధతమసావృతము లైన యసుర్యలోకములు సంభవించు నని మానినాఁడు. పృథ్వీదేవి యొక్కయు ఈయనయొక్కయు ఖేదాతిశయవర్ణనలచే మహాకవి సంభావితులగు కుటుంబులకు కూఁతునెడం గల్గిన యపవాద మెంత యవమానకరమో నిపుణముగా తెలిపినాఁడు. కవి జనకునియందు

ఈతఁ డెందులకు కడుంబ్రసిద్ధి కెక్కినాఁడో ఆ బ్రహ్మవిద్యానిష్ఠవలని ప్రపంచమిథ్యాత్వచింతనకు ఫలమైన సీతాదుఃఖవిషయిక ప్రశాంతిని చూపఁడాయెను. అట్లు చూపుట ప్రకృతనాటక రసమునకు భంజక మని మానినాఁడు 49 (8). అట్లే శాకుంతలమున కాళిదాసుండును కణ్వునివైక్లబ్యమును మాత్రము "యాస్యత్యద్యశకున్తలేతి" [మదీయాంధ్రము. "కూఁతు జనించె నేఁగెడు"] అని వర్ణించినాడు. కవి యీయనమీఁది సీతాప్రేమను నాటకారంభమందును 2 (7), 3 (1 వెంబడిని). తెలిపినాఁడు. ఆమెమీఁది యీతనిప్రేమను అటను. చతుర్థాంకమందు కడు నుత్కటముగాను, స్పష్టపఱిచినాఁడు; ఈయనను శ్రీరామ పట్టాభిషేకానంతరమునం బాసివైచి వ్యాజమున పునస్సంఘటన సమయమునకుం దెచ్చినాఁడు.

లవుఁడు, కుశుఁడు

లవునియందు సీతారాముల పోలికయు 80 (19, 20)–55 (17,) యుద్ధమున్న నుత్సాహంబును, పగతురపై బీరంబును, వైరి పరాక్రమమును మెచ్చుటయు 64 (10 వెంబడి), పెద్దలకడ వినీతియు, ఏలంబుట్టినవారియం దుండు సహజలక్ష్మీవిలాసంబులును, సదాచార పరాయణత్వమును, ధర్మజ్ఞతయు 69 (30, 31) అకార్యమునకు లజ్జించుటయు, బాలోచిత మయినయార్జవంబును, విదగ్ధగ్రాహ్యమయిన యతిశయంబును 56 (19), ఒకరికరుణకుం బాత్రము కానొల్లమియు 64 (కడపట), పరగుణగ్రహణ ప్రవణతయును, కరము కౌశలములతో వర్ణితములు. ఇతని వీరవాదము మనోహరము 61 (27)—ఇతనియన్న కుశుఁడు అన్నిటను ఇతని మించినవాఁడు.

చంద్రకేతుఁడు

ఈతఁడు పరకీయగుణగ్రాహి, పాదచారి యైనలవునితో రథము నుండి పోర నిచ్చగింపక తానుం బాదచారి యైన ధర్మజ్ఞుఁడు. ఈతఁడును దొడ్డ గుణములందును కుశలవులవంటివాఁడే.

### సుమంతుఁడు

దశరథుని నాఁటినుండి రాఘవులసారథి, ప్రాజ్ఞుఁడు, ధర్మజ్ఞుఁడును, లవుఁడు ఋత్యాఖశాస్త్రసంపన్నుఁడైయున్నను, అతనితోడి పాడికయ్యమున చంద్రకేతునికి జయము గల్గునుగాక యని వేల్పులను వేఁడువాఁడయ్యెను, తనదొరకు పాదచారితో రథము దిగి పోరుటకు సమ్మతి యొసంగినాఁడు.

### శంబూకుఁడు

శూద్రమునిగా ఈ శంబూకుఁడు రంగప్రవిష్టుఁడు గాఁడు. ఈతఁడు శూద్రత్వ కారణమున తపోధికారము లేనివాఁడయ్యును తపస్సు చేయుచుండెను. ఆదోషముచేత బ్రాహ్మణశిసువు చచ్చెను. ఆ యపరాధమునకై శ్రీరాములవారు ఇతనిఁ దలఁగొట్ట నుద్యమించినప్పుడు, తపఃకృశుఁడై యున్నందుల శిరుగఁబోటు సేయలేదందుమేని, 'తపస్సు మానెదను, కావు'మని యేల వేఁడలేదు? విచ్చుకత్తిం జూడఁగానే రామాగమనము దండించుటకని ఇతనికి తెలియదా? మృతిచేత తన తపఃశ్రమ యెల్ల వ్యర్థప్రాయమగునుగదా. కవి ఆకాశభాషితములచేతనైనను ఇతనినోట దీనవాక్కులను పలికింపలేదు. కావున, ఈతఁడు దండనం బొందుటచేత తనదోషము తీఱు నని దాని నంగీకరించె నని చెప్పవలయును. కావున ఈతఁడు సాధువేగాని దుర్జనుఁడు గాఁడు. రాములవారితో నతఁడు తాను వృషలుఁడు అని ఆత్మాపకర్షగా చెప్పుకొనుటచేత నితని వినీతిసౌజన్యములు విశదపడుచున్నవి. ఇతనియందు తపస్సు దోష మాయెఁ గదా మఱి యితనికి దివ్యత్వ మెట్లు వచ్చినది? అని యడుగుదురు. అది తపస్సుచే వచ్చినదిగాదు, రామకృత నిధన ప్రభావముచేత వచ్చినది. అట్లని యితనివచనము 23 (2). రామాగమనముచే నీతఁడు పరమానందభరితుఁడై ఖడ్గహతిని తపోవనముం బోలె స్వీకరించె నని తోఁచుచున్నది.

## సీత

సీతాదేవి ఉత్తరకాండయందు అత్యంతమనస్విని, తనశుద్ధిని శ్రీరాములమ్రోల వాల్మీకి శపథపూర్వకముగా ప్రకటించువఱకు వేచియుండినది; పిమ్మట సడివడ్డతనకు వెండియుం బట్టు మహిషీపద మేలయని నేలలో నడంగినది. ఈ నాటకమందు అట్లుగాక కేవలరామపరాయణ యై రాములవా రంగీకరింపఁగానే మాఱు పలుకక సంతసముతో వారిం జేరినది. ఎప్పుడును రాముని ఆశ్వాసించుటకు సన్నద్ధురాలే: కావున, ఆమెకు నాటకమందు నిబద్ధమయినంత సత్త్వగుణోత్కర్ష ఉత్తరకాండకథలో లేదు. పరిత్యాగముచే దుఃఖిత యయ్యు అందులకై ఆమె రామునిపై కినుకఁ దాల్పదాయెను. ఒకమాటైన ఒక కటూక్తి పలుకదాయెను.

ధర్మపత్నిగా నేమి, పట్టమహిషిగా నేమి, పతిదేవతగా నేమి, ఆమె లోకములకు ఒరవడిగా నున్నది. వియోగమందు రాముని సీత చూచినట్లు రాముఁడును సీతను జూచుటగా సంవిధానమును కవి కల్పించి యుండినయెడల, అదియు నద్భుతముగాను రామప్రబోధకము గాను ఉండెడిది గదా యనిన, అందులకే సమ్మోహనాంకమున వివాహనటనాదిగా సీతాచరిత్రము రామునికిం బ్రత్యక్షమగుసంవిధానమునే కవి కావించినాఁడు. ఆమెనుగూర్చి కవి రచించిన సంవిధానములందలివైన యీ క్రిందివి తదీయగుణసింధు తరంగస్పృషతంబులం బరికించిన తచ్చిత్తౌన్నత్యము స్పష్టపడును.—తండ్రిమీఁది ప్రేమ 3. "మమ్మెందలంచుకొందురా!" 4, రాముఁడు "ప్రజారంజనార్థమై జానకినైనఁగాని విడనాడెద" 5 నని పలికినందులకు ఆమె అతనిని అందువలననే రఘుకుల ధురంధరుఁడని మెచ్చుకొనుట. [ఆమె తదీయ పట్టమహిషి గావున ప్రజాపాల నాభినివేశము ఆమెయు వహించియే యున్నది.] తన ప్రసూతిని జృంభకాస్త్రము లాశ్రయించు నని రాముఁడు పలుకఁగా ఆమె "మహాప్రసాద"మని కృతజ్ఞతం దెలు

పుట, "వత్స, ఈ యింకొక తె యెవరు?" 7 అని లక్ష్మణు నడిగిన కోమల పరిహాసపూర్వక ప్రశ్న. పరశురామ నిబర్హణ ప్రస్తావము నడంచిన వినయమహాత్మ్యమునకై రామునియందు ఆమె దాల్చిన గౌరవము, తనకు విసనకఱ్ఱను గొడుగుగాఁ బట్టి రాముఁడు ఎండను దొలంగించుచుండిన తన దక్షిణారణ్య ప్రవేశమును 8 జూడఁ గోరుట 9, శూర్పణఖయొక్క ప్రతిమను గూడ వెఱచుట 9, తనకై రాముఁడు పూర్వము పడిన తల్లడమును ఇప్పుడు విని తాను తల్లడ పడుట 10, జటాయు హనుమంతులయెడం గృతజ్ఞత, భాగీరథీపుణ్య జలావగాహనమునకు రాముని గూడి రమ్మనుట, నిద్రితను తన్ను ఒంటిగా వదలి పోయినందులకు రామునిపై అలుగఁ గోరి 17 ఆయనం గన్నప్పుడు తాను తన వసము గామిని తలంచుకొనుట 30, ఆమె గోదావరి నుండి లేచి వచ్చినతీరు 30 (4–5), 31, సఖీస్నేహము, రామమయ జీవితత్వము, తమసకు అవ్యక్తమయిన రామవాక్య తనకు సువ్యక్తముగా తెలియుట 31, పాండుర కృశదుర్బలాకారుని రామునిఁ గని మూర్ఛిల్లుట 32 మూర్ఛితుని ఆర్యపుత్త్రునిఁ గావుమని తమసపాదంబుల వ్రాలుట, ఏ మయినను గాని మ్మని తాఁ బోయి ఆర్యపుత్త్రుని మూర్ఛ తేర్చుట 33, ఆపాటియే తనకు మహత్తర మని సంతుష్టిం జెందుట, "నేను ఈయన హృదయము నెఱుంగుదును, ఈయన నా హృదయము నెఱుంగును" 24, నిష్కారణపరిత్యాగి నైనను ఆవిధముననున్న రామునిం గని తాఁ జెందిన యనిర్వచనీయ భావసంభేదము పరిత్యాగశల్యము హృదయమున మెర మెర లాడుచున్నను రాముని యుల్లాపములచేత తన జన్మలాభమునకై సంతోషించుట 35, 36, ఆర్యపుత్త్రుఁడు తనపుత్త్రకుల మోముఁదమ్ములను ముద్దుగొనఁ డాయెనే యని వందురుట 36, నిసుఁగుల సంస్మరణముచేత స్తనములు చేఁపి వారి తండ్రి సన్నిధానంబున క్షణమాత్రము తాను సంసారిణి యగుట 37, తాను మున్ను పెంచిన యేనుఁగుగున్నపైని నెమలికొదముపైని

వాత్సల్యము 37, ఆర్యపుత్త్రుని ఖేద మొందించినందులకు వాసంతిపై దెప్పర మాడుట 38, ఆర్యపుత్త్రుఁడు ఎల్లవారికిఁ బ్రియుఁ డని భావించుట 39, ఆర్యపుత్త్రుని సుఃఖముచే తన హృదయము వడవడ వడంకుట 42, తన కరస్పర్శచేత నతనిం దేర్చి తదీయాంగస్పర్శచే తాను మోహముపా లగుట 44, "ఆతఁడవే యిపుడు నీవు," "ఈపరిత్యాగ మేమి! ఈహృదయాసంగ మేమి?" 45, "నేనే క్రూరురాలను", "నిరవధి యని చెడితిని మందభాగ్యను" 46, తన బంగారుపుఁ బ్రతిమచేత తన పరిత్యాగశల్యము తివిచివైవఁబడిన దని సంతసించుట 46, "అపూర్వపుణ్యముచే దర్శన మిచ్చిన యార్యపుత్త్రుని చరణకమలములకు నమస్కారము". ఇరువురు దారకులం గని "హా ఆర్యపుత్త్రా!" యని మూర్ఛిల్లుట 85, సీతం గైకొమ్మని రాముని అరుంధతి ఆదేశించి నప్పుడు ఈమె తన్నుం దప్పక గైకొను ననుట—"ఎఱుంగు నార్యపుత్త్రుఁడు సీతా దుఃఖమును కడిగివైచుటకు" 92, అని తదీయ హృదయజ్ఞతం దెలుపుట—ఇవి ఈ కవిలోకమార్తాండుఁడు సీతాదేవితం బూజించిన పువ్వురాశినుండి భక్తులకుం బిడికెడు ప్రసాదము.

మహా పతివ్రతలకు మహిమ లుండునే, ఈమెయెడ నేమియుం గనఁబడ లేదే యందురా? అందులకు మురళి యుత్తరము చెప్పియున్నది. "ఇట్టివారు" 29 (8). పృథ్వీభాగీరథులు స్వయము మంత్రపానులు తల్లియత్తలు నై రక్షించుటకన్న మహిమ యేమి గానలయును! అరుంధతిచేత 'తనయవాశిష్యవో' 52 (9) అని పొగడ్త నొందుటకన్న మహిమయొం డుండునా!

## రామదేవుఁడు

ఈ దేవునియందు భవభూతి ఈ క్రింది వృత్తములను వర్ణించి నాఁడు

అనుష్ఠానగౌరవము 8 (1), శ్రౌతకర్మశ్రద్ధ 8, గురుభక్తి, ఋషివాక్యాన విశ్వాసము 4 (8), సీతమీఁది యనురక్తికన్న ప్రజా

రంజనాభినివేశము ఎక్కుడు 4 (5). ప్రజలవిషయమై క్షమ, మధ్యమాంబానింద్యవృత్తాంతోద్ఘాటనము నారంభింపనీయమి 7, తన యుత్కర్షను వాకొననీయమి 7, పూర్వసుఖస్మరణచే నిప్పుడు ప్రీతిం జెందుట 9 (19, 20), పూర్వదుఃఖస్మరణచే నిప్పుడు మితి లేని దుఃఖముం బడయుట 10 (22). 11 (26), జటాయు హనుమంతుల యెడ కృతజ్ఞత 10, 11 (25), సీతావివాసనము, అదిమూలముగా ఉన్మత్తునివలె ప్రలపించుట 17, దండ్యునిమీఁద సయితము దయఁ గూరుట 22 (1), అగస్త్యఋషియందు గౌరవము 28, సీత పెంచిన గున్న యేనుఁగుం గావను దానిం బయిగొన్న యేనుఁగును దండింపను బోవుట 35, తమగున్న జయించినందులకు అలరుట (8). సీతెం దలంచుకొని మాటిమాటికిని మూర్ఛిల్లుట, తత్కరస్పర్శచే తేరుట, వియోగ దుఃఖాతిభారము, రోదనము, ఆయాపరిచిత ప్రదేశములం గని యలందురుట, మహార్ఘవిభూతి 74 (3, 4) అవిదిత బాంధవ్యులైన పుత్త్రిల యందు వాత్సల్యము, వారియందు సీతాసాదృశ్యముం గని యుత్కంఠం జెందుట,లవుని రామాయణశ్లోక పఠనమునకు తన్నుమఱచి బాష్పాయితాక్షుఁడగుట 80 (22), శిశువులయెడ నట్లు తాను దుర్మనాయితుఁడైనందులకు లజ్జించుట 8.,అనలంకారమనోరమమునుసీతావక్త్రమును అనుధ్యానించుట 82 (30), సీతాకృచ్ఛ్రము తనవలనం గలిగినందులకు దుఃఖించుట 85, గంగాపృథ్వులయెడ కృతజ్ఞత, సీతా విలయమునకు మూర్ఛిల్లుట 90, గుర్వాజ్ఞచేత సపుత్త్రను సీతను బొంది హర్షించుట. ఈనాయకుని విశేషము తనసుఖమును దుఃఖమును చూడక లోకారాధనవ్రతమును నిర్వహించుట.



## నాటకలక్షణ ప్రతి

దృశ్యము శ్రవ్యము అని కావ్యము రెండు విధములు. అందు దృశ్యము అభినయింపఁబడును. దానికే నటునియందు రామాదిరూపము నారోపించుటచేత రూపకమని నామాంతరము. అభినయమనఁగా అవస్థను అనుకరించుట. రూపకము ఉపరూపకము అని రూపకము రెండు విధములు. అందు నాటకము ప్రకరణము భాణము ప్రహసనము డిమము వ్యాయోగము సమవకారము వీథి అంకము ఈహామృగము అని రూపకము పది విధములు. పదిరూపకములలో ఉ. రా. చ. నాటకము తెగలోనిది. [కడమరూపకములకును ఉపరూపకములకును దానిదానికి చెప్పఁబడు విశేషము దప్ప సామాన్యలక్షణ మెల్ల నాటకమునకు ఎట్లో అట్లే ఎఱుంగవలయును.]

నాటకమునకు లక్షణము ఎట్లన:—నాటకమున ఇతివృత్తము ప్రసిద్ధమైనది. అయిదు సంధులు ఉండును. విలాసము ఋద్ధి లోనగు గుణములును నానావిభూతులును ఉండును. అది సుఖదుఃఖములచేత సముద్భవించునది, నానారసములచే నిండినట్టిది. అందు అంకములు అయిదు మొదలు పదివఱకు ఉండును. నాయకుఁడు ప్రఖ్యాత వంశుఁడు రాజర్షి ధీరోదాత్తుఁడు ప్రతాపవంతుఁడు గుణవంతుఁడు దివ్యుఁడేని దివ్యాదివ్యుఁడేనియుఁ గావలయును. శృంగారమేగాని వీరమేగాని ఒకటే అందు ప్రధానరసముగా నుండును. కడమ రసము లన్నియు అంగములు [అప్రధానములు]గా నుండును. కార్యనిర్వహణమందు అద్భుతరసము. కార్యమందు పనిగల పురుషులు నలువురేని అయిదుగురేని ముఖ్యులుగా నుందురు. దానిని గోపుచ్ఛాగ్ర సమగ్రముగా నిర్మింపవలయును.

అంకలక్షణము:—అంకమున నాయకుని చరిత్రము ప్రత్యక్షముగా చూపఁబడును, రసభావములు వెలుంగుచుండును. శబ్దార్థములు అగూఢముగాను గద్యవాక్యములు చిన్నవిగాను ఉండవలయును, ఏదేనొక యవాంతర ప్రయోజనము సమాప్తి చెందవలయును, బిందువు కొంచెము అంటియుండవలయును, కార్యములు పెక్కుగా నుండఁగూడదు. బీజమునకు సంహారము కూడదు, నానాసంవిధానములు వలయును. పద్యములు మిక్కుటముగా నుండఁగూడదు. ఆవశ్యక కార్యములకు భంగము కలుగఁగూడదు. కథ అనేకదినములు పట్టునదిగా నుండఁగూడదు. నాయకుఁడు ఆసన్నుఁడుగా నుండవలయును. పాత్రములు ముగ్గురు నలుగు రుండవలయును.

ఈవక్ష్యమాణములు అందుం గూడవు—దూరమునుండి, పిలుచుట, చంపుట, యుద్ధము, రాజ్యము, దేశము లోనగువానికి ఉపద్రవము, పెండ్లి, భోజనము,

శాపము, ఉత్సర్జనము, మరణము, రతము, దంతక్షతములు సేయుట, నఖక్షతములు సేయుట, ఇట్టి లజ్జాకరములగు నితరకృత్యములును, శయనించుట, మోవియానుట, ఇత్యాదులు, నగరాదులను ముట్టడించుట, స్నానమాడుట, మైపూఁతపూసికొనుట,—ఇవి అంకమందు చూపఁగూడదు. అంకము మిక్కిలి దీర్ఘముగా నుండఁగూడదు, దేవీపరిజనాదులయు మంత్రులయు వణిజులయు భావరసోద్భవములైన ప్రత్యక్షచిత్రచరితములతోఁ గూడినదై యుండవలయు; దానియంతమున పాత్రములందఱును నిష్క్రమింపవలయును.

రంగద్వార ప్రస్తావనాదులు కలదై బీజమును ఫలమునుగలదై ఒక యంకము గర్భములోపల ప్రవేశించినదైన మఱియొక యంకము గర్భాంక (Interlude) మనఁబడును. ఉదా. బాలరామాయణమందలి సీతాస్వయంవరమును, ఉ. రా. చరితమందలి కుశలవ జననభాగమును, మఱియు ప్రతాపరుద్రీయమందు అష్టమాంకమున ఓడలో సుల్తాను ప్రోల నర్తకు లాడించిన భాగమును.

నాటకమునకు ముందుగా పూర్వరంగము, అటుపిమ్మట సభాపూజ, తర్వాత కవిని పేర్కొనుట, నాటకమును గూడ పేర్కొనుట, తర్వాత ప్రస్తావన. అందు నాట్యవస్తువుకంటె ముందుగా రంగవిఘ్నోపశాంత్యర్థము నటులు గావించునట్టిది పూర్వరంగ మనఁబడును. దీని యంగములలో ముఖ్యమైనది నాంది యనునది. ఆశీర్వచనముతోఁ గూడినట్టిది దేవద్విజ నృపాదుల స్తుతి నాంది యని చెప్పఁబడును. అది మంగళకరములైన శంఖ చంద్ర కమల చక్రవాక కైరవములను వచించునదియు, ఎనిమిదేని, పండ్రెండేని పదములు గలదియు గావలయును, ప్రాయికముగా నాటకములలో నాంది యని తలంపఁబడుచున్నట్టిది పూర్వరంగముయొక్క రంగద్వార నామకమైన యంగముగాని నాంది గాదని కొందఱి మతము.

సూత్రధారుఁడు మధురములును కావ్యార్థసూచకములును అగు శ్లోకములచేత రంగమును ప్రసన్నముం గావించి రూపకనామమును కవినామ గోత్రాదులను కీర్తింపవలయును. భారతీవృత్తి నవలంబింపవలయును. ప్రాయికముగా ఏదేని యొక ఋతువును ప్రస్తావింపవలయును. భారతి యనఁగా సంస్కృతప్రాయమును నరాశ్రయము నగు వాగ్వ్యాపారము.

సూత్రధారుఁడు నటితో నేని విదూషకునితో నేని పారిపార్శ్వకునితో నేని, కూర్చుకొన్నవాఁడై తమ కార్యముల నుండి యుత్పన్నములై ప్రస్తుతమును ఆక్షేపించునవైన చిత్రవాక్యములచేత చేయు సల్లాపము ఆముఖ మనియు ప్రస్తావన యనియు చెప్పఁబడును.

ఏ వస్తువు నాయకునికి అనుచితమేని, రసమునకు విరుద్ధమేని, అగునో దానిని వదలవలయును, వేఱువిధముగా నేని కల్పింపవలయును.

అంకములయందు చూపరానిది అయినను అవశ్యము తెలుపవలసినదియగు కథను అర్థోపక్షేపకములచేత చెప్పవలయును. అర్థోపక్షేపకములు అయిదు — విష్కంభక ప్రవేశక చూళి కాంకావతా రాంకముఖములు.

విష్కంభకము — భూతభవిష్యత్కథాంశములను తెలుపును, సంక్షిప్తముగా నుండును, అంకమున కాదిలో చూపఁబడును. అది ఒకరో యిద్దరో మధ్య పాత్రములచే జరుపఁబడిన యెడల శుద్ధమనఁబడును, నీచమధ్యపాత్రములచే జరుపఁబడినచో సంకీర్ణమగును.

ప్రవేశకము — నీచపాత్రములచే నీచవాక్యములచే చేయఁబడును. రెండంకముల నడుమ వచ్చును. మిగత లక్షణము విష్కంభమున కెట్లో అట్లే.

చూళి — యనునది పరదాలోనివారు చేయునట్టి యర్థసూచన.

అంకాంతసూచిత పాత్రములు ఆ యంకమునకు తెంపులేనియట్లుగానే పై యంకమును తొడంగుట అంకావతార మనఁబడును.

ఒక యంకములో అన్నియంకముల సూచనయు సేయఁబడునేని దానిని అంకముఖ మందురు.

బీజ బిందు పతాకా ప్రకరీ కార్యములు అయిదు అర్థప్రకృతులు.

కొంచెముగా ఉద్దేశింపఁబడి బహుప్రకారముల వ్యాపించునది ఫలమునకు ప్రథమ హేతువు బీజ మనఁబడును.

అవాంతరకథ విచ్ఛేద మొందినప్పుడు దానిని పైకథతో సంధానము సేయు నట్టిది బిందువు.

వ్యాపియగు ప్రాసంగికవృత్తము పతాక యనఁబడును.

ప్రాసంగికమై ఏకదేశస్థమగు చరితము ప్రకరి.

ఏది సాధింప నపేక్షితమో దేనికొఱకై యారంభమో, దేని సిద్ధిచే సమాప్తమో అది కార్య మనఁబడును.

ఫలార్థులు తొడంగిన కార్యమునకు అయిదు అవస్థలు:— ఆరంభ యత్న ప్రాప్త్యాశా నియతాప్తి ఫలాగమములు.

వరుసగా ఈ యైదవస్థలును మున్ను చెప్పిన యర్థప్రకృతులతో యోగమందుటచేత ఇతివృత్తము అయిదు భాగము లగును. అవి క్రమముగా ముఖ ప్రతిముఖ గర్భ విమర్శోపసంహారము అని అయిదు సంధు లగును.

ఉ. రా. చ. యందు 1 అంకమున ముఖసంధి, 2-3 అంకములందు ప్రతిముఖ సంధి, 4-5 అంకములందు గర్భసంధి, 6 అంకమున విమర్శసంధి, 7 అంకమున నిర్వహణసంధి- ఇత్యాది నాటకలక్షణసమన్వయమును ఈ గ్రంథమున వ్యాఖ్యానవశమున తెలియంగవలయును.

## ఉ. రా. చ. కొన్ని సూక్తులు

1. వనితలం దెల్ల యట్టులే వాక్కులందు
   సాధుతా విషయమున దుర్జనులు జనులు 2-5
2. వాక్కు వెంబడి నర్థంబు పఱచివచ్చు
   నాద్యులయినట్టి పరమ మహర్షులకును. 4-3
3. హుతవహుండును బుణ్య తీర్థోదకంబు
   నన్యములచేత శుద్ధి కర్హంబు లగునె! 5-6
4. పెట్టంబోలును గాక మూర్ధమున సంప్రీతిన్ విసర్గార్హతన్.
   మెట్టం జెల్లునె పాద ఘాతములచే మేల్త్రావు లిప్పువ్వమున్. 7
5. "చెలఁగుఁ బ్రియంకరంబె"—ఆర్యవృత్తము. 18-2
6. "ఒసఁగును విద్య"—విద్యార్థి ప్రజ్ఞాభేదములు, 19-4
7. తర మెవ్వరి కాను వారి తత్త్వము దెలియన్? 21-7
8. చావులుగూడ సాధుజన సంగతకంబులు తారకంబులౌ. 23-10
9. "ఎది యొకనికిఁ బ్రియమగు" - మైత్త్రీప్రభావము. 24-10
10. "వెల్లి దరుఁ బారలి" - లోకశాంత్యుపాయము. 40-22
11. గానమునె పూజనం బద మగున్ గొంగావు దయున్నలింగమున్. 53.9
12. వారలమానసంబు సుమనస్సుకుమారము గాదె తారయన్ .10
13. "హేతుశూన్యం బయిన" - తారామైత్త్రకము. 66-7
14. "ఋషులు వెత్తి" - రాక్షసవాక్కు 69-80
15. "కోర్కులను బిందు" - సూనృతోక్తి 81
16. ఆరయఁ దీర్ఘము ల్బలె మహార్ఘ్య విభూతియుతుల్ మహాజనుల్. 74-4
17. "గూఢహేతు వొకటి" - పూర్వకర్మ వాసన 75-5
18. "తేజఁగలాఁడు" - తేజస్వివృత్తము. 76-7
19. దైవము పచేలిమం బయి దతీయ దాని
    ద్వారములు మూయఁ దరమె యేప్రాణికైన? 86-4

## ఈతని రూపకములందు సాధారణములైన శ్లోకములు

| సంఖ్య | శ్లోకము | మాలతి | వీరచరిత | ఉ. రా. చరిత |
|---|---|---|---|---|
| 1 | అనియత | 10-2 | | 4-4 |
| 2 | కింత్వనుష్ఠాన | | 4-33 | 1-3 |
| 3 | అప్యాత్మార్థ్యాత | | 2-45 | 6-21 |
| 4 | ఇహ సమద | | 5-40 | 2-20 |
| 5 | ఏతస్మిన్మద | 9-14 | | 1-31 |
| 6 | చతుర్దశసహ | | 3-13 | 2-15 |
| 7 | చూడాచుమ్బిత | | 5-18 | 4-20 |
| 8 | జీవయన్నివ | 8-3 | | 1-34 |
| 9 | జ్యాజిహ్వయా | | 3-29 | 4-29 |
| 10 | త్రాతుం లోకా | | | 6-9 |
| 11 | దధతిపహాం | 9-6 | | 2-21 |
| 12 | దళతి హృదయమ్ | 9-12 | | 3-31 |
| 13 | మాతర్త్యాత5 | 9-20 | | 3-30 |
| 14 | పరిపా | 2-4 | | 3-4 |
| 15 | పుత్రసంక్రాన్త | | 4-51 | 1-22 |
| 16 | బ్రహ్మదయో | | 1-42 | 1-15 |
| 17 | శ్రోతాత | 9-34 | | 3-16 |
| 18 | స్యతిపఖజతి | 1-27 | | 6-12 |
| 19 | సుహృదివ | 4-7 | | 4-15 |

## ఈ నాటకమునందలి పురుషులు

సూత్రధారుఁడును, నటుఁడును; గర్భాంక సూత్రధారుఁడును.
రాముఁడు—కథానాయకుఁడు.
కంచుకి.
అష్టావక్రుఁడు—ఒకముని.
లక్ష్మణుఁడు—నాయకుని యనుజుఁడు.
దుర్ముఖుఁడు—అంతఃపురచారియైన పరిచారకుఁడు.
శంబూకుఁడు—శూద్రముని.
సౌధాతకి, భాండాయనుఁడు వాల్మీకి శిష్యులు.
జనకుఁడు—విదేహరాజు, సీత తండ్రి.
గృష్టి—ఒక కంచుకి.
కుశలవులు—రామపుత్రులు.
బ్రాహ్మణవటువులు,
పురుషుఁడు—చంద్రకేతుని సైనికుఁడు.
చంద్రకేతుఁడు—లక్ష్మణపుత్రుఁడు.
సుమంత్రుఁడు—చంద్రకేతుసారథి.
విద్యాధరుఁడు.
వాల్మీకి—రామాయణకర్త.

## ఈ నాటకమునందలి స్త్రీలు

సీత—కథానాయిక.
ప్రతీహారి.
ఆత్రేయి—తాపసి.
వాసంతి—వనదేవత, సీత చెలి.
తమసా మురళలు—నదీదేవతలు.
అరుంధతి—వసిష్ఠపత్ని.
కౌసల్య—రామమాత.
విద్యాధరి,
పృథ్వీదేవి—సీతతల్లి.
భాగీరథి—[గంగాదేవి]

# ఉత్తరరామచరితనాటకము

## ప్రస్తావన

ఆ. శ్రీలెసంగ విడెదఁ జేమోడ్పు నమ యంచుఁ
గాంచితోడ నాద్యకవివరులకుఁ;
దత్కృపాభరమునఁ దక్కాక వదపెద
నమృతి యాత్మకిళయు నై నవాణి. ౧

[నాంద్యంతమున]

సూత్రధారుఁడు— అతి విస్తరము వలదు. ఇదె యిప్పుడు కాలప్రియనాథ భగవంతుని యాత్సవములో మహానుభావులకు మీకు విన్నపము చేసికొనుచున్నాను. ఇట్లు మీ చిత్తమున నవధరింపవలయును—కలఁడుగదా మహానీయుఁడు కాశ్యపుఁడు శ్రీకంఠపదలాంఛనుఁడు పద వాక్య ప్రమాణ తత్త్వజ్ఞుఁడు జాతూకర్ణీపుత్త్రుఁడు భవభూతి.

తే. నడుపకుండొరె నెవనికిఁ బలుకుదేవి
తలఁపులోన మెలంగు సంతసముతోడఁ;
దద్రచితనాటకంబు నుత్తరము రామ
చరితమును నేఁ బ్రయోగింప జతనపడితి. ౨

ఇదె నేను కార్యవశంబున అయోధ్యావాసిని అప్పటివాఁడనునైతిని. [కలయం జూచి] ఓహో! పౌలస్త్యవంశధూమకేతు వగు మహారాజరాములవారి పట్టాభిషేకసమయము కెయ్యుంబలు ఎడతెంపులేని యానంద నాందీనాదములచే ఘూర్ణిల్లుచుండునట్టిది యిది! మఱియేమి యిప్పుడు చత్వరస్థానములు నటులసందడిలేక యున్నవి!

నటుఁడు—[ప్రవేశించి] బావా, పంపినారుగదా మహారాజుగారు ఇట నుండి వారివారి యిండ్లకు లంకాయుద్ధ మిత్త్రులైన యా మహాత్ములను వానర రాక్షసులను, తన్ను నానందంబొందింప నానాదిగంతములనుండియు వచ్చినవారిని బ్రహ్మర్షులను రాజర్షులను. వారున్నంతకాలము వారి నారాధించుటకుఁగాను ఇన్ని దినములు అనవరతము ఉత్సవము జరుగుచుండినది. మఱి యిప్పుడన్ననో?—

తే. అల వసిష్ఠుం డధిష్ఠాత యై సనంగ
భూపుతల్లు లరుంధతి మున్నిడుకొని
పోయినా రల్లునాశ్రమంబునకు నతని
జన్నమును గన్నులార దర్శనము సేయ. ౩

సూత్ర.— పరదేశము వాఁడను గావున నడిగెదను. ఎవ రాయన, వీరి యల్లుఁడు?

నటుఁడు.—

తే. తనయ గల్గె దశరథునికి శాంత యనంగ,
రోమపాదుఁ డామె నోమె సుతగ,
ఆమెఁ బెండ్లియయ్యె నల విభాండకుపట్టి
ఋశ్యశృంగుఁ డనెడుఋషివరుండు. ౪

ఆ యల్లుఁ డిప్పుడు పండ్రెండేండ్ల యాగము దొడంగినాఁడు. ఆయనమీఁది దాక్షిణ్యముచేత గురుజనులు పూర్ణగర్భిణియైనను కోడలిని జానకిని వదలి యటకుఁ బోయినారు.

సూత్ర.—మనకేల యీ జోలి? రా, రాజద్వారమునకేపోయి మన కుల ధర్మముచేత సేవింతము.

నటుఁడు.—అటయిన, బావా, ఏలినవారికై కడుం బరిశుద్ధమైన స్తోత్రపద్ధతిని నిరూపింపుము.

సూత్ర.—మారిషుఁడా.

తే. సర్వవిధములఁ గులవృత్తి సల్పుదె సరి,
యెట్టులును దూఱు తప్ప; ద దెట్లటన్న?
వనితలం దెట్లొ యట్టులే వాక్కులందు
సాధుతావిషయమున దుర్జనులు జనులు. ౫

నటుఁడు.—అతి దుర్జను లని చెప్పవలసినది.

తే. ఏల యన, దేవి వైదేహినే గుఱించి
యాడికలు పల్కఁజొచ్చి రయ్యారె జనులు!
రక్కసునియింట మనికి కారణము చేసి,
వహ్నిశుద్ధిని విశ్వసింపంగ లేక! ౬

సూత్ర.—ఈ జనవాదము మహారాజునకు అందినా అంతట మిగులఁ గష్టము కలుగును.

నటుఁడు.—ఎల్ల విధముల ఋషులును దేవతలును మేలుచేయుదురు. [అని పరిక్రమించి] ఓహోయి! ఏలినవారు ఇప్పుడు ఎక్కడ నున్నారు? [ఆకర్ణించి] జనులు ఇట్లు పలుకుచున్నారు:—

శా. ఆనందం బిడుకోర్కి నర్మిలి విదేహాధీశుఁ డేతెంచి తా
నీనా క్షత్త్రవసంతతిం గడపి యిప్డే వీడుకోల్ గైకొనెన్:
దానం జేసి మదిం గుమారిలెదు సీతాదేవి మారార్ప నా
స్థానిన్ వీడ్కొని వాసవేశ్మమునకున్ ధాత్రీవిభుం డేఁగెడిన్. ౭

ప్రస్తావన ముగిసినది [అని నిష్క్రమింతురు.

# ప్రథమాంకము

[అంతట కూర్చున్నవారుగా రాముఁడును సీతయుఁ బ్రవేశింతురు]

రాముఁడు — దేవీ, ఊఱడిల్లుము; ఆ పెద్దలు తమ యిచ్చచేత మనలను విడిచిపోవ శక్తులుగారు.

తే. ఐననుఁగా, నిత్యమౌ ననుష్ఠాన మన్న,
వఱలనీయదు స్వాతంత్ర్యవర్తనమును,
అడుగడుగునను బ్రత్యవాయములచేత
నాహితాగ్నులం గార్హస్థ్య మరిదిగాదె! ౧

సీత — ఎఱుఁగుదును ఆర్యపుత్త్రుఁడా అయినను బంధుజనులతోడి యెడబాటు సంతాపమును గలిగించును.

రాము — అది యట్లే. హృదయమర్మచ్ఛేదకములుగావా యీ సంసారభోగములు? వీనిపై నొల్లమిగొని ఎల్లకోర్కులను వదలి జ్ఞానులు అరణ్యములో విశ్రమింతురు.

కంచుకి — [ప్రవేశించి] రామభద్రా. [అని యర్ధోక్తిలో జంకి] మహారాజా.

రాము — [చిఱునవ్వుతో] ఆర్యా, నిక్కముగా నాయనగారిపరిజనమునకు నన్నుఁ గూర్చి రామభద్ర అను నుపచారమే శోభించును. కావున అలవాటు ప్రకారము పలుకుము.

కంచు — దేవా, ఋష్యశృంగాశ్రమమునుండి అష్టావక్రులవారు వచ్చియున్నారు.

సీత — విలంబ మేల?

రాము — త్వరగా వారిని బ్రవేశపెట్టుము. [కంచుకి నిష్క్రమించును.

అష్టావక్రుఁడు — [ప్రవేశించి] మీకు శుభము.

రాము — అభివాదనము చేయుచున్నాను. ఇటఁ గూర్చుండుఁడు.

సీత — మ్రొక్కెదను మీకు. గురుజనుల కెల్లరకును శాంతమ్మకును కుశలమా?

రాము — మా బావగారు ఋష్యశృంగభగవానులవారును మా యక్క శాంతమ్మయును నిర్విఘ్నముగా సోమపానము గావించినారా?

సీత — మమ్ము తలంచుకొందురా?

అష్టా — [కూర్చుండి] అట్లే; దేవీ, వసిష్ఠభగవానులవారు నీ కిటు చెప్పి పంపినారు:

తే. నిన్ను విశ్వంభరాదేవి కన్నతల్లి,
ధాత కెనయౌ జనకరాజు తండ్రి నీకు,
ఏన్నృపులకులగురువుల మినుఁడు నేను,
వారికోడల వైతి మాపట్టి, నీవు. ౨

నీకు ఇంతకు మించి యేమి యాశీర్వదింతుము! కేవలము వీరప్రసవవు అగుదువు గాక!

రాము — దేవి, మనము అనుగ్రహింపఁబడితిమి.

తే. అర్థముల నెందును వాక్కు లనుగమించు
లౌకికులగు సాధువులకు వాలాయముగను,
వాక్కు వెంబడి నర్థంబు పఱచి వచ్చు
నాద్యు లయినట్టి పరమమహర్షులకును. ౩

అష్టా — అరుంధతీభగవతియు శాంతాదేవియు ఈ మాట నీకు మాటిమాటికి చెప్పి పంపినారు. — సీతాదేవికి కవిల్లు ఏమైనఁ గలిగినేని దానిని నీవు అవశ్యముగా వెంటనే సంపాదింపవలయు నని.

రాము — ప్రేయసి చెప్పినేని, జరుపఁగలవాఁడను.

అష్టా — దేవి, నీకు నీ యాఁడుబిడ్డభర్త ఋష్యశృంగులవారును ఇట్లు సందేశించినారు:— "అమ్మాయీ, నిండువేఁకటితో నున్నావని నిన్ను రప్పింప మైతిమి, అబ్బాయిని రామభద్రునికూడ నీకు వినోదమునకై నీయొద్దనే నిలిపితిమి; మఱి పుత్త్రపూర్ణమైన యొడితోడి నిన్ను ఆయుష్మతిని చూడఁగలము." అని.

రాము — [ఔత్సుక్యముతోను చిఱునగవుతోను] అట్లే యగుఁగాక. వసిష్ఠభగవానులవారు నాకేమియు నాజ్ఞప్తి పంపలేదా?

అష్టా — ఒసంగినారు; వినుము.

తే. అల్లవిమతంబు సంకెల యయ్యె మాకు,
షీరకంతుఁడ, వేలెదుదారిక్రొత్త;
ప్రజలరంజింపఁ దివురు మెప్పాట నైన;
దాన నగుకీర్తియే మేలిధనము మీకు. ౪

రాము — భగవానులు మైత్రావరుణివారు ఆదేశించినట్లు చేసెదను!

తే. అర్మిలినిగాని, దయఁగాని, హాయిఁగాని,
అది యి దన నేల జానకి నైనఁ గాని,
ప్రజల యనురంజనమునకై వదలునాకు
హృదయమునఁ గల్గ దిసుమంత యేని వంత. ౫

సీత—అందువలననే ఆర్యపుత్త్రుఁడు రఘువంశధురంధరుఁడు.

రాము—ఎవరోయి అక్కడ? అష్టావక్రులను విశ్రమింపఁ జేయవలసినది.

అష్టా—[లేచి పరిక్రమించి] అహో! కుమార లక్ష్మణుఁడు వచ్చినాఁడు!
[అని నిష్క్రమించును.

లక్ష్మణుఁడు—[ప్రవేశించి] జయ మార్యునికి. ఆర్యా, ఆ ముచ్చి అర్జునుఁడు మనము నియమించిన ప్రకారము అన్నయ్య చరిత్రమును ఈ వీథిలో చిత్రించినాఁడు. దానిని అన్నయ్య వచ్చి చూడవలయును.

రాము—వత్సా, ఎఱుఁగుదువోయి వగఁగూరుచున్న దేవిని వినోదపెట్టుటకు; చరిత్రము ఎంతవఱకు చిత్రింపఁబడినది?

లక్ష్మ—వదినగారి వహ్నివిశుద్ధివఱకు.

రాము—[ఓదార్చుటగా]

తే. జన్మపరిపూత శ్రీమత్క్ష్మాతనయకుఁ
పావనాంతరములచేతఁ బనియునేమి?
హుతవహంబును బుణ్యతీర్థోదకంబు
నన్యములచేత శుద్ధి కర్హంబు లగునె! ౬

దేవి, దేవయజనసంభూతురాలా, మన్నింపుము. ఇది నీకు యావజ్జీవితమైన జనవాదము!

శా. కష్టా! లోకులు రంజనీయులు కులోత్కర్షాఢ్యులౌ వారికిన్!
జెట్టం బల్కితి దాన నీపెను హతౌచిత్యంబె నేఁ గూళ నై;
పెట్టంబోలునుగాక మూర్ధమున సంప్రీతిన్ విసర్గార్హతన్,
మెట్టంజెల్లునె పాదఘాతపటిమన్ మేల్తావి యాపుష్పమున్! ౭

సీత—ఆర్యపుత్త్రా, మఱి నీ చరిత్రమును చూతము. [లేచి పరిక్రమింతురు.

లక్ష్మ—ఇదె యా చిత్త్రము.

సీత—[నిర్వర్ణించి] ఎవరు వీరు? మింట ఎడతెంపులేక నిలిచియున్నారు! ఆర్యపుత్త్రుని స్తుతించుచున్నట్లగపడుచున్నారు?

లక్ష్మ—ఇవి అల్లజృంభకాస్త్రములు సరహస్యములు, భృశాశ్వభగవంతుని వలన నుండి కౌశికఋషిని—అనఁగా—విశ్వమునకు మిత్రమైన విశ్వామిత్రులవారిని చేరినవి. వారిచేత అన్నయ్యకు ప్రసాదింపఁబడినవి.

రాము—నమస్కరింపుము దేవి, దివ్యాస్త్రములకు.

ఆ. బ్రహ్మహితముకొఱకు బ్రహ్మాదులాద్యులు
మేలు వర్షములు తపించి గురులు
ఆత్మతేజములనె యస్త్రములుగ వీనిఁ
బడుతపోమయములఁ బడసినారు. ౮

సీత — వీనికి నమస్కారము.

రాము — తప్పకుండ నివి నీ ప్రసూతిని సేవింపును.

సీత — మహాప్రసాదము.

లక్ష్మ — ఇది మిథిలావృత్తాంతము.

సీత — ఆహా! విచ్చుచున్న నల్లగలువరేకుల చాయవైనచాయతోఁ జిన్నని చక్కని బల్లిదంపుదేహసౌభాగ్యముతో అవలీలగా విఱిచిన ముక్కంటివింటితో ముద్దు తొడవైన కాఁకటితో ఆర్యపుత్త్రుఁడు ఇదె ఆలిఖితుఁడు. ఆర్యపుత్త్రుని యీసౌమ్య సౌందర్యలక్ష్మిని మానాయన ఆశ్చర్యపడుచు తెప్పవాల్పక తేఱిపాఱ చూచుచున్నాఁడు!

లక్ష్మ — ఇదిగో చూడవమ్మా ఇచ్చట.

తే. రమణ మీతండ్రిగా రాంగిరసునిపుత్త్రి
నీశతానందుఁ గులపురోహితుని. గూడి.
పూజ సల్పుచునున్నారు ముదము దొలఁక,
నసుఁగువియ్యంకులకు వసిష్ఠాదిములకు. ౯

రాము — ఇది చక్కఁగాఁ బొందియున్నది,

క. జనకులకును రఘువులకును
నొనరిన వియ్యం బెవరికి నూన్పదు ముదముఁగా,
మునుకొని యిచ్చునతండుఁగా
గొనునతఁడును నెందు గొఱకుండె స్వయముగాఁగా! ౧౦

సీత — వీరుగో మీరు అప్పుడే గోదానమంగళ మయిన నలువురు భ్రాతలు వివాహదీక్షను వహించినవారు. ఆహా ఆ తావునకే ఆ సమయమునకే ఇపుడు ఉన్నానని తలంచుచున్నాను!

రాము — అట్లే.

ఉ. వాసిగ గౌతమార్పితము బద్ధమనోరమకంకణాంక మై
భాసురమూర్తిఁగొన్న పెనుఁబండువు నాఁగను నీదుకేలు దా
నేసమయాన నన్నిది రహిం బ్రమదాంబుధి నోలలార్చెనో
యాసమయం బిదే యనుచు నాత్మను మోహము గూరెడిఁగా సఖీ. ౧౧

లక్ష్మ — ఈమె పెదవదినెగారవు నీవే. ఈమె చిన్నవదినె మాండవి. ఇదె వధువు శ్రుతకీర్తి.

సీత — వత్సా, ఈ యింకొక తె ఎవరు?

లక్ష్మ — [సలజ్జస్మితముతో, స్వగతము] ఆర్య ఊర్మిళనుగూర్చి యడుగుచున్నది. కానీ, ఈమెను వేఱువిషయమునకు మరల్చెదను [ప్రకాశము] వదినెగారు చూడవలయును. ఇది చూడఁదగినది. మఱి వీఁడుగో ఈయన పరశురామభగవానుఁడు.

సీత — భయమగు చున్నది!

రాము — ఋషీ, నమస్కారము నీకు.

లక్ష్మ — అన్నయ్యా, చూడుచూడు ఈయన నీచేత [అని అర్ధోక్తములో]

రాము — [ఆక్షేపముతో] వత్సా, చూడవలసినది పెల్లగా నున్నది. మఱి యొకటి చూపుము.

సీత — [గౌరవముతో నిర్వర్ణించి] లెస్సగా శోభిల్లుచున్నాఁడు ఆర్యపుత్త్రుఁడు ఈ వినయమాహాత్మ్యముచేత.

లక్ష్మ — ఇదె మనము అయోధ్యకు చేరితిమి.

రాము — [కన్నీళ్లతో] స్మరించుచున్నాను! అకటా స్మరించుచున్నాను!

క. నాయనగా రుండఁగఁ జా
యాయుక్తుల మైన క్రొత్తఁ గమ్మలు మసలన్
దాయక యోముచునుండిన
యాయహములు మనకుఁ దమ్ముఁడా పోయెఁ గదా. ౧౨

అప్పుడు ఈ జానకియు —

మ. అలఁతుల్ పేటులు నైన పల్యూపకముల్ ప్రాంతోన్మిషన్మంజుకుం
తలముల్ ముగ్ధవిలోకముల్ వెలయు వక్త్రింబొప్ప బాల్యంబునన్
విలసజ్జ్యోత్స్నములై విలాసఖనులై పెన్లాలితీమాధురుల్
గల యల్పాంగములన్ మదంబలకుఁ దాఁ గావించెఁ గన్వేఁడుకన్. ౧౩

లక్ష్మ — ఇది మంథర.

రాము — [ఉత్తరము చెప్పక అవలం జూపుచు]

తే. దేవి, యీగారతపుపై దృష్టి యిడుము;
శృంగిబేరమ్మునను దీనిక్రిందఁ గాదె
మనకుఁ జేకూఱె భవ్యసమాగమంబు
నెయ్యుఁడైనట్టి బోయమన్నినితోడ. ౧౪

లక్ష్మ — [నవ్వి, స్వగతము] ఆహా! వదినియొక్క వృత్తాంతమును అన్నయ్య అణంచి వైచినాఁడు!

సీత — ఇది జడలుముడిచిన వృత్తాంతము.

లక్ష్మ —

తే. పుత్త్రులకు నిజలక్ష్మిని బూన్చి దేని
వృద్ధు లిక్ష్వాకువులు వరియించినారొ,
అన్న ధరియించె లేఁబ్రాయమందె దానిఁ
గరము కష్టము నారణ్యవ్రతంబు ౧౫

సీత — ఇది ప్రసన్న పుణ్యోదక భాగీరథీభగవతి.

రామ — రఘువంశదేవతా, నీకు నమస్కారము.

చ. సగరమఖాశ్వముం వెదక జల్లెడగా భువిఁ ద్రవ్వి కాపిల
ప్రగుణమహస్సుచే గినుకఁ భస్మితులం దనతాతతండ్రులం
అగణిత దేహపాతుఁ దనయంబు తపించి భగీరథుండు మున్
భగవతి నీజలంపుఁజలువం దివిఁ జేరిచె నెట్టకేలకున్. ౧౬

ఆతల్లీ, నీవు కోడలుసీతయందు అరుంధతియుంబోలె శివమును అనుధ్యానింతువు గాక.

లక్ష్మ — ఇది భరద్వాజులవారు తెలిపినవి చిత్రకూటమార్గమందు యమునా తీరంబున శ్యామ మను పేరి మఱ్ఱిచెట్టు. [రాముఁడు మక్కువతోఁ గాంచును.

సీత — ఆర్యపుత్త్రా, ఈ ప్రదేశమును స్మరింతువా?

రామ — ప్రేయసి, ఎట్లు మఱతును?

చ. చరణగతాధ్వఖేదమున జం పయి నల్గియు సుందరంబులై
పరిమృదితాబ్జనాళకనిభంబుగ వాడినయంగకంబులం,
విరియవిదట్టకౌఁగిళులఁ పేఁదురె సంవహనంబు గాఁగ, నా
యురమునఁ గూర్చి సుప్తిసుఖ మొందవె యిందుఁ బయోరుహాననా. ౧౭

లక్ష్మ — ఇదె వింధ్యారణ్యంపు మొగాశమున విరాధునితోడి పోరయిక.

సీత — ఇదెందులకు రే! ఆర్యపుత్త్రుఁడు తనచేత విసనకఱ్ఱను సాకుగాఁ బట్టి యెండను తొలఁగించిన నా దక్షిణారణ్య ప్రవేశారంభమును చూచెదను గాక.

రాము—

మ. తిలకింపన్ రుచిరంబు లీగిరినదీ తీరాశ్రమారణ్య భూ
ములు వైఖానసవాస వృక్షతలముల్; ముందంటి మిందుం గుటీ
నిలయుల్ శాంతులు నాతిథేయపరముల్ నీవారముష్ట్యోదనుల్
పొలుపొందన్ గృహమేధు; లౌనెమఱవన్ ముగ్ధాక్షి యూళావులన్? ౧౮

లక్ష్మ—ఇది జనస్థాన మధ్యంబున దట్టంపుఁ జెట్టుల పరంపరచే నిరులు గొనుచున్న నల్లని చెంగటియడవుల యొత్తడితోడి గోదావరి గుహాముఖంబుల మ్రోగించుచుండ అవారతము వృష్టిం గ్రక్కుచుండు మేఘములచే కడుంగాన్పించు చున్నది ప్రస్రవణనామపర్వతము.

రాము—

ఉ. ఆదినముల్ స్మరింతువె శుభాంగిరో యాగిరియందు లక్ష్మణుం
డాదట సేవ సేయఁగను హాయిగ నుండితి మేదినంబులన్;
గోదను కొండచెంత రసగుంభితసీమను సంస్మరింతువే?
పైదలిరో, స్మరింతె తదుపాంతములన్ మనవర్తనంబులన్? ౧౯

మఱియు,

ఉ. ఒక్కొక కేలఁ దన్మయత కోయనఁ గౌఁగిలి చిక్కఁ దిద్దుచున్
జెక్కును జెక్క నేర్పఁదని చేతికపెంపున మెల్లమెల్లగా
నొక్కక్రమంబుఁగల్గక యెవోయెవొ యాదటఁ బల్కికొన్రహిన్
గ్రక్కున యామముల్ మన పరాకునఁబోఁ దుదిముద్దొరాత్రియే. ౨౦

లక్ష్మ—ఇది పంచవటియందు శూర్పణఖ.

సీత—హా! ఆర్యపుత్త్రా! ఇంతకట్టే నీ దర్శనము!

రాము—ప్రియా, వియోగమునకు వెఱచెదవు! చిత్తరు విది.

సీత—ఏదైనను గానీ, దుర్జనము అసుఖమును కలిగించును.

రాము—అయ్యో! ఇప్పుడు జరుగుచున్నదివోలె నాకు జనస్థానవృత్తాంతము తోఁచుచున్నది!

లక్ష్మ—ఇఁక ను.

శా. అవృత్తం బిది, పైఁడిలేడిమిషచే నట్లాతియల్ రక్కసుల్
గావింపన్ దరికొల్పినట్టివెత సంశోషించినన్ బేర్చెదిన్;
తానే యార్యుఁడు వచ్చి శూన్యము జనస్థానంబుఁ గన్గొర్తికిన్
గ్రావంబుల్ నయితంబునేడ్చు మగరాగర్వంబుబున్ వ్రయ్యలౌ. ౨౧

సీత — [అశ్రువులతో, ఆత్మగతము] అహో! దినకరకులానందనుఁడు నా కారణంబున నింత పిల్లిదముగా తల్లడిల్లినాఁడు!

లక్ష్మ — [రాముని గాంచి, సాస్రము] అన్నయ్యా, ఏమియిది?

మ. ధర నీబాష్పచయంబు హా! తెగిన ముక్తాహారపుంజంబనన్
దొరలన్ ధారలుగాఁగ నుప్పిపడి బిందుల్ గాఁగడున్ ద్రయ్యెడుం;
బయ లూహింపఁగఁ దర్ప్రస్ఫుప్త హృదయాఘ్రాణంబు నాసాపుటా
ధరకంపంబున నీ వడంచినను నుద్దామంబు నావేగమున్. ౨౨

రాము — వత్సా,

తే. అపుడు ప్రియఁ బాయ నైన యాయార్తివహ్ని
యునుపె పగతీర్చుకొనునాస నోర్వ నయ్యె,
మరల నిపుడు విపక్వమై మనసు నేర్చు
వెండి సెలపాలు నెదగుట్టుఁ బుండువోలె. ౨౩

సీత — అయ్యయో అయ్యయో! మితిమీఱిన వియోగ దుఃఖముచేత ఇపుడు ఆర్యపుత్త్రశూన్య నై ఒంటిగా నున్నానని తోఁచుచున్నది.

లక్ష్మ — [స్వగతము] వేఱువిషయము జూపెదను. [చిత్రపువుం గాంచి, ప్రకాశము] ఇదిగో ఇటు మన్వంతర పురాణగృధ్రరాజు మహానుభావుఁడు నాయన జటాయుని చరిత్రపరాక్రమోదాహరణము.

సీత — హా నాయనా! నిర్వూఢము గావించితివి నీ యపత్యస్నేహమును.

రాము — హా నాయనా! కాశ్యపుఁడా, విహంగరాజా, నీవంటి మహాతీర్థము సాధువు ఇంకెక్కఁ డుండునా!

లక్ష్మ — ఇదె యెల్ల దనుకబంధనివాసము, జనస్థానమునకు పడమట కుంజవంతమను పేరి దండకారణ్యభాగము. ఇదిగో ఋశ్యమూకపర్వతమున మతంగముని యాశ్రమస్థానము. ఈమె శ్రమణయను సిద్ధశబరి. ఇది పంప యను పేరి యాపద్మాకరము.

సీత — ఇక్కడఁగదా ఆర్యపుత్త్రుఁడు అమర్ష ధైర్యములు మాని వాబిచ్చి బిగ్గర రోదనములు గావించెను?

రాము — ఈ సరస్సు రమణీయము. ఇందు,

చ. మదకలమల్లికాక్షములు మాటికి * తెక్కలఁ గొట్టి నెట్టుటన్
గదలుచు నూఁగుచున్న ఘననాళము లొప్పెడు పుండరీకముల్
వది వదులన్ బయల్పడు ద్రఖాభరితోత్పలషండ మందితా
స్పదములఁ గంటి బాష్పపరిపాత సముద్గమ నాంతరంబులన్. ౨౪

* చట్టుప

లక్ష్మ—ఈయన ఆ మహాత్ముఁడు హనుమంతుఁడు!

సీత—ఈయన చిరనిర్విణ్ణమైన జీవలోకమును సముద్ధరించిన మహోపకారి మహాభాగుఁడు మారుతి.

రాము—

తే. అహహ! యీమాన్యుఁ డల్లమహాభుజుండు
అంజనాదేవినోముల యరిదిపంట!
ఎవనివీరంబు మనకును భువనములకు
గోడు మున్నీరు దాఁటించు నోడ యయ్యె! ౨౪

సీత—వత్సా, పూచినకదంబములమీఁద నెమళ్లు తాండవించుచున్న యీ కొండ పేరేమి? ఇచట చెట్టుక్రింద అనుభావ సౌభాగ్య మాత్రావశిష్టమై ధూసరమైన శ్రీతోడి యార్యపుత్త్రుని మూర్ఛితుని నీవు పట్టుకొని వావిచ్చి యేడ్చుచున్నట్లు చిత్త్రరువు గానిపించుచున్నది.

లక్ష్మ—

ఉ. ఔ నిది మాల్యవత్కుధర మద్దనసౌరభవాహి యెంతయున్
దేవిశరీరమునుం బొదివె నీలము నిద్దము నైన క్రొమ్మొగుల్;
* [ దీనను నన్న—
రాము—
వీడు విడు దిట్టఁడఁ ] గాను వినంగ నే వికన్;
జానకితో వియోగ మది సంభవ మైనది వోలె వెండియున్! ౨౫

లక్ష్మ—ఇటుపైని అన్నయ్యవియు మహావీరులైన యీ వానర రాక్షసులవియు ఉత్తరోత్తరములు కర్మాద్భుతములు. మఱి వదినె అలసిపోయినది. కావున విశ్రమించుఁగాక యని విన్నవించెదను.

సీత—ఆర్యపుత్త్రా ఈ చిత్త్రరువుం జూడఁగా నాకొక కోరిక పొడము చున్నది, విన్నవించుకొనియెద.

రాము—ఆజ్ఞాపింపుము ప్రేయసీ.

సీత—మెండియు, ప్రసన్నగంభీరములైన వనవీథులయందు విహరింపను, భాగీరథీ దేవియందు పవిత్రశీతల జలంబుల నాడనుం గోరుచున్నాను.

రాము—వత్సా, గర్భదోహదము వెంటనే నెఱవేర్పవలసిన దని యిప్పుడే గురువులు సందేశము పంపినారు. కావున, కదుపు కలిగింపని తేరిని తెప్పింపుము.

---

* పాఠాంతరము—[రాము—మానుముమాను తమ్ముఁడ సమర్థుఁడఁ]

సీత—ఆర్యపుత్త్రా, మీరుగూడ రావలయును.

రాము—ఓ కఠిన హృదయురాలా, ఇదియుం జెప్పవలయునా?

సీత—అట్లయిన నాకు సంతోషము.

లక్ష్మ—అన్నగారి యాజ్ఞ నెఱవేర్చెదను. [అని నిష్క్రమించును.

రాము—ప్రేయసీ, ఈ కటికి చెంత కూర్చుందుము.

సీత—అట్లే చేసెద. బడలిక వలన నిద్ర నన్ను అపహరించుచున్నది.

రాము—అట్లయిన నన్ను ఎడయక పట్టుకొని వెంట రమ్ము.

తే. శ్రమథయస్వేద కణబంధురము భుజమ్ముఁ
జేర్పు నాకంధరమున సంజీవనముగ
ఐందవ మయూఖ చుంబిత స్యందమాన
చంద్రమణి హార విభ్రమశాలి నబల. ౨౮

[అట్లే చేయించి, ఆనందముతో] ప్రియా, ఇదేమి?

తే. సుఖమొ దుఃఖమొ మెలఁకువొ సుప్తియొక్కొ
విసము పర్వెడొ మదమొ భావింపరాక
నీవు తాఁకినమాత్ర నింద్రియవిమోహి
యొకవికృతి నామి చేతన నూఁపు నుడుపు. ౨౯

సీత—తమ ప్రసాదము స్థిరము. అంతికన్న మఱేమున్నది?

రాము—

ఆ. మ్లాన జీవిత ప్రసూన సంజీవులు
తృప్తిదములు మోహితేంద్రియములు
నీ సుభాషణములు నీరజాతేక్షణ,
శ్రవణసుధలు హృద్రసాయనములు.

సీత—ప్రియంవదుఁడా, పరుండెదను. [అని శయనింప కలయుం బరికించును.

రాము—ప్రియా, ఏమి వెదకెదవు?

తే. పెండ్లి సమయమునుండియు వీటఁ గాట
బాల్యమునయందుఁ బిదప జవ్వనమునందు
స్వాపకర మన్యచే ననుపాశ్రితంబు
అలవ యిదె రామభుజము తలాపి నీకు. ౩౦

సీత—[నిద్రను నటించుచు] ఆర్యపుత్త్రుఁడా, ఉన్నది యిది, ఉన్నది యిది.

రాము—ఏమి! ప్రియవచన వాయూరమందు క్షణములో నిద్ర చెందినది! [కాంచి, స్నేహముతో]

ఉ. ఈనకి లక్ష్మి గేహమున. ఈనకి కన్గవకుఁ సుధాంజనం,
ఈనకిమేనితాఁకుడు మెయిఁ బహుళం బగు చందనద్రవం,
ఈనకిబాహువల్లి యిద మీనెడుముత్తెసరంబు కంఠమం,
దీనకి దేదిగాదు ప్రియ? మేర్పును గాని యిదంవియోగమే. ౩౧

ప్రతీహారి—[ప్రవేశించి] దేవా, వచ్చెను.

రాము—ఆ! ఏమి వచ్చెను? ఎవరు?

ప్రతీ—ఏలినవారి యాసన్న పరిచారకుడు దుర్ముఖుఁడు!

రాము—[స్వగతము] అంతఃపురచారి దుర్ముఖుఁడు! వానిని నేను పౌరజానపదల్పై వేగుండి రమ్మని పంపితిని. [ప్రకాశము] రావచ్చును.

[ప్రతీహారి నిష్క్రమించును.

దుర్ముఖుఁడు—[ప్రవేశించి] [స్వగతము] హా! సీతాదేవిమీద యిటువంటి తలచరాని జనాపవాదాన్ని ఏలాగు దేవరవారికి విన్నపంచేతును? మతేమిగతి? ఈ నిర్భాగ్యుడికి ఇది కొలువుగదా.

సీత—[పలవరించును] హా! ఆర్యపుత్త్రుఁడా, ఎట నున్నావు? ఎట నున్నావు?

రాము—ఇదే అది దేవికి కంపన మెత్తించినట్టిది, చిత్రదర్శనము చేఁ గలిగిన విరహభావన, ఇప్పుడు కలలో భయముగొల్పుచున్నది.

[స్నేహముతో పరామర్శించుచు]

శా. ఏ దద్వైతము సౌఖ్య దుఃఖములయం, దెం దూఱడిల్లుఁ మనం
బే దౌ సర్వదశానుగామి, జర నెం దేరక్తి యిడఁ దింపదో,
ఏదో కాలము సాగ సాగఁ ద్రపపో నింపైన నెయ్యంపుఁబం
దా దాంపత్యపు భద్రసార మదియే యాశించు రెట్లేసియుఁ. ౩౨

దుర్ము—[సమీపించి] జయించు దేవా.

రాము—తెలిసినదానిని చెప్పుము.

దుర్ము—దేవరవారిని పౌరజానపదులు పొగడుచున్నారు. ఏలాగంటే— "రామదేవుడు మమ్మల్ని దశరథమహారాజుని మరిపించినాడు" అని.

రాము—ఇది స్తుతి. దోష మేదేని చెప్పుము, దానికి ప్రతివిధానము చేసెదను.

దుర్ము—[కన్నీళ్లతో] దేవర వినవలెను; [చెవిలో] ఇట్లు ఇట్లు.

రాము — అహాహా! అతి ఘోరముగా పడినది వచనదంభోళి!

దుర్ము — దేవరా, ఊఱడిల్లండి:

రాము — [ఊఱడిల్లి]

తే. అకట! సీతకు నొరునింటియంటునింద
యపు డెది శమించె నద్భుతోపాయములను,
వెండి యది యిప్డు హతవిధి విలసనమున
విస్తరిల్లిన దాలర్క విషమువోలె. ౩౩

రాము — మందభాగ్యుఁడ నిందుల కేమి చేయుదును! [విమర్శించుకొని సకరుణముగా] కాక మఱేమి?

క. ఏకార్యముచే నైనను
లోకారాధనమె సాధులోకవ్రత మౌ;
ఆకరణి నను నసుం విడ
నీకొని మాయయ్య దానినే కద నెఱపెన్. ౩౪

ఇప్పుడే గదా వసిష్ఠభగవంతులు సందేశించినారు. మఱియు:—

క. ఏ సాధు శుద్ధ చరితకు
నాసావిత్రనృపు లగ్ర్యు లాస్పదమొ· యటన్
నాసంబంధంబున సడి
దాపిన న న్నిప్పిరో! యధన్యునిఁ గాల్పన్! ౩౫

హా! దేవీ, యజ్ఞభూమి సంజాతా! హా! స్వజన్మానుగ్రహ పవిత్రిత విశ్వంభరా! హా! నిమిజనకవంశనందినీ! హా! పావకవసిష్ఠారుంధతీస్తుత శీలశాలిని! రామమయజీవితా! హా! మహారణ్యవాసప్రియసఖీ! హా! ప్రియమితభాషిణీ! ఏమి యిది! ఇట్టిదానికి నీకు ఇట్టి యీ పరిణామము!

తే. నీవలన నెల్లలోకముల్ పావనములు,
నీవలన జనతోక్తి యపావనంబు,
నీవలన దిక్కు గలయది నిఖిలజగము,
నీవు దిక్కెందు లేక డిందెదవె యకట! ౩౬

దుర్ముఖుఁడా, లక్ష్మణునితో చెప్పుము:—ఇదే నీ క్రొత్తరాజు రాముఁ డాజ్ఞాపించుచున్నాఁడు, [చెవిలో] ఇట్లు ఇట్లు.

దుర్ము—ఏమి! అగ్ని పరిశుద్ధురాలిని గర్భంలో పవిత్రరఘుకుల సంతానంగల దాన్ని దేవిని దుర్జనుల మాటచేత ఏలినవారు ఇప్పుడు ఇలాగ చేయదలచినారు!

రాము—అట్లనకు, పాపము శమించును గాక; పౌరజానపదులు దుర్జనులె ట్లగుదురు? చూడు.

తే. లోకులకు మానవీయ మిక్ష్వాకుకులము,
విందకుఁ గతంబు విధిచేఁత నందుఁ గల్గె;
శుద్ధికాలంపు టమృతసూక్తనమును
విశ్వసించు నెవండు దపిష్ఠవర్తి! ౩౭

కావున, నీవు పొమ్ము.

దుర్ము—హా! దేవీ! [అని నిష్క్రమించును.

రాము—హా! కష్టా! అతి బీభత్సకర్ముఁడను క్రూరుఁడ నైతిని. ఎట్లన—

తే. పిన్నతనమునుండి పెంచిన ప్రియను దీనిఁ
గూర్మిచే మేలు తలఁపును గొనవిదాని
మృత్యువున కిచ్చుచున్నాఁడ మిషను నెఱపి
గృహశకుంతిక నల సూనరియును బోలె. ౩౮

కావున, అస్పృశ్యుఁడను పాతకిని ఏల దేవిని మైల చేయుదును? [సీత శిరముసు స్వయముగా ఎత్తి బాహువును లాగికొనుచు,]

క. నేరనిమగుదా! విడు మవి
దారుణముగ, నిష్కృపకర్మచండాలు ననుఁ;
చేరితివి చందనం బవి
ఘోరవిపాకమును గాలకూటద్రుమమునఁ! ౩౯

అయ్యో! తలక్రిందైనది యిప్పుడు నాకు జీవలోకము! ముగిసిపోయినది రామునికి జీవిత ప్రయోజనము! ఇట్టి వల్లకాడు ఇప్పుడు జగత్తు! నిస్సారము సంసారము! కష్టప్రాయము శరీరము! కాకేమి?

ఆ. గోడు గుడుపుకొలకె కూర్చెఁ జైతన్యంబు
రాముమేనఁ దామరసభవుండు;
విలువరించి మర్మముల వ్రక్కలించుచుఁ
గూళయుసురు వజ్రకీల మయ్యె. ౪౦

హా! అమ్మా అరుంధతీ! హా! భగవంతులారా వసిష్ఠ విశ్వామిత్రులారా! హా! దేవీ భూతధాత్రీ! హా మామా జనకుఁడా! హా నాయనా! హా తల్లులారా! హా పరమోపకారీ లంకాపతీ విభీషణుఁడా, హా ప్రియసఖుఁడా సుగ్రీవుఁడా! హా సౌమ్యుఁడా ఆంజనేయుఁడా! హా సఖీ త్రిజటా! కొల్లబోయితిరి. అవమానితులైతిరి రామపాతకునిచేత! అట్లు గాదేని, వారిం బేర్కొన నే నెవఁడ నిప్పుడు!

ఆ. అట్లనంగ నేల యన, దురాత్ముండను
జేసినట్టిమేలు చెఱచువాఁడ
నేను పేరుకొనుటయే యామహాత్ముల
నఘము సోఁకు టంచు నాత్మఁ దలఁతు. ౪౧

ఎట్టివాఁడను నేను!

తే. ఎదను విశ్వాసమున వ్రాలి నిదురఁ గూరి
వెఱ నదరు నెఱగర్భంపు వ్రేఁగుదానిఁ
బ్రియగృహిణి గృహలక్ష్మిని గృప దొరంగి
బలిగఁ బిశితాశులకుఁ బాఱవైచినాఁడ. ౪౨

(సీతపాదములను శిరమున నుంచుకొని) దేవి, ఇది రామునిశిరముతో నీ పాదపంకజములకు కడసారి తాఁకుడు. [ఏడ్చును.

[నేపథ్యమున]

అబ్రహ్మణ్య మబ్రహ్మణ్యము!

రాము—ఎవరక్కడ? ఇదేమో తెలిసికొమ్ము.

[పెండియు నేపథ్యమున]

క. యమునాతీరమహర్షులు
తమి నుగ్రవ్రతులు విన్నుఁ దలఁచి శరణ్యుఁగా
గుమి యై కూ యిడెదరు లవ
ణమహాసురుఁ డిడెడు యాతనలఁ బడలేమిన్. ౪౩

రాము—ఇప్పుడును రాక్షసబాధయా! ఇదె ఈ దురాత్ముని కుంభీనసీపుత్త్రుని తెగటార్పు మని శత్రుఘ్నునిఁ బంపెదను. [కొన్ని యడుగులు నడిచి, మరల వెనుకకు వచ్చి] హా దేవి! ఏమగుదువో! భగవతి వసుంధరా,

తే. జనకరఘుగోత్రకృత్స్నశోభనము నెవతెఁ
బుణ్యశీలను జన్నంపుఁ బుణ్య సీత

నీవ కంటివా యాసాధ్వి నీదుపట్టి
సీత రక్షింపు మప్పగించితివి నీకు. ౪౪

[అని నిష్క్రమించును.

సీత — హా సౌమ్యుఁడా ఆర్యపుత్త్రుఁడా, ఎక్కడ నున్నావు? [తటాలున లేచి] అయ్యయ్యో! దుస్స్వప్నముచేత వంచితనై నేను ఆర్యపుత్త్రుఁడు లేని దానినిగా నన్నుఁ దలఁచుకొంటిని. [చూచి] అయ్యయో! అయ్యయో! నన్ను నిద్రితను ఒంటిగా విడిచి ఆర్యపుత్త్రుఁడు పోయినాఁడు! కానీ, ఆయనం గన్నప్పుడు నేను నావశమున లేని ఆయనపై కోపించెదను. ఎవ రక్కడ పరిజనుఁడు?

దుర్ము — [ప్రవేశించి] దేవి, లక్ష్మణకుమారుడు విన్నపం చేస్తున్నాఁడు. "తేరు సిద్ధముగా నున్నది. దేవిగారు ఎక్కుదురుగాక" అని.

సీత — ఇదె ఎక్కుచున్నాను. [అని లేచి పరిక్రమించి] అదరుచున్నదే నా గర్భభారము! కావున మెల్లఁగా నడవుము.

దుర్ము — ఇటు ఇటు దేవి.

సీత — నమస్కారము రఘుకుల దేవతలకు.

[అని అందఱు నిష్క్రమింతురు.

చిత్రదర్శన మనెడి ప్రథమాంకము
ముగిసినది

---

## విష్కంభము

[నేపథ్యమున]

తపోధనురాలికి స్వాగతము

[అర్ఘ్యగతమ] తాపసి — [ప్రవేశించి] అహో వనదేవత యీమె ఫలపుష్పపల్లవార్ఘ్యములతో నన్ను సేవించుచున్నది!

వనదేవత — [ప్రవేశించి, అర్ఘ్యము చల్లి]

ఉ. ఈవని మీకు భోగ్యము యథేచ్ఛముగా, సుదినంబు నాకు నేఁ,
డీవహి సాధుసంగతికి నెంతటిపుణ్యమొ చేసికొంటి మున్;
మీవశ మిందు వృక్షములనీడలు నీళ్లుఁ దపోర్హభోజనం
బేవా, ఫలంబొ, వేరొ, యవి యెల్లను; జెల్లు వచింపనేటికిన్? ౧

తాపసి — ఇందు చెప్పవలసిన దేమున్నది?

చ. చెలఁగుఁ బ్రియంకరంబె యయి చేఁత, వచస్సు పునీతిమంజువై,
తలఁచిన దెల్ల భవ్యమ, యుదస్తవిగర్హము సంస్తవంబునుం,
గలఁగక క్రొత్తలోఁ దివపుఁ గ్రాలు రసం బొకటే విధంబుగా,
వెలయు నిసర్గశుద్ధ మతివిశ్వము సాధురహస్య మెప్పుడుం. ౨

[ఇరువురుం గూర్చుందురు.

వస—మహనీయను నిన్ను ఎవరినింగా తెలిసికొందును?

తాప—నేను ఆత్రేయిని.

వస—అమ్మా ఆత్రేయీ, ఎటనుండి యిటకు రాక? మఱి ఈ దండకారణ్య ప్రచారము ఎందు నిమిత్తము?

ఆత్రేయి—

తే. ఈ ప్రదేశంబునం దగస్త్యప్రముఖులు
పలువు రుద్గీథవేదులు ప్రతివసింత్రు
పిరిపలనను నిగమాంతవిద్య నేర్వ
వచ్చితి నిటకు వాల్మీకివసతినుండి. ౩

వస—ఇతరమునులుకూడ ఆయనచే ప్రాచేతసుని పురాణబ్రహ్మవాదిని ఋషిని బ్రహ్మపారాయణమునకై శుశ్రూషించుచుండఁగా, అమ్మగారేల యీ చిరప్రవాస క్లేశమునకు పాలుపడుచున్నారు?

ఆత్రేయి—అచ్చట అధ్యయనమునకు గొప్పవిఘ్నము కలిగినందున ఈ దీర్ఘప్రవాసము నంగీకరించితిని.

వస—ఎట్టి దావిఘ్నము?

ఆత్రేయి—ఆ భగవంతునికి ఎవరో దేవత ఎల్లవిధములను అద్భుతమైన బాలక ద్వయమును స్తన్యము విడిచినమాత్రపు వయస్సుదానిని తెచ్చి యిచ్చినది. అది ఋషుల మాత్రమేగాక సకల చరాచర భూతములయొక్క అంతస్సత్త్వములందు స్నేహము కొల్పుచున్నది.

వస—వారి నామధేయములు ఎఱుకయా?

ఆత్రేయి—ఆదేవతయే వారికి కుశ లవు లని పేరు చెప్పి వారి ప్రభావమును గూడ చెప్పినది.

వస—ఎట్టి దాప్రభావము?

ఆత్రేయి—వారికి సరహస్యములు జృంభకాస్త్రములు జన్మసిద్ధములు అని.

వస—ఆహా! ఏమి చిత్రము!

ఆత్రేయి—వారిని వాల్మీకి భగవంతుఁడు దాదిపని మొదలుకొని తానే పూనుకొని పెంచినాఁడు, రక్షించినాఁడు; చూడాకర్మయు గావించి వేదము దక్క కడను విద్యలను సావధానముగా చదివించినాఁడు; తర్వాత గర్భైకాదశ వర్షంబున క్షాత్త్రకల్పంబున వేదములను నేర్పినాఁడు; అతిప్రదీప్తప్రజ్ఞా మేధాశాలు లగు నా బాలురతో మా బోంట్లకు సహాధ్యయన యోగ్యత లేదు. ఏలన.—

చ. ఒసఁగును విద్యఁ బ్రాజ్ఞునకు నోగునకుం గురుఁ డొక్కరీతినే;
ఒసఁగఁడ తాను మానుపఁడ యొక్కనికేనియు నేర్పు నేరుపుం.
పొసఁగును దెల్వి నిర్వురకు భూరివిభేద; మ దె ట్లటన్నచోఁ,
బొసఁగును బింబ మచ్ఛమణిఁ, బొందదు మృణ్మయ సంచయంబునన్. ౪

వన—ఇదా ఆ యధ్యయనాంతరాయము?

ఆత్రేయి—ఇంక నొకటి కలదు.

వన—అ దేది?

ఆత్రేయి—అనంతరము, ఆ బ్రహ్మర్షి ఒకప్పుడు మధ్యాహ్న సమయమున తమసానదికిం బోయెను. అచట కలయికలో నున్న క్రౌంచదంపతులలో ఒకదానిని వేయుచుండిన వేఁటరిని గాంచినవాఁడై ఆకస్మికముగా స్ఫురించిన వాగ్దేవిని అసంకీర్ణను అనుష్టుప్ఛందస్సులో నున్నదాని ఇట్లు ఉచ్చరించెను:—

"ఓనిషాద, ప్రతిష్ఠ న్నీ। వొందుదే శాశ్వతాబ్దముల్
కామ మోహిత మేకంబుం। గ్రౌంచయుగ్మానఁ జంపుటన్?" ౫

వన—చిత్రము! వేదముకంటె వేఱుగా క్రొత్తది ఛందస్సుల యవతారము!

ఆత్రేయి—మఱి యా సమయముననే అట్లు శబ్దబ్రహ్మావిర్భావనముం బొందిన యా భగవంతుని ఋషిని భూతభావనుఁడైన బ్రహ్మదేవుఁడు ఎదుటఁ దోఁచి ఇట్లు హెచ్చరించెను: "ఋషీ, వాగ్బ్రహ్మమందు ఎఱుకగలవాఁడ వైతివి. కావున, రామచరితమును వర్ణింపుము. నీ ప్రతిభా చక్షుస్సు ఆర్షమును అవ్యాహతజ్యోతి యగును. మొదలికవి వైతివి.' అట్లు వచించి అంతర్ధానము పొందెను. అనంతరము భగవంతుఁడు ప్రాచేతసమహర్షి మనుష్యులయందు మొదటిదైన యట్టి యా శబ్దబ్రహ్మ పరిణామమును రామాయణమును రచించెను.

వన—ఆహా! సంసారము పొందికీ మండిత మయినది!

ఆత్రే—అందువలనం బలికితిని అధ్యయనమునకు గొప్ప విఘ్నము వచ్చినదని.

వన—సరిగానే యున్నది.

ఆత్రేయి — కల్యాణీ, ఆహారము తీఱినది. ఇప్పుడు అగస్త్యాశ్రమమునకు దారి చెప్పుము.

వన — ఇటనుండి పంచవటి వెంబడి యీగోదావరీతటమునం బొమ్ము.

ఆత్రేయి — [బాష్పములతో] ఇది యాతపోవనమా? పంచవటియా యిది. ఇది ఆ ప్రస్రవణ పర్వతమా? జనస్థానదేవతయైన వాసంతివా నీవు?

వాసంతి — సర్వమును అట్లే

ఆత్రేయి — వత్సే జానకీ!

తే. సకియ, యిదె నీదు ప్రియబంధుసమితి; దీని
ముచ్చటలె మా కిపుడు పుచ్చు మొదలికథలు;
నామశేషను నిను నిది నాకుఁ దోఁచి
యిపు పౌనర్నిస ప్రత్యక్షదృశ్యఁ బోలె. ౬

వాసంతి — [భయముతో స్వగతము] ఏమి! నామశేష యున్నదే! [ప్రకాశము] ఆర్యా, ఏమి మహాపద సీతాదేవికి?

ఆత్రేయి — మహాపదయే గాదు, అపవాదము కూడ. (చెవిలో) ఇట్లు ఇట్లు.

వాసంతి — అహహా! దారుణమయిన దైవనిర్ఘాతము. [మూర్ఛిల్లును.]

ఆత్రేయి — కల్యాణీ, ఊఱడిల్లు మూఱడిల్లుము.

వాసంతి — హా! ప్రియసఖీ, మహాభాగురాలా! నీ జన్మభాగ్యము ఇట్టిదా! రామభద్రా, రామభద్రా! ఇఁక నీతో నేమి? అమ్మా. ఆత్రేయీ ఆనాటినుండి విడిచి లక్ష్మణుఁడు పోయిన తర్వాత సీతాదేవి వృత్తాంతము ఏమో తెలియునా?

ఆత్రేయి — తెలియదు, తెలియదు.

వాసంతి — కట్టా! అరుంధతీవసిష్ఠులు విచారించుకొనుచున్న రఘుకుటుంబమందు వృద్ధలు రాణులు జీవించియుండఁగా ఇట్టిది యెట్లు సంభవించినది?

ఆత్రేయి — అప్పుడు గురుజనులు ఋష్యశృంగాశ్రమములో నుండిరి. ఇప్పుడు ఆ పండ్రెండేండ్ల యజ్ఞము ముగిసినది. ఋష్యశృంగుఁడు గురుజనము పూజించి అంపకము గావించినాఁడు, అంతట అరుంధతీభగవతి 'కోడలు లేని యయోధ్యకు నేను పోను' అని వచించినది. రాముని తల్లులును అట్లే నిశ్చయించుకొనిరి. అందులకు అనుగుణముగానే వసిష్ఠభగవానులు ఇట్లు అతిపరిశుద్ధముగా పలికిరి:—ఎట్లన— "వాల్మీకి తపోవనమునకుం బోయి అట వసింతము," అని.

వాసంతి — మఱి యిప్పుడు ఆ రాజు ఏమాచరించుచున్నాఁడు.

ఆత్రేయి — ఆయన అశ్వమేధయాగమును తొడంగినాఁడు.

వాసంతి—అయ్యో, పెండ్లి కూడ చేసికొన్నాఁడా?

ఆత్రేయి—శాంతము! శాంతము! లేదు లేదు.

వాసంతి—అటయిన యజ్ఞములో ఆయనకు సహధర్మచారిణి యెవరు?

ఆత్రేయి—బంగారపు సీతాప్రతిమ.

వాసంతి—ఆహాహా!

క. వజ్రమునకన్నఁ గఠినములు,
విరిసిన్నను గోమలములు, విశ్వాతిగు లౌ
పురుషవరేణ్యుల మనములు:
తర మెవ్వరి కౌను వారితత్త్వము దెలియఁగా! •

ఆత్రేయి—వామదేవాభిమంత్రితమగు మేధ్యాశ్వమును విడిచినారు. యథాశాస్త్రముగా దానికి రక్షకులను నియమించినారు. వారికి నాయకునిగా లక్ష్మణపుత్త్రుని దివ్యాస్త్రసంప్రదాయముం బొందినవానిని చంద్రకేతుని గుఱ్ఱపుదండిచ్చిపంపినారు.

వాసంతి—[స్నేహాశ్రుపాతములతో] ఆహా! కుమారలక్ష్మణునికిం గూడ కుమారుఁడా! అమ్మా! బ్రతికితిని!

ఆత్రేయి—ఇంతలో బ్రాహ్మణుఁ డొకఁడు పుత్త్రుని మృతుని రాజద్వారమందు తెచ్చిపెట్టి [illegible] ఉద్ఘోషించినాఁడు. అంతట "రాజాపచారము లేక ప్రజలకుం దకాలమరణము సంభవింప" దని కరుణామయుఁడు రామభద్రుఁడు తనపైనే దోషము మోపుకొనఁగా, తటాలున అశరీరవాక్కు ఇట్లు వినఁబడినది.—

"తపము సేయుచున్నాఁడు ధరణియందు
పేరఁ శంబూకుఁ డనుపేరి వృషలుఁ డొకఁడు.
వానిఁ దల ద్రెంపఁగా నీకు వలయు రామ;
మన్నిగాని వాని మనుపు బ్రాహ్మణుని పేఁగ." ఠా

ఈవాక్కును విని జగత్పతి ఖడ్గపాణియై పుష్పకవిమానము నెక్కి ఎల్ల దిక్కులను ఎల్లవిదిక్కులను శూద్రతాపసుని కనిపట్టుటకై చరింపఁదొడంగినాఁడు.

వాసంతి—శంబూకుఁ డనువాఁడు ధూమపాయి, ఇందే జనస్థానమునందే తపస్సు చేయుచున్నాఁడు. కావున శ్రీరాముఁడు వెండియు నీవనము నలంకరించునా?

ఆత్రేయి—కల్యాణీ, పోయెద నిపుడు.

వాసంతి—అట్లే చేయుము. పగలు ముదిరినది. కావున నే,

సీ. వెట్టచేఁ దొడిమలవట్టు విరుపుఁ జెంద
ద్విరదముల్ చెక్కులం దురద వోవ
నొరయుడు రాలు పూళరములఁ దటతరుల్
గోదను బూజించు కొమరుగమము;
వానిపైఁ గూండ్లకు వచ్చి పావురములు
నడవికోళ్ళను నెండ బడలికలకు
శాంతిమైఁ గుదిరి విశ్రాంతి సేవించుచుఁ
గూసెడి హుంకారగుంభనముగ.
తే. క్రింద పీడను ధరఁ గెక్కరించుచున్న
పులుఁగు లాచెట్ల బెరడుల బిలములందుఁ
గాఁక కిట్టటులౌ కీటకములఁ దమదు
కూచిముక్కులతో పీద్చుకొనుటఁ గనవె. ౯

[ఇరువురు నిష్క్రమింతురు.

శుద్ధవిష్కంభము ముగిసినది

# ద్వితీయాంకము

[అంతట రామభద్రుఁడు సదయోద్యతఖడ్గుఁడు ప్రవేశించును]

రాముఁడు___

తే. కుడికరమ, శూద్రమునిమీఁద విడు కృపాణి
విప్రబాలుఁడు మృతుఁడు జీవించుకొఱకు.
కరుణ నీకేడ దుర్భరగర్భఖిన్న
సీతఁ దఱిమిన రాముని గాత్రమునకు? ౧

[ఎట్టకేలకుఁ గొట్టి] రామసదృశ మైనకర్మం గావించితిని. అబ్రాహ్మణపుత్త్రుఁడు బ్రదుకును గాక,

దివ్యపురుషుఁడు___[ప్రవేశించి] జయము జయము దేవరకు.

ఉ. నీవు కృతాంతుమండియును నిర్భయ మిచ్చి ధరింప దండముం,
జీవన మొందె నీ శిశువు, చెందితి నిట్టి శుభంబు నేమనుం.

దేవర, శంబుకుండను ద్వదీయపదంబుల మ్రోలఁ జేర్చెదన్;
కావులు గూడ సాధుజన సంగభవంబులు తారకంబు లౌ. ౨

రాము — రెండును మాకు ప్రియములు. మఱి యనుభవింపుము ఉగ్రమయిన తలంపు ఫలము.

తే. ఎందు మోదంబు లెసఁగు, నానందము లగు,
నెందు దివ్యంపు సంపద లింపుమీఱు,
తైజసములు వైరాజాభిధానకములు
నయిన లోకంబులు ధ్రువంబు లగుత నీకు. ౩

శంబూకుఁడు — ఈ మహిమ మీ ప్రసాదమునకు ఫలముగాని తపస్సునకుఁ గాదు. అయిన నట్లనఁ గూడదు, తపస్సు నాకు మహోపకారముం గావించినది.

చ. వెదకుదు రెల్లవారలు భువిన్ నిను భూతపతిన్ శరణ్యునిన్;
వెదకుచు నన్ను దుర్వృషలు నీ వరుదెంచితి నూఱు లామడల్!
ఇదియె తవః ప్రసాదము మహిష్ఠము: కాక యయోధ్యనుండియున్,
బద మిడు దేల వెండియును భానుకులాగ్రణి, దండకాటవిన్? ౪

రాము — ఏమి దండకారణ్యమా ఇది? [కలయం దిలకించి]

ఉ. శ్యామస్నిగ్ధము లొక్కచో, నొకట భీష్మాభోగితా రూక్షముల్,
వ్యామూర్చ్ఛజ్ఝరపాతఘోషిత కకుప్చక్రాంక తత్తత్స్థలుల్
భూమీ ధ్రాత్రమతీర్థ శైవలవతీ భూయిష్ఠ కాంతారముల్
నాశ్రమాలం బొదలెంచె జ్ఞాతచర నానాదండకాభాగముల్. ౫

శంబూ — దండకయే యిది. ఇచటఁగదా పూర్వము నివసించుచున్న దేవర చేత

క. దురమున నొక్కుమ్మడి ద్రుం
దిరి కరకరిరక్కసులు పదియు నాలుగువేల్,
ఖర దూషణ త్రిశిరసులు
న్వరు విభ శరహతులఁ బడిరి శమనునివాతన్. ౬

అందువలనఁగదా, సిద్ధక్షేత్ర మయిన జనస్థానమున మముబోఁటి భీరుజనులకుం గూడ నిర్భయ సంచారము కలిగినది,

సీ. విష్కాఱితంబులై నిభృతమై యున్నవి
యీసీమ లొకకొన్ని యెడలయందు,
సత్త్వంబు లలియు నుచ్చండఘోషములతోడ
మూర్ఛిల్లుచున్నవి కొన్నిచోట్ల,
స్వైరనిద్రిత మహాస్ఫుట భుజంగశ్వాస
దీప్తాగ్ను లొకకొన్ని దిక్కులందు,
లోఁతుఁబగుళులందు బ్రాఁతు సౌనల్పాంబు
వుల మిన్కుచున్న వీకలఁకులంపి,

తే. తొండ లిచ్చోట దప్పిచే బెండువాఱి
త్రాగుచున్నవి యాజగఱంపుఁ జెమట
క్షణవినోదంబు గాఁ గటాక్షంబు సేయ
నవధరింపుము చిత్తంబునంపి దేవ. ౭

రాము—

తే. కాన నగుచున్నయది జనస్థాన మిదిగో
మున్ను ఖరరాక్షసుండు కాఁపున్నచెంత
అనుభవం బగుచున్నవి యల్లనాఁటి
యఖిల వృత్తాంతములను బ్రత్యక్ష భంగి. ౮

వైదేహి ఎంతయు ఆరామప్రియ గదా. ఇవి ఘోరకాంతారములే. అంతకన్న నాకు భయావహ మేమున్నది? [సబాష్పము]

క. దేవియతావి గుబుల్కొను
కానల నీతోడ నుందుఁ గాఁపుర మనుచున్
దాను విహరించె జానకి,
హా! నెయ్యం బట్టి దౌర యబలకు నాపై! ౯

క. ఏది యెవనికిఁ బ్రియజన మగు
నది యేమో వింతద్రవ్య మగు నాతనికిన్;
అది తా నేమియుఁ జేయక
విదల్చు దుఃఖముల సౌఖ్యవితతులచేతన్, ౧౦

శంబూ — చూడరానివి యివి చిత్తగింపఁ దగినవి కావు. ఇటుపైని ఇవి మధ్యమారణ్యములు, మదోత్కట నీలకంఠ కంఠ కోమల కాంతి కాంతంబులగు పర్వతనులచే వ్యాప్తములు, బహుళ నీలదీప్తులతో దట్టముగా నట్టుకొన్న శీత చెట్ల గుబురులచే నలంకృతములు, బెద రొందని పెక్కు తెగల జింకకదుపులచే శోభితములు, ప్రశాంత గంభీరములు.

(మాలిని)

కలిత మదవిహంగాక్రాంత వానీర పుష్ప
న్మిళిత సురభి గద్యామేయ తోయంబు లిందుఁ,
ఫలభర పరిణామ శ్యామజా గ్జంబుకుంజ
స్ఖలన ముఖర ఘోరోఘంబు వేణుల్ వహించుఁ. ౧౧

మఱియు, —

ఉ. ఈ కుహరంబులందు వసియించెడి యెల్గు యువల్ రచించు నం
బూత్కృతముల్ విస్ఫూర్తిఁ బ్రతిమ్రోఁతలచేఁ గనుచున్న వింధ్యలన్;
ఓగానుచున్న దేన్గులు మథించిన యందుగుగ్రంథు లోద్భవ ను
త్సేకపు సౌరభంబు కటుశీతకషాయ మనోహరం బిటన్. ౧౨

రాము — [బాష్పముల నడంచుకొని] భద్రుఁడా, నీ దారులు శుభము లగుఁగాక. దేవయానమున పుణ్యలోకములకుం బొమ్ము,

శంబూ — ముందుగా పురాతన బ్రహ్మవాదిని అగస్త్యర్షిని అభివాదించి శాశ్వత పదమునకుం బోయెద. [నిష్క్రమించును.

రాము —

తే. కంటి వెండియు నిప్పు దాకాననంబు,
నెందుఁ జిరము వసించితి మేము మున్ను,
గృహుల మారణ్యకులము నై విహితధర్మ
రతిని సాంసారిక సుఖైక రస మెఱుఁగుచు. ౧౩

తే. ఆ శిఖరు లివె శిఖి విరావాకులములు,
అవనము లివె యున్మద హరిణకములు,
మంజు వంజులకుంజ ధామములు సాంద్ర
నీప నిచుళంబు లివె యా ధునీతటములు. ౧౪

క. ఈ దవ్వున పైతము దాఁ
గాదంబినివోలె నేది కనఁబడు నదియే
కాదోటు ప్రస్రవణగిరి,
గోదావరి దేనివద్ద మూర్ఛిలు చుండుఁ ? ౧౫

ఉ. దీని మహాశిఖంబ సమధిష్ఠిత మాన్యజటాయు గూఁటిచే,
దానికిఁ గ్రింద నయ్యుటజధామములన్ వసి యుంటి మేమునున్,
ఆ వికటాన గోదయుఁ దదర్పితబింబము శ్యామభూరుహ
శ్రీ వినద త్పతత్త్రి ముఖరీకృత మావనమున్ విరాజిలున్. ౧౬

ఇచటనే ఆ పంచవటి; చిర నివాసముచేత మా వివిధ విస్రంభాలి ప్రసంగములకు ఈ ప్రదేశములు సాక్షులుగా నుండినవి. ప్రేయసీ ప్రియసఖి వాసంతియు నిటనే నివసించుచున్నది. హా ఏమి సంభవించిన దిపుడు రామహతకునికి? ఏ మన నిపుడు.—

తే. చిరమునకు రేఁగి నొంచు పెద్దిలము వోలె
ఘాతచేఁ గదలిన ముల్కి కణిక వోలె,
గ్రంథియై పెలవడిన హృద్వ్రణము వోలెఁ
దట్ట వెత నన్ను నవము నా దరికొలిపెడు. ౧౭

అయినను పూర్వమిత్రములైన యీ భూప్రదేశములను గాంచెదను. [గాంచి] అహో భూమి సన్నివేశము నిలుకడ లేనిది:—

తే. పాఱుదల లంక మార్పడె నేఱులందు,
విరళతయు సాంద్రతయు మాఱె విటపులందు,
తరవునకుఁ గన్న కాన నూత్నముగఁ దోఁచె,
అచలముల గుర్తు నమ్మించె నదె యి దంచు. ౧౮

అయ్యో! నేను విడవాడి యేఁగుచున్నను నన్నిటను పంచవటీ స్నేహము బలిమి మెయి లాగుచున్నది! (సకరుణము)

ఉ. ఎక్కడ వింటఁబోలెఁ బ్రియ యేను దినంబులు పుచ్చినారమో;
యెక్కడి తక్కథాకథన మే సతతంబును సాగుచుండునో,
ఒక్కరుఁ దిష్ట ప్రాణసఖి నుజ్జనచేసిన రామపాపి యా
యిక్కను దేవిఁ బంచవటి నెట్లు కనున్ గన కెట్టు లేఁగెదున్! ౧౯

శంబూ—[ప్రవేశించి] జయము దేవరకు. దేవా, అగస్త్యభగవంతులు మీరిట నుండుటను వారలన నెఱింగి మీకిట్లు సందేశించినారు:—"విమానమునుండి దిగు నప్పటి మంగళ సంవిధానమును సిద్ధము చేసికొని వత్సల లోపాముద్ర ఎల్ల మహర్షులతోను ని న్నెదురుసూచుచున్నది. కావున వచ్చి మమ్ము సంభావింపుము. తర్వాత పుష్పకంబున త్వరగా స్వదేశము చేరి అశ్వమేధమునకు సన్నద్ధుఁడవు కాఁగలవు." అని.

రాము—భగవంతుఁ డాజ్ఞాపించినట్లు.

శంబూ—అటయిన దేవర పుష్పకమును ఇటు తరలింపఁగలయు.

రాము—భగవతీ పంచవటీ, గురుజనానుసారము వలసిది గావున రాముని యీ యతిక్రమమును క్షణమాసేపు క్షమింపుము.

శంబూ—దేవా! చూడు చూడు.

సీ. గుంజ న్నికుంజంపు గుడిసెలకాఁపు లౌ
గూబ పిండుల ఘనమూత్కృతుల
బెరపిన బొంగువెదురుల నాదములకుఁ
గాకిసంఘములు మూకత వహింపఁ,
బ్రచరించుచున్నట్టి బర్హిణంబులు వెట్టు
కేకారవంబుల దాక కులికి
ముదుక రోహిణ భూజముల బోదియలయందు
నెదిగెడి యురగంబు లదరిపడఁగఁ,

ఆ. గనఁగ గనఁగఁ గనవె కన్దోయి లాగెడు
రమణమీఱు పీఠరాధరంబు;
కనుము దేవ, దీనిఁ గ్రౌంచావతంబు నీ
దివ్యదృష్టి నెనపి తీర్థ మగుత. ౨౦

మఱియు—

సీ. గోదావరీవారి గుహలలోనికిఁ దూఱి
గద్గదరవముతోఁ గదలుకొనఁగ,
వాఁకల యంబుద మందనంబులచేత
శిఖరముల్ నీలిమఁ జెంది మెఱయ,

క్రోలఁ బోఁచెదు నివి మున్ను దేవ! గన్న
దక్షిణ వారుణీప్రముఖ సూవె;
ఒక యేటితరఁగ లొండొక యేటితరఁగలఁ
బ్రతిఘాత మొనరించి ప్రతిభయముగఁ
తే. బ్రబలి కోలాహలంబుతోఁ బాఱుచెంచు
నివియు దేవ! మున్నుగన్నవియ; వీని
సమవలోకింపుమీ నదీసంగమములఁ
బావనంబుల గంభీర జీవనముల. ౨౧

[అని నిష్క్రమింతురు.

ద్వితీయాంకము ముగిసినది

---

విష్కంభకము

[అంతట తమసా మురళ అనెడి నదీద్వయము ప్రవేశించుచు]

తమస — సఖీ, మురళా, ఏమి సంభ్రాంతురాలవుగా నగపడుచున్నావు?

మురళ — భగవతీ, తమసా, నన్ను అగస్త్యభగవానులవారి యిల్లాలు లోపాముద్ర నదీమతల్లికను గోదావరిని ఇట్లు హెచ్చరింపుమని పంపినది — "ఎఱుఁగుదువు గదా వధువును విడనాడినది మొదలుగా. —

తే. వెలికిఁ బ్రిమిలము గాంభీర్య వృత్తికతన,
గూఢముగ లోన చెదవెట్టు రూఢగరిమఁ,
బుటమునం బాకిముంబొందుదిటము దోఁప
నెరియుచున్నది రాముని కరుణ రసము! ౧

దానం జేసి అట్టి ప్రేయసీ కష్ట వినిపాతోద్భవమై పెంపుమీఱి యున్న దీర్ఘ శోక పరంపరచేత శ్రీరాముఁడు కడుం గృశించి యున్నాఁడు. అతని ం జూడ నాగుండె గ్రక్కదలిన ట్లున్నది. మఱి ఇప్పుడు మరలి యేఁగునాఁడు రామభద్రుఁడు పంచవటీవనమందు ప్రియతోడి సహవాస విస్రంభములకు సాక్షులైన ప్రదేశములను దర్శింపక మానఁడు. వానివలనం గు స్వభావముచేత నాతఁడు ఎంత ధీరుఁడైనను ఇట్టి యీ యవస్థయందు శోకము క్షోభ మొందించి కరము లోఁనై విరివిం జెందుటం జేసి అడుగడుగునను మహా ప్రమాద కారణములు అతనికిం గలుగు నని వెఱవవలసి యున్నది. కావున, ఓ గోదావరీభగవతీ, నీవు సావధానవై,

తే. శీకర క్షోద సంభార శీతలములఁ
బద్మ కింజల్క పరిమళ బంధురముల
నీ మృదూర్మి పవనముల రామభద్రు
జీవనము సౌమ్య సోమ్మను గావవమ్మ. ౨

అని.

తమస — స్నేహమునకు దాక్షిణ్యము తోడయున్నది. సంజీవనోపాయమో ప్రధానతమమే యిట సిద్ధముగా నున్నది.

మురళ — అది యెట్లు?

తమస — వినుము. అప్పుడు వాల్మీకితపోవన సమీపమున విడిచిపెట్టి లక్ష్మణుఁడు పోఁగానే, సీతాదేవి నొప్పులు కలిగి మహాదుఃఖాతిరేకమునం బోయి గంగలోఁబడినది. వెంటనే అట ఇరువురు మగ శిశువుల గన్నది. ఆమెను భూదేవియు గంగాదేవియు కరము నుగ్రహించిరి, పాతాళమునకుం గొనిపోయిరి; ఆ బుడుతలను పాలు వదలిన తర్వాత గంగాదేవి వాల్మీకిమహర్షికి అర్పించినది.

మురళ — [ఆశ్చర్యముతో]

తే. ఇట్టివారు విపాకంబు నెనయ నదియుఁ
బరమ విస్మయకారిగాఁ బరిణమించు,
అందు సాహాయ్యకము సేఁత కట్టివారు
పూనుదురు తముఁదామ యపూర్వ గతుల. ౩

తమస — మఱి యిప్పుడు ఈ శంబూక వృత్తాంతము చేత రామభద్రుఁడు జనస్థానమునకు వచ్చెడి నని సరయూవువలన విని భాగీరథీ భగవతి ఏ భయమును స్నేహముచేత లోపాముద్ర కొన్నదో అభయమునే కొన్నదై సీతాదేవిం దోడ్కొని ఏదో యొక గృహాచారంపు మిషచే గోదావరిం గాంచుటకు వచ్చియున్నది.

మురళ — భగవతి చక్కఁగా నూహించినది. — ఏమని యనఁగా — "రాజస్థానయం దున్నప్పుడు లోకముల యభ్యుదయముకొఱకు ఆయా వ్యాపారములలోఁ జొచ్చియున్న రామభద్రునికి చిత్తవ్యాసంగములు తప్పవు. మఱి యట్టి వ్యాసంగములు లేక శోకమాత్ర సహాయుఁ డైన యాతనికి పంచవటీ ప్రవేశము మహానర్థకారి యగును." అని. సరియే గాని ఇపుడు సీతాదేవి చేత రామభద్రుఁడు ఎట్లు ఊఱటం జెందును?

తమస — భగవతి భాగీరథీదేవి సీతతో నిట్లు వచించినది. "పుట్టీ. దేవయజన సంభూతురాలా సీతా, నేఁడు చిరంజీవులకు కుశలవులకు పండ్రెండవయేఁటి సంఖ్యామంగళంపు ముడి కట్టఁబడును. కావున నీవు నీదు పురాణశ్వశురుని మను సంభూతమైన యీ సకల రాజర్షి వంశమునకును జనకుని పాపమడఁచువానిని సూర్యదేవుని స్వయముగా నీ చేతితో గోసినపూవులతో పూజింపుము. మఱి భూమిపై సంచరించుచున్న నీవు మా ప్రభావంబున వనదేవతలకు సయితము కనఁబడవు. ఇఁక మనుష్యుల కగపడ వని చెప్పవలయునా?" అని. నన్నును ఇట్లాజ్ఞాపించినది. "తమసా, నీయందు మా కోడలికి జానకికి ప్రేమ మిక్కుటముగదా. కావున నీవే జానకికి తోడుగానుండుము." అని. కావున నే నిపుడా యానతిని నెఱవేర్చెదను.

మురళ — నేనును ఈ వృత్తాంతమును లోపాముద్రకు నివేదించెదను. రామభద్రుఁడు వచ్చియున్నాఁ డనియే తలంచెదను.

తమస — ఇదె యీమె గోదావరిమడుగునుండి వెలువడి. —

తే. పాలి ప్రుస్సిన చెక్కుటం గ్రాలుతుఱుము
నెమ్మొగమ్మున సొరు పెన్నిధిని జెంపఁ,
గురుణమూర్తియొ, మెయి గొన్న విరహాధరమొ,
యనఁగ నరుదెంచుచున్నది వనికి సీత. ౪

ఈమెయేగదా యామె!

తే. తొడిమ కెరపిన తలిరాకు బెదఁగు దాని
గృశను డాండువు పిమెమూర్తి నిటు వాడ్చు
నెదవిరి వివుర్చు నుగ్రచిరైధితార్తి
మెగలి లోరేకును శరత్తుసెగయుఁ బోలె. ౫

(పరిక్రమించి నిష్క్రమింతురు.

విష్కంభకము సమాప్తము



# తృతీయాంకము

[నేపథ్యంబున]

అయ్యో! ప్రమాదము! ప్రమాదము!

[అంతట పూవులు గోయుటయం దాసక్తురాలై సకరుణౌత్సుక్యముగా వినుచు సీత ప్రవేశించును.]

సీత__ఆహా! నా ప్రియసఖి వాసంతి పలుకుచున్న దని తలంచెదను.

[మరల నేపథ్యమున]

ఉ. ముందఱ లోలమై మురియ భూసుత యేకరిలేఁగ పెంపు వా
నందుగులేఁజివుళ్లుకొన లాత్మకరంబున మేపి పెంచెనో,

సీత__ఏమి దానికి?

[మరల నేపథ్యమున]

సుందరితోడ నీట నది చొక్కుచునుండుడు. వాని నద్దిరా!
క్రిందుగఁ బోరఁ బైకొనియె గంధగజం బొకఁ డాగ్రహోగ్రమై ౧

సీత__[తొట్రుపాటుతోఁ గొన్నియడుగులు నడిచి] ఆర్యపుత్త్రా, కావు కావు దానిని నా పుత్త్రకుని. [జ్ఞప్తి వహించియుంచి వైక్లబ్యముతో] అయ్యో అయ్యయ్యో! చిర మలవాటుపడిన నా యక్షరములే పంచవటీదర్శనముచేత వెండియు మందభాగ్యనయిన నానోట వచ్చుచున్నవి. హా! ఆర్యపుత్త్రుఁడా!

[అని మూర్ఛిల్లును.

తమస__[ప్రవేశించి]పట్టీ. ఊఱడిల్లుము, ఊఱడిల్లుము.

[నేపథ్యమున]

విమానరాజ, ఇట నే యుండుము

సీత__[ఊఱడిల్లి సాధ్వసోల్లాసములతో] అమ్మా! నీరు నిండిన మేఘంపు గర్జనవలె గంభీర మాంసలము ఎక్కడిది యీ భారతీ నిర్ఘోషము; వీనుల వివరముల నించుచు నాకుం గూడ మందభాగినికి వెంటనే ఆశ్వాసము నొసంగుచున్నది!

తమస__[స్నేహ బాష్పములతో] ఓసి నా పట్టీ,

తే. తెలియ దెందులయదియొ, వ్యక్తిం బొరయద,
యట్టి నినదంబునకి దేమె యిట్టు లైతి?
వారిధరగర్జ విన్న మయూరివోలె
భయపడితి, వర్మిలికిని బొల్పడితి, కూన. ౨

సీత — భగవతీ, అవ్యక్తమని యందువా? నేనో మఱి స్వరసంయోగము చేత ఆర్యపుత్త్రుఁడే పల్కుచున్నాఁడని ఆనవాలు పట్టితిని.

తమస — వింటిమి గదా తపించుచున్న శూద్రునికి దండన మొసంగుటకై ఐక్ష్వాకుఁడు రాజు జనస్థానమునకు వచ్చినాఁడని.

సీత — అహా! ఆ రాజు రాజధర్మమునందు కొఱవడనివాఁడు గదా!

[నేపథ్యమున]

తే. చెట్టులును లేళ్లనుగ నాకుఁ జుట్ట లెచట,
నెచటఁ జిర ముంటి సఖితోడ నింపు మెఱయఁ,
గ్రాలు నవె యివి బహు ఘనీ కందరములు
గోద చెంగటి గొనబుల కొండదరులు. ౩

సీత — [చూచి] హా! ఏమి! ఈతఁడు ప్రాతస్తన చంద్రమండలాపాండుగ పరిక్షీణ దుర్బలాకారుఁడై గంభీరానుభావమాత్రము చేత నెఱుకపడుచున్నాఁడు! ఆర్యపుత్త్రుఁడే! హా! నన్ను పట్టుకొమ్ము.

[అని తమసను గౌఁగిలించుకొని మూర్ఛిల్లును.

తమస — నా బిడ్డా సమాశ్వసిల్లుము, సమాశ్వసిల్లుము.

[నేపథ్యమున]

ఈ పంచవటీ దర్శనము చేత,

తే. డెందమున రీన మై యున్న కుందువహ్ని
యూఁక నెఁగఁద్రోచి యిదె మంట నగ్గలింప,
మున్ను లేచెడి బలుపొగమొత్త మనఁగ
మూర్ఛ యిదె నన్ను ముంచెడి ముమ్మరముగ। ౪

హా! ప్రియా! జానకీ!

తమస — [స్వగతము] ఇదే అది గురుజనులు కూడ ఆశంకించినట్టిది.

సీత — [సమాశ్వసిల్లి] హా! ఏమి ఇది!

[మరల నేపథ్యమున]

హా! దేవీ; దండకారణ్యవాస ప్రియసఖీ! హా! విదేహరాజ పుత్త్రి! [అని మూర్ఛిల్లును.

సీత — అయ్యో, అయ్యో! నన్ను మందభాగ్యను పేర్కొని నల్లగలువల చేలిన కన్నులు మూఁతపడి ఆర్యపుత్త్రుఁడు మూర్ఛిల్లినాఁడు! హా! ఎట్లు వట్టినేల నిశ్వాసము నిగుఢమై తాళలేక చాపకట్టుగాఁ బడినాఁడు! భగవతి తమసా, కావుము కావుము, ఆర్యపుత్త్రుని బ్రదికింపుము, [అని తమసాపాదములం బడును.

తమస—

తే. పొమ్ము కల్యాణి, వైళమ్మ పొమ్ము పీవ,
జగదధీశుని జీవనౌషధివి గమ్ము;
అతనికిఁ బ్రియ మగుట నీచేతికాఁకు,
దాసనే నియతంబు తద్రక్షణంబు.

సీత—ఏమైన నగుగాక. భగవతి యానతిం జేసెదను.

[అని సంభ్రమంబున నిష్క్రమించును.

[అంతట సేలఁబడినవాఁడై సబాష్ప యగు సీతచేతి తాఁకుడుచే ఆహ్లాదముతో ఉచ్ఛ్వసిల్లుచు రామభద్రుఁడు ప్రవేశించును]

సీత—[హర్షముతో స్వగతము] త్రైలోక్యనాథునికి మరల జీవితము వచ్చిన దని తలంచెద.

రాముఁడు—ఓహో! ఎవ రిక్కడ! ఏ మిది!

సీ. హరిచందన ప్రవాళాంకూర విచయంపుఁ
బసరున లేపంబు నొసఁగు టొక్కొ!
అమృత కిరణ కిరణాగ్రంబులను నుల్చి
తద్రసంబునఁ జక్కఁ దడుపు టొక్కొ!
అనయం బెరియుచున్న యట్టి నా జీవిత
తరువునకుం బరితర్పణముగ
సంజీవ నౌషధీ మంజుల స్రావంబు
డెందాన నెరయ నలందు టొక్కొ!

తే. స్పర్శ మిది నిక్కముగ నాకుఁ బరిచితంబు,
మోహావాటిక మిది మనోమోహకంబు,
మఃఖజం బగు మూర్ఛను ద్రోయు నిపుడె
యిడిన దానందమున వెంది జడత నహహ!

సీత—[ససాధ్వస కరుణముగా ఇంచుక ఓసరిల్లి] ఈపాటియే చాల ఇపుడు మహా త్తిరము.

రాము—[కూర్చుండి] నిశ్చయముగా నన్ను వాత్సల్యముచే సీతాదేవి అనుగ్రహించినది గావలయు.

సీత — అయ్యో అయ్యో! ఆర్యపుత్రుఁడు నన్ను వెదకుచా రేమి?

రాము — కాని పరికించెద.

సీత — భగవతీ తమసా, అవలి కేఁగుదము. నన్నుఁ గనుక చూచెనా, అంతట అంగీకృతముగాని నా సన్నిధానమునకై ఎక్కుడుగా మహారాజు కోపించును.

తమస — ఓసి పట్టీ, భాగీరథీప్రభావంబువలనఁ జేసి వనదేవతలకు సైతము అదృశ్యవుగా నున్నావు.

సీత — అవును. అది కలదు,

రాము — ప్రాణేశ్వరీ! జానకీ!

సీత — [శోకగద్గదముగా] ఆర్యపుత్రా! ఈ పలుకు ఈవృత్తాంతమునకు సరిపడదు గదా! [సబాష్పము] అట్లుగాదు; ఎట్లు నేను నిజమాయిని జన్మాంతరమునం దేని కలుగునని తలంపరాని దుర్లభ దర్శనము నొసంగినదానిని నన్నే మంద భాగ్యను గణించి నన్నుఁగూర్చి యిట్లు పలుకుచున్నవానిని ఆర్యపుత్రునిఁగూర్చి కనికరము లేనిదాన నగుదును? నేను ఈయన హృదయమును ఎఱుంగుదును, ఈయన నాహృదయమును ఎఱుంగును, అనుట.

రాము — [కలయం బరికించి నిర్వేదముతో] హా! ఇట నెవ్వరును లేరే!

సీత — భగవతీ తమసా! అట్లు నిష్కారణముగా పరిత్యజించియును ఈయన ఈవిధముగా కనంబడఁగా నా హృదయము ఏవిధం బొందియున్నదో ఎఱుఁగ లేకున్నాను!

తమస — ఎఱుంగుదును బిడ్డా ఎఱుంగుదును.

సీ. ఆస డింపుటజే నుదాసీనముం బలె,
విప్రియంబునఁజేసి విషమము బలె,
చిరతరంబైన యీ విరహాన దబ్బాటు
ఘటనచేతను బ్రాపు గన్నది బలె,
సౌజన్యమున సుప్రసన్నంబు బలెఁ, బ్రియ
కరుణంబులను గాఢకరుణము బలె,
రాగంబుచేతఁ గరంగినయది బలె,
నీమనం బైన దీ నిముసమందు,

రాము — దేవీ,

తే. మూర్తిగొన్న ప్రసాదముం బోలె నీవు
చేతి తాఁకుడు స్నేహార్ద్రశీతలంబు

నాకు విడుచున్న దిపుడు నానందభరము,
నందివీ, గానఁబడవు పీ వెందు నకట! ౮

సీత — ఇవి గదా అగాధ దర్శిత స్నేహ సంభారములు ఆనంద నిష్యందులు సుధామయములు ఆర్యపుత్త్రుని యుల్లాపములు. వీనియందలి నమ్మిక చేతఁగదా నాకు ఈ జన్మలాభము నిష్కారణపరిత్యాగ శల్యముచే మెరమెరలాడుచున్నను ప్రియమైనది.

రాము — కాదు కాదు. ప్రియతమ యెక్కడి దిచ్చట? నిశ్చయముగా ఇది రామభద్రుని భ్రమ, సంకల్పాభ్యాసబలముచేత జనించినట్టిది.

[ నేపథ్యమున ]

ప్రమాదము! ప్రమాదము!

['ముందటఁ గోలమై' ఇత్యాద్యర్థము పఠింపఁబడును.]

రాము. — [సకరుణౌత్సుక్యము] ఏమి దానికి?

[మరల నేపథ్యమున]

['సుందరితోడ' నిత్యాద్యుత్తరార్థము పఠింపఁబడును.]

సీత — ఎవరిప్పుడు ఆ దుష్టగజమును దండించెదరు?

రాము — ఆ! ఎక్కడ నా దుష్టగజము నా ప్రేయసి పెంపుడు పుత్త్రుని రఘూద్వహీయుని పైకొనుచున్నట్టిది? [అని లేచును.

వాసంతి — [సంభ్రాంతురాలు ప్రవేశించి] ఏమి! మహానిరాయుఁడు రఘునాథుఁడా!

సీత — అహో! నా ప్రియసఖి వాసంతియా!

వాసంతి — దేవా, నీకు జయము.

రాము — [నిరూపించి] అహో! దేవికి ప్రియసఖి వాసంతియా?

వాసంతి — దేవరా, తర్వపడుడు త్వరపడుడు; ఇటనుండి జటాయు శిఖామునకు దక్షిణమున సీతాతీర్థముమీఁదుగా గోదావరిలోనికి దిగి దేవరిపుత్త్రకునికి ప్రాపుగమ్ము.

సీత — హా! నాయనా జటాయూ. ఇప్పుడు నీవు లేక జనస్థానము శూన్యము!

రాము — అహాహా! ఈ కథోద్ఘాతములు గుండియలను ప్రీల్చునవిగదా.

వాసంతి — దేవా, ఇటు ఇటు

సీత — భగవతీ, సత్యమే వనదేవతలుకూడ నన్ను కనలేకున్నారు.

తమస — ఓసి పట్టీ! ఎల్ల దేవతలకన్న ఎక్కుడైశ్వర్యము మందాకినీదేవికి. అట్లుండ నీవేల సందేహించెదవు?

తమస — కలుగునుగాక వేల్పుల యనుగ్రహంబుచేత.

సీత — భగవతి తమసా, ఈ నిసుఁగుల స్మరణచేత స్తనములు చేఁపి వారి తండ్రి సన్నిధానంబున క్షణమాత్రము నేను సంసారిణి నైతిని.

తమస — ఇందుల కేమందుము. కానుపు గదా స్నేహ ప్రకర్షమునకు పరమావధి. ఇది తల్లిదండ్రులకు ఉత్కృష్టమయిన యొండొరుల కూర్పు.

క. ఇరుదంపతులయు సంతతి
కిరణాంబుల స్నేహరసము కిరు వంక నెంచఁగా,
హరుసపు ముడి యది యొక్కటిఁ
బరిబద్ధ మపత్య మనెడి పరనామమునన్. ౧౦

వాసంతి — ఇట్లను దేవర చూడవలయు;

క. అనుదిన మేనెమలివి సఖి
పెనిచె నవోత్థి దళముగ్ధ పింఛము, నదె హా
యను ననసిత ముష్ప్రఖము ర ౧౧
తనపు బొమిడికము బరెం గదండాగ్రమునన్.

సీత — [సకౌతుకబాష్పము] అదా యిది?

రాము — ఆనందింపుము వత్సా ఆనందింపుము.

సీత — అట్లే అగుఁగాక.

రాము —

ఉ. గొండిచబన్ బటాంతర విఘూర్ణనసంజ్ఞ నొసంగు కటింకిన్
దాండవపత్రపుర్ చతురితం బ్రచలించుట భూషణంబు గా.
మండిత హస్తతాళముల మత్ప్రియ నొల్పిన నిప్పు మత్పుతా
ఖండలుఁ గాఁగ దెంచమున నారవ మొప్పఁగ సంస్కరించెదన్. ౧౨

ఆహా! తిర్యగ్జంతువులు సయితము పరిచయము ననుసరించును.

తే. పూవి పూసని గున్నమై పోఁడిరవ
దయిత పెంచిన యప్పుడు తనరె నేది.

సీత — ఆర్యపుత్త్రుఁడు చక్కఁగా ఆనవాలు పట్టినాఁడు.

రాము —

స్వజనమునఁ బోలె దాన హర్షంబు గనుట
నిజముగా దేవి నీ గిరినెమ్మి దలఁచు. ౧౩

వాసంతి — దేవర, యిటఁ గూర్చుండుపు గాక.

ఆ. కాంతతోడ నీకుఁ గమనీయ శయన మౌ
రావితర్ది యిది యరంటిపవిని,
పూరి యొసఁగె సీత సారె వీనికి నిటఁ,
గాన, హరిణకములు దీని విడవు. ౧౪

రాము — దీనిని నేనుం జూడ నోపకున్నాఁడ.

[అని ఒండెడ నేడ్చుచుం గూర్చుండును.

సీత — సఖి వాసంతి! ఏమి చేసితివే నీవు. ఆర్యపుత్త్రునికిని నాకును ఈ ప్రదేశమును చూపుటచేత! అకటకటా! అతఁడే ఆర్యపుత్త్రుఁడు, అదే పంచవటీ వనము, నీవే ఆ ప్రియసఖివి వాసంతి, అవే నానా విస్రంభసాక్షు లైన గోదావరీ కాననోద్దేశము, నా బిడ్డలకన్న వేఱు గానట్టివి అవే యీ మృగ పక్షి వృక్షములు, మందభాగ్యను నాకు మఱి అగపడుచునే యున్నను ఇవి యెల్లను లేనివే! ఇట్టిదిగా నున్నది జీవలోకమునకు దశాపరిణామము!

వాసంతి — సఖి సీతా, రాముని యవస్థను చూడవా యేమి?

చ. కలువదళంపుసొంపలపి కన్నుల పండువు సేయ నంగముల్,
తలఁచినయప్పు డెల్లఁ గన దక్కియు నీ కెపుడున్ నవుండె మై
వెలసియు, విప్ర శోకమున విహ్వలితాంగుఁడు పాండురుండు న
ర్పులఁ దయి యెట్టకేలకు విభావితుఁ డయ్యెను నేత్రపర్వమౌ. ౧౫

సీత — చూచుచున్నాను సఖీ, చూచుచున్నాను.

తమస — ప్రియునిఁ జూచుచుందువు గాక.

సీత — హా దైవమా! నేను లేక యీతఁడు, ఈతఁడు లేక నేనును, అని ఎవరు తలంచిరి. కాన, ముహూర్తము నీ పయినను జన్మాంతరమందుం బోలె కానంబడినవానిని బాష్పజలముల నడుమ నడుమ చూచెదను గాక నాయందు వత్సలుని ఆర్యపుత్త్రుని. [అసతోఁ జూచును.

తమస — [సాఖ్యముతో కవుంగిలించి]

తే. మోదశోకాశ్రువుల వెల్లి పొడుచు నీదు
దృష్టి తృష్టచే నుత్తానదీర్ఘ యగుచు,
దయితు ధవళబహుళముగ్ధ తానమార్చు
హార్ద నిష్యంది క్షీరకుల్యయును బోలె. ౧౬

వాసంతి.—

చ. తరులు ఫలప్రసూన సహితంబగు తేనియ నర్ఘ్య మిచ్చుతన్,
విరిసిన తమ్మిసౌరభము వెల్లిగ వీచుతఁ గాన తెమ్మెరల్,
ఉరక కలక్వణంబుల రతోత్సుకముల్ పులుఁగుల్ రచించుతన్,
మరలను రామదేవుఁడు సమాగతుఁ డీ వ్వనికిన్ స్వయంబుగాన్. ౧౩

రాము—సఖీ, వాసంతీ, ఇటఁ గూర్చుండుము.

వాసంతి—[కూర్చుండి సబాష్పము] మహారాజ, కుమారలక్ష్మణునికి కుశలమా?

రాము—[వినమి నభినయించి]

తే. జలము నివ్వరి పూరిఁ గై నలమున నిడి
యే తరు విహంగ మృగముల సీత పెనిచె,
వానిఁ గన్నంత విక్కృతి నా కౌ నొకండు
ప్రస్తరోచ్ఛేద పటువు హృద్ద్రవమువోలె. ౧౪

వాసంతి—మహారాజా, అడుగుచున్నాను గదా కుమార లక్ష్మణునికి కుశలమా అని.

రాము—ఓహో! మహారాజా యని ప్రేమలేని పిలుపుపదము. సౌమిత్రిని గూర్చి మాత్రము బాష్పగద్గదాక్షరము కుశలప్రశ్న. కావున తలంచెదను ఈమెకు సీతా వృత్తాంతము ఎఱుకపడి యున్నదని, [ప్రకాశము] అవును. కుశలము కుమారునికి. [అని యేడ్చును.

వాసంతి—ఓయి దేవరా, క్రూరుఁడవు గదా అయితివి.

సీత—సఖి వాసంతి, నీ విట్లు పలికెద వేమి? ఆర్యపుత్త్రుఁడు ఎల్ల వారికిని ప్రియార్హుఁడు గదా, నా ప్రియసఖికి విశేషముగా నట్టిఁ డని చెప్పవలయునా?

వాసంతి.—

ఉ. ఈవె మదీయ జీవితము, వీవె ద్వితీయ మనంబు, పత్నిలం
దీవె విశుద్ధకౌముదివి, యీవె సుధాపగ వంగమందునన్;
ఇవ్విధి బేలకున్ శతము లిచ్చగము ల్పచరించి దానినేగా!

[నిశ్వసించి]

విధి! కాంత మౌఁతఁ మటు గా కిఁక నుత్తి మేల యూఁకొనన్!

[అని మూర్ఛిల్లును.

రాము—యుక్తము గదా మాట మానుటయు మూర్ఛిల్లుటయు. సఖీ, సమాశ్వసిల్లుము సమాశ్వసిల్లుము.

వాసంతి__[సమాశ్వసిల్లి] ఏల యీ యకార్యమును దేవర కావించెను?

సీత__సఖీ వాసంతీ, మానుము మానుము.

రాము__లోకము ఒప్పలేదని.

వాసంతి__అందులకు ఏమి కారణము?

రాము__అది లోకమునకే యెఱుక.

తమస__లోకులను నిందింపఁదగును.

వాసంతి__

ఉ. ఓయి కఠోర! నీకు యశ మొక్కటియే గద యెంతయుం బ్రియం,
బే యయశంబు ఘోరతర మింతటిఁకన్న వచింప నేర్తువే?
ఆ యటవిన్ మృగీనయన కై నగతిన్ విహరింప వయ్యె యో
హో యధినాథ: యే మనుచు నూహయొనర్తువొ దాని నయ్యయో! ౨౦

సీత__నీవే సుమా, వాసంతీ, దారుణురాలవు కఠోరవును. ఏలన నిట్లు ఆర్యపుత్రుని దుఃఖితుని క్షోభ పెట్టుచున్నావు.

తమస__ప్రేమయు శోకమును ఇట్లు పలుకుచున్నవి.

రాము__సఖి ఏమనుకొనవలసినది?

తే. చకిత సారంగశాబక చపల నయన
స్ఫురిత పరిణత గర్భ ప్రభూత ఖేద
కౌముదీమయి బిసముగ్ధ గాత్రలతిక
యబల క్రవ్యాత్కుల విలుప్త యయ్యె నిజము. ౨౧

సీత__ఆర్యపుత్రా, బదికియున్నాను.

రాము__హా ప్రేయసీ, జానకీ, ఎచట నున్నావు?

సీత__అక్కటా అక్కటా, ఆర్యపుత్రుఁడు సామాన్యుని వాలె ఏడ్చుచున్నాఁడు!

తమస__పట్టీ, ఇది యుక్తమే కదా. దుఃఖితులు దుఃఖనిర్వాపణము చేసికొనవలసినదే కదా ఏలన.__

తే. వెల్లి దడులఁ బొరలి హల్లకల్లోల మా
కొలనిఁ ద్రెవ్వనీక కలుఁజ గాచు;
శోకవేగమునకు క్షోభించు డెందమున్
విలపనంబు గాచు బ్రీలనీక. ౨౨

విశేషముగా రామభద్రునికి పెక్కు తెఱంగుల జీవలోకము కష్టమైయున్నది,

ఉ. పూనికతోడ విశ్వమును బ్రోచుట కార్యము శాస్త్రసమ్మతిన్,
మానినివంత యాత్మను సుమంబును పుష్పము వోలె వాడ్చెడిన్,
తానె తొలంచుటన్ విలపితంపు వినోదము నబ్బదాయెనే;
కాన నిటిప్పుడేని శమకారణ మా రుదితంబు మే ల్గదా. ౨౦

రాము — కట్టా! కట్టా!

ఉ. వ్రీలును గాని గుండె భయవేగముచే, మఱి గాదు రెండుగా;
సోలును గాని విహ్వలత సొమ్మల మై, విడ దొర చేతనన్;
కాలుచుఁ గాని లోనిసెగ కాయముఁ జేయదు బుగ్గిగా; హతిన్
గూలుచుఁ గాని మర్మములఁ గోసెడి దైవము కోయ దాయువున్:

సీత — ఇట్టిద యిది.

రాము — ఓ అయ్యలారా! పౌరజానపదులారా!

చ. సరిపడదాయె మీమదికి జానకి యింటను మన్కి, దానఁ బు
ల్పోఁకనుబోలె శూన్యవనిలో విడనాడితి; వెండి వంతరన్;
పరచయబంధు లైన యలఘానసము లిప్డు కరంబె నామదిన్,
శరణము లేమి శోచనము సల్పెద, నిందుల కేని యోర్వుఁడీ; ౨౧

తమసా — శోక సముద్రంపునింపు అతిగంభీరముగా నున్నది!

వాసంతి — కడచిపోయిననానింకూర్చి దేవర తాల్మి వహింపవలయును.

రాము — సఖీ ఎట్లు చెప్పెదవు తాలిమి యని?

తే. దేవి పాఱిడిచన్నట్టి యీవసుధకుఁ
బదియు రెండవ దగునేఁడు ప్రాప్త మయ్యె;
నష్ట మైనది సీత యన్నామ మదియు.
లేఁడు రాముఁ డనెడు మాట లేవి దాయె. ౨౨

సీత — ఆర్యపుత్రుని యీ వచనములచేత మూఢ నగుచున్నాను.

తమస — అట్లే బిడ్డా.—

తే. స్నేహ శీకరంబులును శోక నిష్ఠురములు
నిష్టతమములు గావు నీ కీ పలుకులు;
తల్లి, యామకరందంపు ధార లివ్వి
కురియుచున్నవి నీమీఁద నురునిషములు. ౨౩

రాము — వాసంతీ, విను :—

తే. అడ్డముగ లోన నాటిన దౌ నలాత
శల్య మెట్టులో సవిషదంశంబు నెట్లొ
అట్లె హృన్మర్మములను గోరాడుచున్న
కుందుమేకును నే నోర్చుకొనఁగ లేదె? ౨౮

సీత — ఎంత మందభాగ్యురాలను నేను! వెండియు నార్యపుత్త్రునికి ఆయాసకారిణి నైతిని!

రాము — ఇట్లు అంతఃకరణమును ఇంచుకేని చలింపనీయక స్తంభించుకొన్నవాఁడనైయును నాకిప్పుడు పూర్వానుభూతము లయిన యాయా ప్రియవస్తువులం గానఁగా ఈ యుప్పెన కలిగినది. అది యెట్లన.—

ఉ. పాయక షోభితేంద్రియవిపార విజృంభణ మాఁపువాఁడ నై
యే యతనంబు క్లేశపడి యే రచియింతునొ, దాని నెల్లనుఁ,
నాయెదలో వికారము ఘనం బయి యొక్కటి త్రోచివైచెరుఁ
దోయరుకీపహోగ్రరయధోరణి సైకతసేతువుం బలెన్. ౨౯

సీత — దుర్వార దారుణారంభమైన యార్యపుత్త్రుని యీ దుఃఖసంక్షోభము చేత నా హృదయము పరిస్ఫురిత నిజదుఃఖమును బోలె వడవడ వణఁకుచున్నది.

వాసంతి — [స్వగతము] దేవర కష్టముపాలైనాఁడు. కావున వేఱు విషయమునకు మరల్చెదను, [ప్రకాశము] చిరపరిచితములైన యీ జనస్థాన భాగములను దేవర చిత్తగించునుగాక.

రాము — అట్లే కానిమ్ము. [లేచి పరిక్రమించును.

సీత — దుఃఖ సందీపనములనే ప్రియసఖి వినోదనోపాయ మని తలంచుచున్నది.

వాసంతి — [సకరుణము] దేవా, దేవా,

శా. ఈ పల్లీగృహమందె యుండితివి కావే కన్నుఁ దన్మార్గముం
దా వేడ్కం గొని తామపించె సఖి గోదం డిన్నె హంసాళితోఁ;
చేవే వచ్చుచు దుర్మనాయితునిఁగా వీక్షించి నిన్ భీత యై
కావించెం జితపద్మకోరకము ముగ్ధంబుఁ బ్రణామాంజలిన్. ౩౦

సీత — దారుణవు నీవు వాసంతీ, దారుణవు. ఏల యిట్లు ఈ హృదయమర్మగూఢ శల్యోద్ఘట్టనముల చేత మందభాగ్యను నన్నును ఆర్యపుత్త్రునిని సంతాపపెట్టెదవు?

రాము — చండీ జానకీ? ఇటనటం గనఁబడుచు నీ యున్నావు. జాలిగొన వేమి?

శా. హా! ప్రాణేశ్వరి! ప్రీలు నాయెడఁద, దేహం బస్తబంధం బగుఁగా!
చూపట్టుఁగా భువి పాడుగా, నవిరతార్చుల్ లోన నఁగా గాల్చెదుఁగా,
మో హాంధకటి నంతరాత్మ మునుఁగం బోలుఁగా వశాపేత మై,
ప్రాపించుఁగా బెమమోహ, మేమియుఁక మందాదృష్టుఁడం జేయుదుఁగా! ౩౧

[అని మూర్ఛిల్లును.

సీత — అయ్యో అయ్యో! ఆర్యపుత్త్రుఁడు మరల మూర్ఛపోయినాఁడు.

వాసంతి — దేవరా, సమాశ్వసిల్లుము సమాశ్వసిల్లుము.

సీత — హా ఆర్యపుత్త్రుఁడా, మందభాగ్య నైన నన్నుఁగూర్చి నీకు సకల జీవలోకమంగళాధారభూతునికి మాటిమాటికి ప్రాణసందేహదారుణ మైన యీ దశాపరిణామము! హా! చెడితిని! [అని మూర్ఛిల్లును.

తమస — పట్టీ సమాశ్వసిల్లుము సమాశ్వసిల్లుము. మరల నీ పాణిస్పర్శయే రామభద్రునికి జీవనోపాయము. [సీత సమాశ్వసిల్లును.

వాసంతి — ఏమి ఇంకను మూర్ఛ తేరఁడు! హా! ప్రియాసఖి సీతా! ఎక్కడ నున్నావు? నీ జీవితేశ్వరుని సంభావింపుము.

[సీత వడివడిగాఁ దఱిసి ఎదయందును నొసటనుం దాఁకును.

వాసంతి — ఆహా! రామభద్రుఁడు మరల చేతనం బొందినాఁడు!

రాము —

తే. అమృతమయలేపములఁ జిక్కనంఁదె నాఁగ
దై హిమములను లోపెలిఫాతువులను.
స్పర్శ మాకస్మికము నన్ను బ్రదుకఁజేసి
హర్షమున నొందువగ మోహమందు ముంచె. ౩౨

[ఆనంద నిమీలితాక్షుఁడు గా నే] సఖి, వాసంతి, సంతోషము. నీవు వరిల్లుచున్నావు.

వాసంతి — ఎట్లు?

రాము — సఖి, వే తే మున్నది? జానకి మరల దొరకినది.

వాసంతి — ఓయి దేవరా రామభద్రుఁడా, ఎక్కడ నయ్యా యామె?

రాము — [స్పర్శసుఖ మభినయించుచు] ఇదె ఎదుర నే.

వాసంతి — హా దేవా, ప్రియసఖీదుఃఖదగ్ధను మందభాగ్యను నన్ను ఏల యిట్లు మర్మచ్ఛేదదారుణములైన ప్రలాపములచేత మరల దహించెదవు.

సీత — నేను అవలి కరుగఁ గోరుచున్నాను. దీర్ఘదారుణంబుగ నైనను నా సంతాపమును క్షణములో పోనడఁచుచున్న చిరసుద్భావ సౌమ్యశీతలంబైన యీ యార్యపుత్త్రి స్పర్శచేత నా హస్తము వజ్రలేపోపనిబద్ధమువలెనె చెమర్చుచు కెడలినట్లు తడంబడుచు వశము దప్పి వణఁకుచున్నది.

రాము — సఖీ, ప్రలాపము లనెద నేమి?

మ. మును పుద్వాహమునందుఁ గంకణధరంబుగా దేవిఁ గైఁగొంటినో,
అనుభూతంబో సుధాహిమంబు చిరమే యత్స్పర్శ మిచ్చారతిగా.

సీత — ఆర్యపుత్త్రా, అతఁడవే యిపుడు నీవు.

రాము —
పునరాత్తంబగదే యదే లవలిక్రొమ్మొల్కం బిసాళించు నా
వనితారత్నముకేలుదమ్మి కరకాప్రాలేయ సౌభాగ్యమై. ౩౩

[అని గ్రహించును.

సీత — ఆహా! కట్టా! ఆర్యపుత్త్రుని స్పర్శచేత మోహితనయిన నాకు ప్రమాదము సంభవించినది!

రాము — సఖి వాసంతి, ఆనంద నిమీలితేంద్రియుఁడను నిర్వాణచేత వివశుఁడను. కావున నీవు ప్రియసఖిని ఇంచుక సేపు పట్టుకొమ్ము.

వాసంతి — కట్టా ఉన్మాదమే అయినదే.

[సీత కడిగా చేయి లాగికొని అపసరిల్లును.

రాము — హా, ఇసీ, ప్రమాదము!

ఆ. పల్లవోపమంబు పరిగళితం బయ్యె
జడమునుండి జడము సరగ నిపుడె
వేపినుండి వేపి స్వేదినుండియు స్వేది
నాకరంబునుండి నాతికరము. ౩౪

సీత — ఆర్యపుత్త్రుని నయనములు అవ్యవస్థితముగా స్తిమితములును మూఢములును సుడియునవియుంగా నున్నవి. ఆర్యపుత్త్రుఁడు ఇంకను తన్ను కుదుటికిం దెమ్చుకొలేదు.

తమస — [స్నేహ హాస కౌతుకములతో, నిర్వర్ణించి]

తే. స్వేద రోమాంచ వేపథు స్పృతగాత్రి
యయ్యె బాల ప్రియస్పర్శ హర్షమునను,
కరువలికిఁ దొలిజడికిఁ గ్రక్కదలి తడిపి
క్రొత్త ననుమ కదంబంపుఁ గొమ్మవోలె. ౩౫

సీత—[స్వగతము] అహో! అరతచే నిట్లయి తమసాభగవతిచేత లజ్జిత నైతిని! ఈమె యేమి తలంచునో గదా, 'ఈ పరిత్యాగ మేమి ఈ హృదయాసంగ మేమి?' అని.

రాము—[కలయంగని] హా! ఏమీ? లేనేలేదే! ఓ కరుణాహీనురాలా వైదేహీ!

సీత—సత్యము కరుణాహీననే నేను, ఎట్లన, ఇట్టి దశలో నున్న నిన్ను చూచుచు ప్రాణమును ధరించియే యున్నానుగదా.

రాము—ఎచట నున్నావు? అనుగ్రహింపుము, ఈ దశలో నున్నవానిని నన్ను విడనాడుట నీకుం దగదు.

సీత—ఆర్యపుత్రుండా. ఇది విపరీతముగా నున్నది!

వాసంతి—దేవరా, అనుగ్రహింపుము అనుగ్రహింపుము; మితిమీఱిన విప్రలంభము పాలయిన నిన్ను నీ లోకోత్తర ధైర్యముచేతనే నిలుపరించుకొనుము. నా ప్రియసఖి ఇట లేదే?

రాము—నిజముగానే లేదు. అట్లు కాదేని, వాసంతికి ఏల యగపడదు. ఇదేమి కలయా, నిద్ర పొందనైతిం గదా. కాక, రామునికి నిద్ర యెక్కడిది? నిశ్చయముగా నిరంతర సంకల్ప పరంపరా పరికల్పితమయిన చిత్తభ్రమయే అపరమేయ మహిమగలది. మాటిమాటికి నన్ను వెంటనంటుచున్నది.

సీత—నేనే క్రూరురాలను ఆర్యపుత్రుని వంచించితిని.

వాసంతి—దేవా, చూడు చూడు.

మ. అసురాధీశుని యుక్కుఁదేరిదె జటాయ్వాఘాత భగ్నంబు, మి
న్గెసఁ దమ్యుగ్ర పిశాచతుండ ఖరపంక్తి స్పృతకంకాళముల్,
అసికృత్తోరు జటాయుపక్షఁ దయి దీవ్యచ్ఛంప మద్దంబు నా
వెనఁ గోపోజ్జ్వల సీత నెత్తికొని విస్ఫూర్జా జనేఁ జ్ఞే సోఁ కిటఁ. ౩౮

సీత—[సభయము] ఆర్యపుత్రా! నాయనను చంపుచున్నాఁడు! నన్నపహరించుచున్నాఁడు! రక్షింపు రక్షింపు!

రాము—[వేగమున లేచి] ఆ! పాపాత్ముఁడా! తాత ప్రాణ సీతాపహారీ! ఎట బోఁగలవు?

వాసంతి—దేవరా, రాక్షసవంశ ప్రళయ ధూమకేతూ, ఇప్పుడును నీ కోపమునకు విషయము కలదా?

సీత—అహో ఉన్మత్త నయితిని గదా.

రాము—ఇప్పుడు వాస్తవముగా ప్రలాపమే చేసితిని. అట్టిది గాదు ఇప్పు డీ విపర్యయము ముందుగా సంభవించినది.

చ. సరవి నుపాయవంతము నజస్రవినోదము నై ప్రవీర సం
హరణముచే జగంబున మహాద్భుత మై మదిరాక్షితోడ ము
న్విరహము సహ్య మయ్యె నరివిర్మథనావధి; యిప్పు డన్నినో
నిరవధి నిష్ప్రతిక్రియము నిష్పరిదేవిత మెట్లు సహ్య మౌ. ౩౬

సీత — నిరవధి యని హా చెడితిని మందభాగ్యను! [అని ఏడ్చును.

రాము — హా! కష్టము!

చ. ఎవటఁ గపీంద్రుచెల్మి వృథ, యెచ్చటఁ గ్రోఁతులశక్తి వమ్ము, న
మ్మెచటను జాంబవన్మతి, యనీకుఁ డెటం జన వాయుసూనుఁడున్,
ఎచటికిఁ ద్వష్టృసూతి నలుఁ డేనియుఁ జేయఁగలేఁడుదారిఁ దా
నెచటికి లక్ష్మణేషువులు నేఁగవ, యం దెట నుందువే సఖీ. ౩౭

సీత — పూర్వ విరహమును బహుమానించుచున్నాను.

రాము — సఖి వాసంతి, ఇప్పుడు రాముని జూచుట సఖులకు దుఃఖమునకే. కావున, ఎంతసేపు నిన్ను ఏడిపింతును? మతి నాకు పోవ ననుజ్ఞ యిమ్ము.

సీత — [ఉద్వేగముతో తమసను పట్టుకొని] భగవతి తమసా ఏమి ఆర్యపుత్త్రుఁడు పోనేపోవునే!

తమసా — బిడ్డా, ఊఱడిల్లు మూఱడిల్లుము మనమును చిరంజీవు లగు కుశలవుల వర్ష వర్ధన మంగళములను నెఱవేర్చుటకు భాగీరథీ పాదమూలముం జేరుదము.

సీత — భగవతి, అనుగ్రహంబున సెలవిమ్ము, దుర్లభజనుని క్షణమాత్ర మయినను గాంచెదను.

రాము — ఇప్పుడు నాకు అశ్వమేధమునకై సహధర్మచారిణి కలదు.

సీత — [ఉత్కంపముతో] ఆర్యపుత్త్ర, ఎవ రామె?

రాము — బంగారపు సీతా ప్రతిమ.

సీత — [ఉచ్ఛ్వాసముతో, సబాష్పము] ఆర్యపుత్త్రుఁడవే యిప్పుడు నీవు. అహో! నా కిపుడు ఆర్యపుత్త్రునిచేత పరిత్యాగ శల్యము తివిచి వైవఁబడినది!

రాము — దానిం జూచుచునైన బాష్పావరుద్ధమును నేత్రమును వినోద మొందించెద.

సీత — ఆర్యపుత్త్రునిచేత బహుమానింపఁబడునది యది ధన్యగదా, ఏలన, అది ఆర్యపుత్త్రుని వినోదపెట్టున దై జీవలోకమునకు ఆశానిబంధన మైనది.

తమస — [స్మితస్నేహాస్రములతో కవుంగిలించి] ఓసి బాలా, ఇది నిన్నే పొగడుకొనుట.

సీత—[సలజ్జము, అధోముఖియై, స్వగతము] భగవతి నన్ను పరిహసించు చున్నది.

వాసంతి—ఈ యాగమనసంవిధానమే మాయందు నీ మహాప్రసాదము. పోవలసియున్న కార్యహాని లేకయుండునట్లు పోఁదగును.

సీత—ఇప్పుడు నాకు వాసంతి ప్రతికూల యైనది.

తమస—రా రమ్ము పోవుదము.

సీత—[కష్టముతో] అట్లే చేయుదము.

తమస—ఎట్లు పోయెదవు? ఏలన,

తే. తృష్ణచే నీదు నేత్రంబు తీఁగసాఁగి
నాటిన ట్లైనయది ప్రాణనాథు మేన;
మర్మభేదపరము లుద్యమములు గూడఁ
దిగువలేకున్న యది దాని ముగుద, యిపుడు. ౩౯

సీత—అపూర్వ పుణ్యముచేత దర్శన మిచ్చిన యార్యపుత్త్రి చరణకమలము లకు నమస్కారము. [అని మూర్ఛిల్లును.

తమస—పట్టీ, ఊఱడిల్లుము.

సీత—ఎంతసేపు మేఘాంతరమున పూర్ణిమాచంద్ర దర్శనము?

తమస—అహో సంవిధానకము!

తే. రస మొకఁడె కరుణంబె కారణవశమునఁ
బడయు భిన్నత వేర్వేర్వివర్తములను
అలలు బుడగలు సుడులును నను వికృతులు
నీ రెనసినట్టు, లది యెల్ల నీరె గాదె. ౪౦

రాము—విమానరాజ, ఇటు ఇటు.

[అందఱు లేతురు.

తమసా వాసంతులు—[సీతారాములంగూర్చి]

ఆ. అవని యమరనదియు నస్మద్విధలు గూడఁ
దొలఁతఁ గవితఁ గన్న కులపతియును
అల వసిష్ఠుఁ డనుగతారుంధతీకుండు
నిత్య మంగళములు నింత్రు మీకు. ౪౧

[అని అందఱు నిష్క్రమింతురు.

తృతీయాంకము సమాప్తము

## మిశ్ర విష్కంభకము

---

[అంతట ఇరువురు తాపసులు ప్రవేశింతురు]

ఒకఁడు — సౌధాతకీ, నేఁడు మెండుగా సమకూర్చిన యతిథి జనులతోను, వారి సంతర్పణకొఱకు దండిగా జరుగుచున్న యారంభములతోను, వాల్మీకి భగవానులవారి యాశ్రమపదము ఎంత రమణీయముగా నున్నదో చూడు. — అట్లే గదా.—

తే. ఉష్ణ మధురంబు నివ్వరి యోదనంపు
గంజి పీపూఁటబాలెంత కాంత మున్ను
త్రాగఁగా వేచి మిగిలినదానఁ ద్రాగు
నాశ్రమ మృగంబు తాను బర్యాప్తిగాఁగ. ౧

మఱియు.—

తే. నేతి వంటకమునునుండి విగురుచున్న
వలపు సనసన్నముగఁ దోడు కలపికొనఁగ,
తేఁగుఁబండులతోడి మిశ్రీకృతంపు
శాకపుం బాకపుం దావి సాగు దవ్వు. ౨

సౌధాతకి — నేఁడు నరపమీసగడ్డాలగాళ్లకే సవిశేషమైన యనధ్యాయ కారణం వచ్చింది.

ప్రథముఁడు — [విహసించి] ఓరి సౌధాతకీ, నీ కేవా పెద్దలయందు గౌరవము అపూర్వముగా నున్నదిరా!

సౌధా — ఒయ్యోవు భాండాయనా, ఈ పెద్ద ముసళ్ల ఏడాగుడు నాయకుడుగా ఇప్పుడు వచ్చారే నారమడిధారి, అతని పే రేమోయి?

భాండాయనుఁడు — ఛీ! చాలింపు ఎగతాళి. ఎఱుఁగవా ఋష్యశృంగాశ్రమమునుండి అరుంధతీ పురస్కృతలను దశరథ మహారాజ భార్యలను తోడ్కొని భగవానులు వసిష్ఠులవారు వచ్చియున్నా రని? అట్లుండ ఏమి యిట్లు ప్రేలెదవు?

సౌధా — ఊ! వసిష్ఠుడా?

భాండా — అవును.

సౌధా — నే ననుకొన్నాను పులో తోడేలో అని.

భాండా — ఆ! ఆ! ఏ మంటివి?

సౌధా — ఆయనగారు వచ్చి రాకముందే పాపం! ఆ కల్యాణిని కపిలని మడ మూత నవిలి గుటకాయస్వాహా చేశారే!

భాండా—"మధుపర్కము మాంసముతోడిది" అను వేదమును ప్రమాణీకరించి శ్రోత్రియునికి అభ్యాగతునికి కొదమపెయ్యను గాని ఆంబోతును గాని చింబోతును గాని గృహస్థులు పెట్టుదురు." అని ధర్మసూత్రకారులు పఠింతురు.

సౌధా—ఓయి, ఓడినావు.

భాండా—ఎట్లు?

సౌధా—ఎట్లా? వసిష్ఠమిత్రులు రాగానే కొదమపెయ్యని కోసినారుగదా, మరి నేడే వచ్చిన ఆ రాజర్షికి భగవంతుడు వాల్మీకి పెరుగు తేనెలతో మాత్రమే మధుపర్కం పెట్టినాడు, కొదమపెయ్యని చంపలేదు.

భాండా—మాంసము వదలివైచినవారికి ఈ కల్పమును ఋషులు అవలంబింతురు. ఆ మహనీయుఁడు జనకుఁడు మాంసమును వదలినవాఁడు.

సౌధా—ఎందుకు వదలినాడు?

భాండా—ఆయన సీతాదేవికి కలిగిన దైవదుర్విపాకమును విన్నప్పుడే వైఖానసవ్రతము గైకొన్నాఁడు. అది మొదలు, చంద్రద్వీప తపోవనములో ఇన్ని సంవత్సరములు తపస్సు గావించినాఁడు,

సౌధా!—అక్కడినుంచి ఎందుకు వచ్చాడు?

భాండా—చిరకాల ప్రియమిత్రుని వాల్మీకిని చూచుటకు.

సౌధా—వియ్యపురాల్ని ఈయన దర్శించినాడా లేదా?

భాండా—ఇప్పుడే వసిష్ఠ భగవంతులు కౌసల్యాదేవికి అరుంధతీ భగవతిచే చెప్పి పంపినారు:—"స్వయముగా పోయి వైదేహుని దర్శింపవలసినది" అని.

సౌధా—మరి యీ ముదుసలులు ఒకరితో ఒకరు కలుసుకొన్నట్లే మనమున్ను వటువులతో గూడుకొని అనధ్యాయ మహోత్సవాన్ని ఆటలచే వెళ్ళబుచ్చుదాము.

[అని పరిక్రమింతురు.

భాండా—ఇదిగో ఆ బ్రహ్మవాది పురాణరాజర్షి జనకుఁడు వాల్మీకిని వసిష్ఠుని ఉపాసించి యిపుడు ఆశ్రమమునకు వెలుపల చెట్టు మొదట కూర్చున్నాఁడు; ఈయన,—

తే. మానసములోన నిత్యత నూనినట్టి
భూసుతాశోకమునఁ జేసి పొగలుచుండు,
లోనఁ గార్చిచ్చు పర్వ ననూనగరిమఁ
గాలుచుండెడు జీర్ణ వృక్షంబు వోలె.

[నిష్క్రమింతురు.

మిశ్ర విష్కంభకము సమాప్తము

# చతుర్థాంకము

[ అంతట జనకుఁడు ప్రవేశించును ]

జనకుఁడు.—

శా. ఘోర ప్రక్రియ వైశసం బడి సుతం గ్రుంకించి నాగుండియున్
స్ఫారంబై కదు వ్రచ్చి క్రొచ్చి యటఁ బెల్చన్ నాటె నేశోకమున్,
ధారావాహి పటిష్ఠమై యది చిరత్నం బయ్యె నూత్నంబు నా
హోరాహోరిగ ఉంపకోఁతవలెఁ గోయున్ నాదు మర్మంబులన్. ౧

అయ్యో! ఇసీ! ఇట్లు ముదిమిచేతను ఓర్వరాని దుఃఖముచేతను పైగా పరాక సాంతపన ప్రభృతి తపస్సుచేతను ధాతువులు శోషించి యెందులకుం గొఱగాని యీ పాడు దేహము ఇప్పటికిని కూలి పోక యున్నది! ఆత్మఘాతులు అసుర్యము అను పేరి యంధతామిస్రలోకములందుఁ గూలుదు రని ఋషులు తలంతురు. ఎన్ని వత్సరములు గడచినను నిరంతర పరిభావనచేత స్పష్టప్రకాశమై నా దుఃఖాతిరేకము క్రొత్తదియుం బోలె శమింపకున్నది! హా తల్లీ దేవయజనసంభూతురాలా, సీతా! నీ నిర్మాణ భాగ్యము కట్టా! లజ్జచే స్వచ్ఛందముగా ఏడ్చుటకేని శక్యము కాని యిట్టిదిగా పరిణమించినది, హా హా పుత్త్రి!

తే. అనియత స్మిత రుదిత మై హవణుమీఱు
కొలఁది పలుగ్రొన్ననల కొనల్ వెలయుదావి
స్ఖలదసంగత మంజుల జల్పితమును
నీ నిసుఁగుమోము లేఁదమ్మి నే స్మరింతు. ౨

భగవతీ, వసుంధరా! నీవు నిజముగా అతిదృఢవు సుమా!

ఉ. ఈ పనయిం దరుంధతి మునీంద్రులు గంగ యెవర్తె పేర్మికిన్
పావకులో, య దేల, రఘువంశగురుం డగుప్రొద్దె సాక్షియో,
యీవ యెవర్తె విద్యసుఁ బ్రదయింబలెఁ గంటివొ, ఖ్యాతశుద్ధికే
యీవిలయంబు వట్టిసుతకే యెటు దారుణురాల యోర్చితో! ౩

[ నేపథ్యమున ]

ఇటు ఇటు భగవతీ మహాదేవులు

జన.—[చూచి] అహో! గృష్టి అరుంధతీభగవతికి దారి చూపుచున్నాఁడు. [తలచి] మతి యెవరిని మహాదేవి యని పిలిచినాఁడు? [నిరూపించి] హా! ఏమి! మహా

రాజ దశరథుని ధర్మపత్ని, నా ప్రియసఖి కౌసల్య! ఆమెయే యీమె యని ఎవఁడు ఆనవాలు పట్టఁగలఁడు!

తే. సిరికరణి దశరథునింటఁ జెలఁగె నీమె
కరణి యన నేల? లెస్సయౌ సిరియ యనుటె;
అట్టి యీమె విధివశాన నైన దేదొ
శోకమయ మూర్త; మేమి విపాక మహహ!

ఇది పాపమయిన మఱియొక దశావ్యత్యాసము.

క. ఆయెను మున్నే జనము న
కాయ మగు మహోత్సవంబుగా నా, కదిసె
యాయెను దుస్సహ మగపడి
గాయమునం గ్రుక్కినట్టి క్షారమువోలెన్.

[అంతట అరుంధతి, కౌసల్య, కంచుకియు ప్రవేశింతురు]

అరుంధతి—దేవి వినుము. స్వయముగా పోయి వైదేహుని చూడవలసిన దని యిది మీ కులగురువు నాదేశము. అందులకే నన్ను పంపినారు. మఱి యేల మాటి మాటికిని ఇట్లు మిక్కిలి కొనుదివియుట?

కంచుకి—దేవీ, నా విన్నపము చిత్తగించి మనస్సు నిర్భరము చేసికొని వసిష్ఠభగవానులవారి యాదేశమును జరుపుము.

కౌసల్య—ఇట్టి కాలములో మిథిలాధిపుని చూడవలసి వచ్చె నని ఒక్కుమ్మడిగా సకల దుఃఖములును సంభవించుచున్నవి. మూలబంధనము సెల్లగిల్లుచున్న నా హృదయమును నిలువరించుకొన సమర్థను గాక యున్నాను.

అరుంధతి—ఇందు సందేహ మేమి?

తే. మానుషుల కన్గుబంధులం బాయఁ గదుర
వనట లెంతయు నంతాన వాహ లయ్యు
దిష్ట జనమును గన్నంత విముడలేక
వేల వఱ్ఱులచేఁ బోలి వెల్లివాఱుచు.

కౌసల్య—కోడలికి నా పట్టికి ఇట్లు సంభవించి యుండఁగా ఎట్లు ఆ రాజర్షి ముఖమును చూతును?

అరుంధతి—

తే. ఇతఁడె మీమేటి సంబంధి యార్యయతుఁడు
జనకవంశప్రభావ సంస్థాపకుండు,
ఈయనకు యాజ్ఞవల్క్య మునీంద్రుఁ డొసఁగె
బ్రాఁతి యైనట్టి బ్రహ్మ పారాయణంబు. ౭

కౌసల్య—ఈయన మహారాజనకు హృదయానందుఁడు, పట్టికోడలి తండ్రి, రాజర్షి. హా కట్టా, మహోత్సవ పరంపరతోడి యా దినములందు ఈయనతో సంభావిత నైతిని. హా దైవమా! అవి యెల్లను లేదాయె.

జన—[సమీపించి] భగవతీ, అరుంధతీ వైదేహుఁడు సీరధ్వజుఁడు అభివాదన మొనర్చుచున్నాఁడు.

ఉ. నీవలనం బవిత్రునిఁగ నీపతి తన్నరయుఁగ మహామహః
పావను లైన పూర్వ గురువర్యుల కెల్ల గురుండు దాన యై,
దేవి నుషం బలెఁగ భగవతిఁగ భువనత్రయ మంగళావహఁగ
భావిహితాత్మహాళి నయి మ్రొక్కెద దేవి యరుంధతీ నినుఁగ. ౮

అరుం—అక్షరమైన జ్యోతి నీకు ప్రకాశించును గాక, ఈ తపించుచున్న దేవుఁడు పరోరజసుఁడు నిన్ను పవిత్రుం జేయుఁగాత.

జన—ఆర్యా. సృష్టి, ప్రజాపాలుని తల్లి! ఈమెకు అనామయముగదా?

కంచు—[స్వగతము] నిరతిశయముగాను అతినిష్ఠురముగాను మర్మము గాఁ దూఁబడితిమి. [ప్రకాశము] రాజర్షీ, ఈ కోపముచేతనే చిరపరిత్యక్త రామచంద్ర ముఖదర్శనయై అతిదుఃఖితయై యున్న దేవిని దుఃఖపెట్టుట తగదు. రామభద్రుఁడును పౌరజానపదులు 'ఎల్లెడలను డీనత్వముఁ గింపదంతెని పర్వంచుచు అల్పబుద్ధులు అగ్నిశుద్ధిని నమ్మరైరి గదా' యను హేతువుచే దారుణకృత్యము గావించినాఁడు.

జన—[కోపముతో] ఆ! అగ్ని యనఁగా నెవఁడు నా ప్రసూతిని పరిశోధించుటకు? కట్టా! రామపరిభూతుల మయ్యును ఇట్లు పలుకుజనులచే మరల పరిభూతుల మగుచున్నాము.

అరుం—[నిశ్వసించి] ఇట్లే ఇది. నా పట్టినెడ అగ్ని యను లఘువు అక్షరములు, సీత యనుటయే చాలును. హా! పట్టీ,

చ. తనయవొ శిష్యవో తనకు, దాపన యుండఁగనిమ్ము; నీదు పా
వనతరశుద్ధి పెంపు దృఢభక్తిని నీయెడఁ నాకుఁ గొల్పెఁ బో.

చినవయ సంట! యింత వఁట! సీతరో, వంధ్యవ యీ త్రిలోకికి౯;
గొనములె పూజకుం బద మగు౯, గొలగావు వయస్సు, లింగము౯. ౯

కౌస — అహో! వేదనలు రేఁగుచున్నవి! [అని మూర్ఛిల్లును.
జన — హా! ఇ దేమి?
అరుం — రాజర్షి, యిదేమి?

ఉ. ధూరమణుం డతం, డలప్రమోదము, లాశలు, లాదినంబులు౯,
స్మారిత మయ్యెఁ గూర్మిసఖి సర్వము విన్గన; దానఁజేసి యీ
ఘోరవిపాకమందు ధృతిఁ గోల్పడి నీసఖి మున్గె మూర్ఛలో;
నాయలమానసంబు సుమసస్సుకుమారము గాదె యారయ౯. ౧౦

జన — అయ్యో అయ్యో. ఎల్లరకలను నేను క్రూరుఁడ నైతిని; ఏలన నేను చిరకాలమునకుం గనఁబడిన ప్రియమిత్రుని ప్రియభార్యను మైత్రితో చూడనైతిని.

ఉ. ఆయన దొడ్డవియ్యి. మతఁడౌఁ బ్రియమిత్రుఁ, డతండె స్వాంతమౌ,
నాయన రూపి హర్షము, సమస్తమునుం బురుషార్థ మాతఁడే,
మై యగు. జీవ మౌఁ, బ్రియతమం బెది యంతటికన్న నద్ది యౌ.
నేయది నాకు శ్రీలుఁడు మహీంద్రుఁడు పంక్తిరథుండు గాఁడహో! ౧౧

అకటా! ఈమెయే యీ కౌసల్య!

చ. అరిదిగ నీమెకైనఁ బతికైన మహాంశున దోస మయ్యె నే,
విరువు రొకళ్ళొకళ్ళవయి నెగ్గులు పెప్పఁగఁ బాత్ర మేనె కా.
సరసత వంతఁ గివ్వకుఁ బ్రసన్నతకు న్మతి కర్తి నేన, హా!
స్మరణ మ దేల వచ్చినది! మాద్భఁ దొడంగిన దర్శి దెందము౯. ౧౨

అరుం — హా కష్టము! ఈమె హృదయము చాలసేపు శ్వాసము నిల్చిపోయినందున కఠిన మైయున్నది.
జన — హా ప్రియసఖీ! [అని కమండలూదకముతో తడుపును.

ఆ. తొలుత నెయ్యకరణి బలుసుఖ మిచ్చుచు
నేకతానముగను హితము సేయు
విడప హేతుహీన విద్వేష ఘోర మై
విధి మనోగదంబు పెట్టు బిట్టు. ౧౩

కౌస—[చేతనం బొంది] హా పట్టీ జానకీ! ఎచట నున్నావు? పెండ్లికళ గొప్పతోడనై శుద్ధమైన మందహాసాంకురములచే మనోహరమయిన నీ ముఖపుండరీకము కన్నుల యెదుటఁ దోఁచుచున్నది. బిడ్డా, వెన్నెలనిగ్గులు వెదచల్లెడు సుందరాంగకములతో మరల నాయొడి నలంకరింపవె. ఎప్పుడును మహారాజు చెప్పుచుండును 'ఈమె రఘువంశ మహాత్తరులకు కోడలేగాని మనకన్నచో జనకరాజ సంబంధముచేత కూఁతురే' అని.

కంచు—దేవి యన్నట్లే.

తే. ఏవురైనను బిడ్డలు భూవరునకు
వల్లభుఁడు మీసరముగ సుబాహురిపుఁడు.
అట్లె నల్వురు వధువులయందు సీత
యమసుత కాంతవలె ప్రియ యయ్యెఁ గరము. ౧౪

జన—హా! ప్రియసఖుఁడా, దశరథ మహారాజా! ఇట్లు నీవు సర్వప్రకార హృదయంగముఁడ వై యుంటివి, నిన్నెట్లు మఱవ నేర్తును?

మ. వరు వాప్తవ్రజముగా వధూపితలు సంభావింతు: రాదొడ్డయా
దర మీవియ్యమునందు నయ్యె విపరీతం, బీవె నగ్గాల్పుటల్;
హరియించె న్నినుఁ గాల మట్టివి. హృతం బావియ్యపుప్పీజ; మా
వరకాళీంజగానఁ బాపతతినో నాజీవితం బిప్పిరో। ౧౫

కౌస—హా హా, జానకీ! ఏమి చేయుదును! గట్టి వజ్రలేపముచే నంటుకొని బందవ గొన్నదియుంబోలె నా పాడు జీవితము మందభాగ్యను నన్ను వీడకున్నది!

అరుం—ఊఱడిల్లుము రాజపుత్త్రి! తాపములను గూడ నడుమ నడుమ ఆఁపుకొనవలసినదే. అదిగాక మఱచితివా ఋష్యశృంగాశ్రమములో మా కులగురువు చెప్పిన దానిని? అది రానేవచ్చినది. మఱి మేలొసంగఁ గలదు.

కౌస—భగవతీ, ఆశ యుడిగిపోయినది.

అరుం—అట్లైన నది అసత్యమని తలంతువా రాజపుత్త్రి, క్షత్త్రియా దాని నొండుగా భావింపఁ దగదు. అది తప్పక జరుగునదే.

తే. జ్యోతి యావిర్భవించిన యుర్విసురుల
వాక్కులందు వికల్పంబు వలదు పేయ;
వీరివాక్కున శుభ లక్ష్మి వెలయుచుండు;
విప్లవము చెంద వెందును వీరిమురులు। ౧౬

[నేపథ్యమున కలకలధ్వని] [అందఱును విందురు.

జన — నేడు శిష్టానధ్యయన మని అడ్డులేక ఆడుకొనుచున్న వటువుల కోలాహల మిది.

కౌస — పవిత్రవనమున సౌఖ్యము సులభము. [నిరూపించి] అహో వీరి నడుమ ఎవఁడు వీఁడు రామభద్ర లక్ష్మీ పరిశోభితములై ఉదార ముగ్ధ లలితము లైన యవయవములచే మా కన్నులను చల్లఁజేయుచున్నాఁడు?

అరుం — [ఆనంద బాష్పములతో, స్వగతము] ఇది కదా భాగీరథి నివేదించిన యాకగ్నామృతము. ఇది మాత్రము తెలియకున్నది, ఆయుష్మంతులు కుశలవు లలో ఇతఁ డెవరో, అని,

జన —

మ. సరసేందీవర మాత్మపత్త్రి మసృణ శ్యామాంగుఁడుగా, గాకప
క్షరమా శోభిముఖుండుఁ, బుణ్య రుచిరజ్యా న్యాణ వాహీకుఁడుగా:
మరంగా శైశవ మొందినాఁడు రఘువంశస్వామి నాపట్టి నా
నెరపుగా దోఁచినమాత్ర వీఁ డెవఁడొ నానేత్రంబులందుగా సుధగా. ౧౩

కంచు — ఈ బాలుఁడు క్షత్త్రియ బ్రహ్మచారి యని తలంచెదను.

జన — అది సరియే. ఏలన:—

మ. ఇరుమైఁ గంకపతత్త్రి చుంబిత శిఖై శైశోమధిగా వీఁ పుఙ్ఖగా,
ఉరముగా రుర్వజినో త్తరీయముఁ బవిత్రోద్భాసి భస్మాంకముగా,
పరిసందానిత మౌర్వ మేఖల మధోవస్త్రంబు మాంజిష్ఠముగా,
కరమందు వ్రీలు రావికోల వలయాకల్పాత్తసూత్త్రింబునుగా. ౧౪

భగవతి అరుంధతీ, ఈ బాలుఁ డెవ్వరి సుతుఁ డని తలంచెదవు?

అరుం — మేము ఇప్పుడే వచ్చినాము.

జన — ఆర్య గృష్టి, నాకు కడుం గుతూహలముగా నున్నది. కావున పోయి వాల్మీకి భగవానుచే అడిగి రమ్ము. ఈ బాలునితోనుం జెప్పుము — 'వీ రెవరో వృద్ధులు నిన్నుఁ జూడఁగోరుచున్నారు' అని.

కంచు — నీ యాజ్ఞ. [అని నిష్క్రమించును.

కౌస — అట్లు చెప్పిన వచ్చు ననియెదరా?

అరుం — ఇట్టి నిర్మాణమునకు మంచి నడవడి తప్పునా?

కౌస — ఆహా! ఏమి! గృష్టి వచనమును వినయముతో విని ఆ బాలుఁడు బుషికుమారులను వదలి ఇటు ముఖంబై వచ్చుచున్నాఁడు.

జన — [చాల సేపు నిర్వర్ణించి] అహో ఇదేమో గాని!

చ. వినయ శిశుత్వ మౌగ్ధ్య పరివేశల నా మహిమాతిరేకమున్
గనుదురు వీనియందు సరిగాఁగ విదగ్ధులు, గానలే రొరుల్.
కనఁబడి వీఁ డమోహము నకంప్రమునే హరియించె నామదిన్,
ఘనబల మొప్పు విస్ము నలికం బగు చుంబక ఖండమున్ బలెన్. ౧౯

లవుఁడు—[ప్రవేశించి, స్వగతము] అజ్ఞాత నామక్రమగోత్రులగు పూజ్యులకే అయినను ఎట్లు అభివాదనము చేయుదును? [ఆలోచించి] ఇది మతి యవిరుద్ధమైన పద్ధతి యని పెద్దలవలన వినియున్నాఁడ. [వినయముతో సమీపించి] ఇదె మీకు లవుని యాదరలతో ప్రణామ పర్యాయము.

అరుంధతీ జనకులు—కల్యాణుఁడా! ఆయుష్మంతుఁడవు కమ్ము.

కౌస—బిడ్డా, చిరకాలము జీవింపుము.

అరుం—రా రమ్ము పట్టీ [అని లవుని ఒడిలో కూర్చుండఁబెట్టుకొని, అపవారించి] ఆహా! ఒడిమాత్రమే గాక చిరకాలమునకు నా మనోరథముకూడ సంపూర్ణమయినది.

కౌస—బాలక, ఇటకును కొంచెము రమ్ము [అని రొమ్మున నిడుకొని] అహో అలంతిగ విరియుచున్న నల్లగలువవలె శ్యామలోజ్జ్వలమైన దేహబంధంబుచేతనే గాక తామర యాకరులను గ్రసించి మధురకంఠమైన రాజమరాళంపు నినాదమువోలె దీర్ఘ దీర్ఘంబైన స్వరముచేత సయితము ఈ నిసుఁగు రామభద్రునిం బోలుచున్నాఁడు. వీని శరీర స్పర్శయు రామభద్రుని శరీర స్పర్శవలెనే నిండార విరసిన పుండరీకపు లోపలివలె మృదువుగా నున్నది. బిడ్డా, నీ ముఖచంద్రుని చూచెదను [గడ్డ మెత్తి సబాష్పాకూతముగా] రాజర్షీ, కంటివా? నిపుణముగాఁ బరికించిన ఈ శిశువు ముఖము నిశ్చయముగా కోడలి ముఖచంద్రునిం బోలియున్నది,

జన—కంటిని సఖీ, కంటిని.

కౌస—అహో నా హృదయము కట్టి యెత్తినదానివలె ఏమేమొ తలంచుచు మిక్కిలి తేలిపోవుచున్నది.

జన—

ఉ. బాలయు నల్లురుం సకలభావములం బ్రతిబింబమై రసం
బాలవి రూపకాంతులు విభాసిలుఁ, బుట్టువిసీతి యల్లదే,
క్రాలుము బల్కు నట్లె, యనఘం బనుభావము వారిదే యహో,
యేలొకొ హా, విధీ, పరువు లెత్తెరి నాచలబుద్ధి పైఁ బయిన్. ౨౦

కౌస — బాలకా, నీకు తల్లి యున్నదా? మీ నాయనను స్మరింతువా?

లవు — లేదు.

కౌస — అటయిన నీ వెవ్వరివాఁడవు?

లవు — నేను వాల్మీకి భగవంతునివాఁడను.

కౌస — ఓయి బాలకా, చెప్పఁదలఁచిన దానిని చక్కఁగా చెప్పుము.

లవు — నాకు ఇంతయే యెఱుక.

[నేపథ్యమున]

ఓహో సైనికులారా, కుమారుఁడు చంద్రకేతువు ఆజ్ఞాపించుచున్నాఁడు— 'ఎవ్వరును తపోవన సమీప ప్రదేశములను అతిక్రమింపఁగూడదు,' అని.

అరుంధతీ జనకులు — మేధ్యాశ్వ రక్షా ప్రసక్తిచే బాలుఁడు చంద్రకేతువు ఇపుడు వచ్చి చూడ నయినాఁడు. అహో పుణ్యదినము!

కౌస — వత్స లక్ష్మణుని పుత్త్రుఁడు ఆజ్ఞాపించుచున్నాఁ డని అమృతఁ జిందు సుందరములు అక్షరములు వినఁబడుచున్నవి.

లవు — ఆర్యా, ఎవ రితఁడు, చంద్రకేతుఁడు?

జన — దశరథ పుత్త్రులను రామ లక్ష్మణులను ఎఱుఁగుదువా?

లవు — ఎఱుఁగ కేమి? వారే రామాయణ కథా పురుషులు.

జన — అటయిన నిది యెఱుఁగమి యెట్లు? ఆ లక్ష్మణుని కుమారుఁడు ఇతఁడు చంద్రకేతుఁడు.

లవు — అటయిన నితఁడు ఊర్మిళ కొమరుఁడు మిథిలాపతికి రాజర్షికి దౌహిత్రుఁడు.

అరుం — [నవ్వి] కుమారుఁడు కథాప్రావీణ్యమును తెలిఁపుచ్చినాఁడు.

జన — నీ విట్లు కథయందు ప్రవీణుఁడ వని, మతి యడిగెదను చెప్పుము; ఆ దశరథ పుత్త్రులకు ఏయే పేరుల యపత్యములు ఏయే భార్యలయందు జనించినారు?

లవు — ఈ కథాంశము మేము గాని ఇతరులు గాని విన్నది గాదు.

జన — ఏమి? కవి రచింపలేదా?

లవు — రచించినాఁడు గాని ప్రకటింపలేదు. అందులో నొక సందర్భమున ఏదో యొక భాగమును రసోత్కటముగ అభినయార్హముగా రచించినాఁడు. దానిని భగవంతుఁడు వాల్మీకి తనచేతితో స్వయముగా లిఖించి నృత్త గీత వాద్య ప్రయోగ సూత్రధారునికి భరతమునికి పంపినాఁడు.

జన — ఎందులకు?

లవు — ఆ భగవంతుఁడు దానిని అప్సరలచేత ఆడించుటకుఁ గాను.

జన — ఇదంతయు మాకు ఆశ్చర్యముగా నున్నది.

లవు — సుగృహీత నామధేయుఁడగు వాల్మీకి భగవంతునికి దానియందు ఆస్థ కడు వొడ్డది. కావుననే ఏ శిష్యులచేత నిచ్చి ఆ పుస్తకమును భరతాశ్రమమునకుం బంపినాఁడో, వారికి తోడుగా ప్రమాదోచ్ఛేదనమునకై ధనుష్పాణిని నా భ్రాతను పంపినాఁడు.

కౌస — నీకు భ్రాతకూడఁ ఉన్నాఁడా?

లవు — ఉన్నాఁడు, ఆర్యుఁడు కుశుఁ డని పేరు.

కౌస — నీవు జ్యేష్ఠుఁ డని చెప్పిన ట్లయినది.

లవు — అవును, పుట్టుక క్రమములో ఆయన పెద్దవాఁడు.

జన — ఏమి ఆయుష్మంతులు కవలా?

లవు — అవును.

జన — వత్సా, చెప్పుము, ప్రకటించిన కథాభాగము ఎంతదనుక వచ్చినది?

లవు — వట్టి పౌరాపవాదమునకు జడిసి రాజా వెడలనడిచినదానిని దేవయాజన సంభూతను సీతాదేవిని ఆసన్న ప్రసవవేదనచే ఒంటిదానినిగా అడవిలో వదలి లక్ష్మణుఁడు మరలిపోయెను.—అన్నంతదనుక.

కౌస — హా! వత్సే! ముగ్ధా చంద్రముఖీ! ఇప్పుడు ఏకాకినైన నీసు మైపువ్వమునకు ఎట్టి దైవదుర్విలాస విపాకము సంభవించినదో!

జన — హా బిడ్డా!

మ. నవ ఘోరాభిభవంబునుం బొరసి, వెంటన్ గానుపుంబ్రొద్దు సం
భవమై, నోవులు తల్లడం బిడఁగఁ, గ్రవ్యగ్రాపి సంఘంబులన్
దవిరుల్ సుట్టఁగ, భీత వై విజము నాపట్టి 'నను గావు కా
వవె నా నాయన' యంచు నన్నుఁ దలఁచుచున్ బల్మాఱు వాపోయితే. ౨౧

లవు — [అరుంధతిం గూర్చి] అమ్మా, వీ రెవరు?

అరుం — ఈమె కౌసల్య. ఈయన జనకుఁడు.

[లవుఁడు బహుమాన ఖేదకౌతుకములతో కాంచును.

జన — అహో దురాత్ములైన పౌరుల కరుఁణేమి! అహో రాజా రాముఁడు తొందరపడుట!

శా. ఈ విశసాశని ప్రహతి నెంతయు నోరియ; వాత్రుధాగ్నికిన్
సావి యిదే భగాఱ మని శాపమొ చాపమొ పూని మందఁగాఁగాఁ:

కౌస — భగవతీ, రక్షింపు రక్షింపు, సముదాయింపుము కుపితుని రాజర్షిని.

అరుం___

తే. మానఘనుం గదే యవమానితులకుఁ
బ్రాజ్ఞ సమ్మత మగునట్టి పాచితంబు;
రాజ, నీ పట్టి కాఁడె శ్రీరాముఁ డనఁగ?
పాలనీయులు గారె కృపణులు ప్రజలు? ౨౨

జన___

కా వవి రాముపై, నతఁడు గాఁడె మదాత్మజ ఘాంధ? మాదటన్
బ్రోవక తప్పునే ద్విజవి పోత జర ద్వికలాబలా తతిన్? ౨౩

వటువులు—[సంభ్రమంబునం బ్రవేశించి] కుమార కుమార! గుఱ్ఱము గుఱ్ఱమని ఒక భూత విశేషము జనపదములలో నుండు నని విందుముగదా, అది యిప్పుడు మనకడకు ప్రత్యక్షముగా వచ్చియున్నది!

లవు—గుఱ్ఱమని పశుశాస్త్రమందే గాక సంగ్రామశాస్త్రమునంను గూడఁ బఠితము. మఱి చెప్పుఁడు దాని స్వరూపమును.

వటు—వినుము.

మ. వెనుక నోఁకను దాల్చి తిప్పుఁగ, సదా వే దాని నాడించెడిన్,
మొనయున్ దీర్ఘముగాఁగఁ గంఠము, ఖురంబు లాఱికి న్నాల్గె సూ,
తిను లేఁదచ్చికి, నాౘమమాత్రములుగా దించున్ శకృత్పిండముల్
చను దూర మ్మది, యేల వర్ణన? కనన్ జన్దెమ్ము, రా, రా, వెసన్. ౨౪

[అని పలికి అజినమునం జేతులనుం బట్టుకొని లాగుదురు.

లవు—[సకౌతుక కోపశోధ వినయముగా] పెద్దలారా, చూడుఁడు చూడుఁడు మీరు నన్ను లాగికొని పోవుచున్నారు. [త్వరగా పరిక్రమించును.

అరుంధతీ జనకులు—ముద్దులాఁడు కుతూహలమును రెంటెత్తుకొనుమ గాక.

కౌస—భగవతీ, వీనిం గనుచుండ జేని బ్రదుక నని తోఁచుచున్నది. కావున ఒంటెడకేఁగి చూచెదనుఁగాక అరుగుచున్న దీర్ఘాయువును.

అరుం—వాఁడు కుతూహలంబున అప్పుడే దూర మేఁగిగాఁడు. నీ కెట్లు కనఁబడును?

కంచుకి—[ప్రవేశించి] భగవంతులు వాల్మీకివారు సెలవిచ్చినారు:— "దీనిని మీరు సమయములో ఎఱింగెదరు," అని.

జన — ఇదేమో అతి గంభీరము కాఁగలదు. భగవతీ అరుంధతీ; సఖీ కౌసల్యా, ఆర్యుఁడా గృష్టీ, స్వయముగానే పోయి భగవంతుని ప్రాచేతసుని దర్శింతము.

[వృద్ధవర్గము నిష్క్రమించును.

వటు — కుమారా, ఆ వింతను జూడు.

లవు — చూచితిని, గ్రహించితిని. నిశ్చయముగా నిది అశ్వమేధపు గుఱ్ఱము.

వటు — అ దెట్లు తెలియును?

లవు — ఓరి మూర్ఖులారా, చదివితిరే మఱి ఆకాండమునందో, ఏమి చూడరా! ప్రత్యేకము నూఱుగురు కవచధరులు దండాయుధులు [illegible]వంతులును రక్షకులు: అట్టివారితో మెండుకొనుము ఈ దండు కనఁబడలేదా? నా మాట నమ్మరేని పోయి అడుగుఁడు.

వటు — ఓహోయి, ఎందులకయ్యా ఈ గుఱ్ఱము పరివారము గలదై సంచరించుచున్నది?

లవు — [ఆసతో, ఆత్మగతము] ఆహా! అశ్వమేధ మనునది విశ్వవిజయులైన క్షత్త్రియులకు స్వమహిమ ప్రఖ్యాపకము ఇతర క్షత్త్రియుల కెల్ల నవమానింమనది ఉత్కర్షము పరీక్షించు గొప్ప ఒరఁగల్లు.

[నేపథ్యమున]

తే. అశ్వ మిదె. కేతనం బిదె. యంతె గాక,
సప్త లోకైక వీరుఁడై ఖ్యాతలంబు
నదశముఖకులముగఁ జేసినట్టి దేవి
వీర వాదంపుఁ జాటింపు విశ్వమునకు. ౨౫

లవు — [వ్యథతో నుంబోలె] ఆహా! రగిలించుచున్నవి యక్షరములు!

వటు — ఏమన్నాఁడు? ప్రాజ్ఞుఁడు గదా కుమారుఁడు.

లవు — ఓహోయి, ఇట్లు పలికెదరే! పృథివిలో క్షత్త్రియులు లేరను కొన్నారా యేమి?

[నేపథ్యమున]

ఓరి! మహారాజు నెదుర క్షత్త్రియు లెవరురా?

లవు — ఛీ జాల్ములారా?

తే. ఉండురే నట్టివారు రా ముంద్రు గాక;
వింతగా నొం డి దేటి కీవెఱపుటొమ్మ?
ఏల పలుమాటు లిదె చూడుఁ, డీక్షణాన
మీ పతాకను నేను బల్మిని హరింతు. ౨౬

ఓహో! వటువులారా, పెద్దలతోఁ గొట్టి మరలింపుఁడు ఈ గుఱ్ఱమును, ఇది రోహిత మృగముల నడుమ దేదీరించుచు చరించును గాక.

పురుషుఁడు — [సక్రోధదర్పుఁడు ప్రవేశించి] ఛీ ఏమిరా యీ తుంటరితనము? ఏమి పలికితివి? ఉగ్రులు నిష్కారుణులు లెక్కకు మించినవారు ఆయుధీయులు, శిశువు పల్కినను గర్వితవాక్యమును సహింపరు, శత్రుమర్దనుఁడు రాజపుత్త్రుఁడు చంద్రకేతువు ప్రశాంతమయిన తీర్థ్య కాననమును కనం గుతూహలిత హృదయుఁడై పోయియున్నవాఁడు మరలి రాకముందే, ఈ చెట్లగుబురుదారిని త్వరితముగా పాఱిపొండి.

కలు — కుమారుఁడా, ఈ గుఱ్ఱము నీకేల మన కేల? నిన్ను ఆయుధీయ శ్రేణులు శస్త్రములు జళిపించుచు బెదరించుచున్నారు. ఇచటికి ఆశ్రమపదము దూరముగా నున్నది; కావున రమ్ము లేడి గంతులతో పాఱిపోవుదము.

లవుఁ — [నవ్వి] ఏమి శస్త్రములను జళిపింతురా! [విల్లెక్కు వెట్టును]

తే. జ్యానినద యుత్కటార్త్రి దంష్ట్రలను జట్టఁ
బ్రోద్గిరద్ఘన ఘుర్ఘుర స్ఫూర్జనంబు
అశన సక్త కాలత్కృతాంతాస్య యంత్ర
జృంభ వికటోదరము గాత మీ ధనుస్సు. ౨౮

[యథోచితము పరిక్రమించి అందఱు నిష్క్రమింతురు.

కౌసల్యాజనకయోగము

చతుర్థాంకము సమాప్తము



# పంచమాంకము

[నేపథ్యమున]

ఓహో! సైనికులారా, దొరకినది ప్రాపు మనకు! ఇదిగో!

తే. దురము విని సత్వర సుమంత్ర తున్న వల్గ
దశ్వమునఁ దేర నుత్థాత హావనములకుఁ
కోవిదారి ధ్వజంబు వ్యాఘూర్ణితముగ,
దాసటగఁ జంద్రకేతువు వచ్చె మనకు, ౧

[అంతట సుమంత్రుఁడు తోలుచున్న రథమున చాపహస్తుఁడు సాశ్చర్య హర్ష సంభ్రముఁడు చంద్రకేతుఁడు ప్రవేశించును.]

చంద్రకేతువు — ఆర్యుఁడా, సుమంత్రుఁడా, చూడు చూడు.

తే. అలఁతి కిన్కకుఁ గెంపార నాస్యలక్ష్మి,
వితత గుణ గుంజ దార్త్రి యౌ వింటిచేతఁ
గోత్రలఁ గురియుఁ బంచశిఖుండు వీఁడు
వీర పోతుండు చములపై విశిఖహిమము. ౨

తే. ఒంటి మునిజనశిశువు పైన్యోదరమున
ననధిగత రఘువంశ నవాంకుర మనఁ,
గృత్త కరికటగ్రంధి టాంకృతి సమిద్ధ
విశిఖ నియుతుండు, నాకు బ ల్వేడ్క సేయు. ౩

సుమంత్రుఁడు—ఆయుష్మంతుఁడా,

తే. అతిశయిత సుర దనుజ మహాప్రభావు
వీకె యెనరూపువాని వీ నిసుఁగుఁ గాంచి,
కుశికనందన మఖ రిపు విశసనమున,
ధనువు నెత్తిన రఘునందమని స్మరింతు. ౪

చంద్ర—ఒంటిగాని నితనిం గూర్చి పెక్కండ్రు పనివడుటం గన నా మదిలో లజ్జ పొడముచున్నది.

తే. వీని శిశు నొంటి రణధురా విస్ఫురాంశు
కందళ కరాళ శస్త్రభృద్ బృందములను
స్వర్ణ ఘంటికా ఝణఝణ త్స్యందనములు
దాన దుర్దిన గజవారిదములుఁ బొదివె. ౫

సుమం—వత్సా, వీ రందఱు మొత్తముగాఁ బయిఁగొన్నను ఇతని నేమి సేయఁ గలరు? ఒకరొకరుగా నైనచోఁ జెప్పవలయునా?

చంద్ర—ఆర్యా, త్వరగా తోలుము, త్వరగా తోలుము; ఏలన, ఇతఁడు మన యాశ్రిత జనమును మెండుగా పరిమార్పం దొడంగినాఁడు! అదె చూడు.—

మ. గిరికుంజేభము లాత్తకర్ణరుజతన్ గీపెట్టి ఘూర్ణిల్లఁగా,
గురుభేరీధ్వని పుష్టమున్ గుణ మహాఘోషంబుఁ బర్వించుచున్,
స్ఫుర దుగ్రోత్ప్లుత రుండముండములచే శూరుండు చేసెన్ గదే
పరితృప్య ల్లయకాల వక్త్రవిఘస వ్యాకీర్ణలన్ భూములన్. ౬

సుమం—[స్వగతము] ఇట్టి వీనితో నెట్లు బాలుని చంద్రకేతుని ద్వంద్వయుద్ధమున కంగీకరింతును? [ఆలోచించి] అట్లన్న నెట్లు? ఇక్ష్వాకు గృహ వృద్ధులము గదా మేము. దురము సంభవించినప్పుడు ఒందుగతి యేమి?

చంద్ర—[విస్మయ లజ్జా సంభ్రమములతో] ఇసీ ఇసీ, నా సైన్యములు అన్ని కడలను విఱిగి పాఱుచున్నవి.

సుమం—[రథవేగము నభినయించి] ఆర్యా, ఆ చెప్పినవారు ఇతని నే మని చెప్పినారు?

సుమం—లవుఁ డని.

చంద్ర—

తే. ఓలవా, యోమహాభుజ, యేల యిట్లు
సైనికులమీఁద నీకు నీసంభ్రమంబు?
నేన వచ్చితి నిదిగో నన్నే దఱియుము;
తేజము లయింపుఁ గావుతఁ దేజమందు.

సుమం—కుమారా, చూడు;—

తే. నీవు పిలిచినమాత్రఁ గ్రేణించి తిరిగెఁ
బరిని ద్రచ్చుటమాని యీ విరుదు నిసుఁగు,
ఘనరవమున కిభాళిమర్దనము మాని
పడిఁ దిరుగు దృప్త సింహకిశోరంబు వోలె.

[అంతట వడిగా నుద్ధతముగా నడచుచు లవుఁడు ప్రవేశించును.]

లవుఁడు—బలే రాజకుమారా, బలే, సత్యముగా ఐక్ష్వాకుఁడవే సుమా నీవు. ఇదే నేనును వచ్చినవాఁడనే.

[నేపథ్యమున బలు కోలాహలము]

లవు—[ఆవేగముతో మరలి] ఇసీ! విఱిగి పాఱియు మరలి వచ్చి కలనిం జొచ్చి చుట్టును ముట్టడించి సేనాపతులు నన్ను వేయుచున్నారు! చీ జాల్ములారా!

ఉ. అంతటఁ బేర్చు నీరణరసాకుల సంకుల సైన్యఘోష మ
త్యంతకరాళ మత్ప్రీతిమయం దవుతగా గబకంబు తద్ద: క

ల్పాంత మరుద్ప్రేరిత మహార్ణవ వార్లహరీ ప్రపూర ము
ద్భ్రాంత కుభృ ద్ధతిషుభిత బాడబవహ్ని శిఖాతతిఁ బలెఁ. ౯

[అని పరిక్రమించును.

చంద్ర__ఓహోయి కుమారుఁడా,

తే. ప్రియుఁడ వత్యద్భుత గుణాతిశయత, నాకు
దానఁ జెలి వౌదు, నాది యంతయును నీద,
అని యొన ర్తేమి నిజ పరిజనము మీఁద?
వోప్పిరలకషంబు చంద్రకేతుండు రమ్య. ౧౦

లవు__[హర్ష సంభ్రమములతో మరలి] మహానుభావుఁ డీ సవిత్రృవంశ కుమారుఁడు! ఆహా ప్రసన్న కర్కశ మీతని వీరవచన ప్రయోగము! కావున, వీరలతో నేమి? ఇతనినే గౌరవించెద.

[మరల నేపథ్యమున కలకలము]

లవు__[క్రోధనిర్వేదములతో] ఇసీ! ఈ పాపులు వీర సంవాదమునకు విఘ్న మాచరించుచున్న నన్ను ఖిలీకరించుచున్నారు!

[అని వారింగూర్చి నడుచును.

చంద్ర__ఆర్యా, చూడఁదగినదానిని దీనిని చూడుము;—

తే. మ్రోల నను నకుతుక దర్పమున గుఱి యిడి,
పిఱుఁద బలము లఱుము, వీఁడు వింటి నెత్తి,
తాల్చు ద్వేధా సముత్థ వాత్యా ప్రణున్న
మాఘవత చాపధర మేఘ మంజిమమును. ౧౧

సుమం__కుమారుఁడే యీతనిం జూడనైనను నేర్చును, నేను కేవలము విస్మయము చేత పరవశుఁడనై యున్నాను.

చంద్ర__ఓహో రాజులారా,—

తే. వేనవే లొంటి, రథ గజ వీతిగతులు
పత్తిఁ, గవచులు మేద్యవర్మోత్తరీయు,
ముదురువారలు లేమేని ముద్దు నిసుఁగుఁ,
బైకొనెద రిది వన్నెయే మీకు మాకు? ౧౨

లవు__[మనోవ్యథతో] ఏమి యిసీ ఇతఁడు నన్ను కనికరించెడిని! [ఆలోచించి] కానీ, కాలహరణము తప్పించుటకై జృంభకాస్త్రముచే నిపుడు సైన్యములను మ్రానుపాటొందించెద. [అని ధ్యానము నభినయించును.

సుమం—ఏమి యిది! ఉన్నట్లే ఉండి సేనాకలకలము అణఁగిపోయినది! వత్సా, కుమారుఁడు జృంభకాస్త్రము నభిమంత్రించినాఁ డని తలంచెదను.

చంద్ర—అందులకు సందేహ మేమి?

తే. తమములయు మించులయు బెడిదంపు బెనపు
కనెడు కంటిని గ్రస్తముక్తముగ నొంచు,
చిత్తరువువోలె మఱి దండు చేష్టఁ దక్కెఁ;
జృంభకాస్త్రం బజితవీర్య మేమ నిజము. ౧౩

సుమం— ఆశ్చర్య మాశ్చర్యము!

శా. పాతాళోదర సాంద్ర సంతమస గుంభ శ్యామముల్ వ్యత్తప
ప్రీతి జ్వాల కరాళ కద్రువులు పర్వెన్ జృంభకంబుల్ దివిన్
ఘాతాంతంబున నుద్ధతానిలము లున్మూలించి పైరువ్వ సం
ఖ్యాతీతాభ్రతటి త్కడారగుహ వింధ్యాగ్రంబులం బోలుచున్. ౧౪

వీనికి జృంభకాస్త్రములు ఎట్లు వచ్చియుండును?

చంద్ర—వాల్మీకి మహామునివలన నుండి యని తలంచెదను.

సుమం— వత్సా, ఈ యనవు అస్త్రములయందు వ్యవహారము లేదు, జృంభకములయందు బాత్తిగా లేదు. ఎట్లన;—

తే. ఇవి యపత్యంబులు భృశాశ్వ ఋషికిఁ జూవె;
అతని నుండియె గాధేయు నధిగమించె
నంత నాతని సంప్రదాయంబువలన
రామభద్రునియందుఁ దిరంబు లయ్యె. ౧౫

చంద్ర—ఇతరులు గూడ మేటిమూర్తులుగా పెరుఁగుచుండు సత్త్వ ప్రకాశములచే విరాజిల్లువారు, మంత్రద్రష్టలు స్వయముగా కందురు.

సుమం—వత్సా, హెచ్చరికగా నుండుము ప్రవీరుఁడు వచ్చినాఁడు!

కుమా—[ఒం డొరులం గూర్చి] ఆహా! ప్రియదర్శనుఁడు కుమారుఁడు! [స్నేహానురాగములతో కాంచి]

ఉ. అతత సద్గుణోచ్ఛ్రియమొ హారి మిథోవచన ప్రభావమో,
భూతజని ప్రసిద్ధ దృఢమూత మనఃస్థ చిరత్న మైత్రియో,
ఖ్యాతము గాక యుండ విధి యాఁచిన చేరువ బంధుభావమో
యీతనిఁ గాంచినంత రచియించెఁ దదేకమయంబు నామదిన్. ౧౬

సుమం — ప్రాయికముగా ఇది జీవిధర్మము, ఏదన — ఒక్కొక్కనియందు రసమయంబగు ప్రీతి జనించుట. దీనిచే లౌకికులు తారామైత్రమనియు చక్షూరాగమనియు వ్యవహరింతురు. దానిని శ్రోతస్సైకరాని ప్రమాణముగా పెద్దలు వక్కాణింతురు,

తే. హేతుశూన్యం బయిన పక్షపాతమునకుఁ
గలుగ దెట్టకునే భంగకారణంబు
స్నేహమయతంతు వయ్యది చెదరనీక
లోని మర్మాళిఁ గుట్టు ననూనపటిమ. ౧౭

కుమారులు — [ఒండొరులం గూర్చి]

తే. మెఱుఁగిడిన రాజపట్టంపుమించు మించు
నీ వపువు నంపగములతో నెట్లు నొంతు?
ఇది దొరకినంతఁ బరిరంభణేచ్ఛచేతఁ
బులక నిబికీన మయ్యె నామూర్తి యెల్ల. ౧౮

ఉ. కైదువు నెత్త కేకరణిఁ గ్రాంత పరాక్రమ ముట్టఁగా నగుఁగా?
గైదువె యాత్మ గోచరముకాని ప్రవీరువిమీఁద నేఁటి కో?
కైదువు గొన్నవీవి కనిఁ గాక తొలంగిన పీఁడె యే మనుఁగా?
హా! దవు సేయు వీరసమయంపురసోద్ధతి స్నేహమార్గముఁగా. ౧౯

సుమం — [లవునిఁ గాంచి, సబాష్పము ఆత్మగతము] హృదయమా! ఏమి వేఱు తెఱఁగున వికల్పించెదవు!

తే. ఎది మనోరథముల కెల్ల దా బీజంబొ,
దైవ మాదిలోనె దానిఁ గొనియె,
తీవఁ గమిచి మున్ను తెమలించి వైచినఁ
బూపుమొగ్గ యెట్లు పొడముఁబిదప. ౨౦

చంద్ర — ఆర్యా సుమంత్రుఁడా, తేరు దిగిరెదను.

సుమం — ఎందుల కట్లు చేసెదవు?

చంద్ర — ఏల యన నీ వీరపురుషుఁడు దానం బూజితుఁ డగును. అదియుంగాక ఆర్యా, క్షత్త్రియధర్మంబును పరిపాలితం బగును: — "రథస్థులు పాదచారునితో పోరరు" అని గదా శాస్త్రజ్ఞులు పల్కుదురు.

సుమం — [ఆత్మగతము] అయ్యో నాకు కష్టము సంభవించినది.

తే. న్యాయ్య మైనయట్టి యాచారమున కెట్లు
హదన నన్నుఁబోఁటి యడ్డువెట్టు?
అట్లు పేయఁ గొందె ననుమతించెదు నెట్లు
సాహసైకరసవశంపుఁ గ్రియకు? ౨౧

చంద్ర—మా నాయనగారు కూడ వారి నాయనగారి సఖుని ధర్మసంశయములయందు ఆర్యునే అడుగుదురే, అట్లుండ ఏల ఆర్యా ఆలోచించెదవు?

సుమం—ఆయుష్మంతుఁడా, ధర్మసమ్మతముగా నే నీవు సమకట్టితివి.

క. ఇది సంగ్రామ న్యాయం,
బిది సూవె సనాతనంపు టీడిత ధర్మం,
బిది పౌరుష చారిత్రపుఁ
బదవి సుమా యనయము రఘుపంచాస్యులకుఁగా. ౨౨

చంద్ర—ఆర్యుని వచనము సాటి లేనిది.

క. ఇతిహాసంబు పురాణము
శ్రుతిస్మృతి ప్రోక్త ధర్మసూక్ష్మ క్రమముల్
మతిలో ననయము మీకే
స్థితిఁ గొనును రఘుప్రవరుల స్థితితోఁ గూడఁగా. ౨౩

సుమం—[స్నేహముతోఁ గవుంగిలించి]

తే. నిన్న మొన్నటి విసుఁగె తా మన్నిగొనియో,
నీజనకుఁ డింద్రజిత్తునే: నేఁటి కతని
పట్టివి ప్రవీర వృత్తంబు పట్టి తీవు;
బాపు దశరథకుల మొందెఁ బో ప్రతిష్ఠ! ౨౪

చంద్ర—[కష్టములో]

తే. ఇనకుల జ్యేష్ఠుఁడు ప్రతిష్ఠ నెనయ కుండ
మాకులమునఁ బ్రతిష్ఠ యన్మాట యేద!
నని యలందురుచుందురే యాత్మలందు
మాన కితరులు మువ్వురు మాజనకులు. ౨౫

సుమం—చంద్రకేతుని యీ వచనములు హృదయ మర్మములను విదారించుచున్నవి!

**లవు__అహో! రసము మిశ్రీభూతముగా నున్నది!**

మ. నెలను విభావితాన మహనీయుఁ గుముద్వతి యెట్లొ యట్లె యీ
చెలువుని నాదృష్టి దరిపించి ముదంబుధి నోలలాడెడిన్;
కలిత ఘుణత్క్రియా క్వణిత కార్ముక మీభుజ మన్ననో సము
జ్జ్వలిత కరాళి తోల్పణరసం బనయం బవిక్షేపియింపదున్. ౨౬

చంద్ర__[దిగుచు] ఆర్య, సావిత్రుఁడను చంద్రకేతుఁడను అభివాదనము చేయుచున్నాను.

సుమం__

తే. అజిత మూర్ధస్వి పుణ్యంబు నైన తేజు
నీకునుం దొల్లిటి కకుత్థ్సునికివి బోలె
కొఱవడవి శ్రేయములకుఁగాఁ గూర్పుఁగాత
శాశ్వతుఁడు కిటివేల్పు ప్రసన్నుఁ డగుచు. ౨౭

మఱియు__

సీ. త్రయ్యాత్మ దేవుండు త్వద్గోత్రకందంబు
సవిత గాచుత నిన్ను బవరమందు,
గురుఁడు నీకును నీదు గురులకు నైత మా
శీర్వదించుత నిన్ వసిష్ఠమౌని,
వార్ధ్రశ్రవసములు వైనతేయంబులు
సామీరణములు వైశ్వానరములు
ప్రాచేతసములు నౌ బలపరాక్రమములు
నీయందుఁ దిరములై నెగడుఁగాక,

తే. అన్నిటికి హెచ్చుగా నీకు నచ్చుఁగాత
జయము శ్రీరామ లక్ష్మణ శయవిహారి
చాపశింజినిఁ బుట్టి రక్షఃపరిబృఢు
మానస మగల్చు ఠంకార మంత్రఘోష. ౨౮

**లవు__కుమారా, నీవు రథమందుండిననే మిక్కిలి శోభించెదవు. కలదు, అత్యాదరము కలదు.**

చంద్ర—అటయిన మహాభాగుఁడు కేల్బొందు రథము నలంకరించుఁగావుత.

లవు—ఆర్యా, తే రక్కింపుము రాజపుత్త్రిని.

సుమం—నీవును చంద్రకేతుని వచనము నంగీకరింపుము.

లవు—నిజోపకరణముల నుపయోగించుటకు విచారమేల? కాని మేము అడవిలో పెరిఁగినవారము, రథచర్య నెఱుంగము.

సుమం—వత్సా, దర్ప సౌజన్యములకు తగినట్లు ఆచరించుటకు ఎఱుఁగుదువోయి. ఇట్టి నిన్ను ఐక్ష్వాకుఁడు రాజా రామభద్రుఁడు చూచినచో స్నేహముచేత అతని హృదయము కరంగి ప్రవహించును.

లవు—ఆర్యా, ఆ రాజర్షి గొడ్డవాఁడని వినికి. [సలజ్జముగానుంబోలె]

ఉ. ఏమును నీక్రియన్ గ్రతుల కెగ్గొనరించెపుపాటి గాము సూ;
భూమిపు నెవ్వఁ డాయన నపూర్వ గుణోజ్జ్వలు మెచ్చఁ డైననున్,
ఆమెయి సర్వబాహుజ భుజౌజము దిక్కృతిసేయు నశ్వర
జౌ మను జాతివాదము వికారము గొల్పెను మానసంబునన్. ౨౯

చంద్ర—[సస్మితము] ఏమి నీవు నాయనప్రతాపోత్కర్షమందును అసహనమా!

లవు—అసహన ముండుఁగాక లేకుండుఁగాక. ఒకటి యడిగెదను. ఆ రాజును రాఘవుని దాంతుఁడని వింటిము. ఆయన తాను గర్వితుఁడు గాఁడు. తత్ప్రజలయందును గర్వము కలుగదు. అట్లుండ అతని మనుష్యులు రాక్షస వాక్కును పలుకుచున్నారేమి?

ఆ. ఋషులు వెఱినుడువు దృష్టని నుడువును
జాటినారు రాక్షసం బటంచు;
ఎల్ల వైరములకు నల్లదే తల్లి సూ,
ఎల్ల లోకముల కదే యలక్ష్మి. ౩౦

ఇట్లని గదా దానిని నిందింతురు. ఇతరము నిట్లు స్తుతింతురు:—

తే. కోర్కులను బిండు, దురితముఁ గూలఁద్రిమ్ము,
నీను గీర్తి, నలక్ష్మిని బో నడల్చు;
దాని మంగళములమాత సూనృతోక్తి
ధీరులు వచింపుదురు కామధేను వంచు. ౩౧

సుమం—పావన స్వభావుఁ డీకుమారుఁడు వాల్మీకి శిష్యుఁడు. ఋషి యొసంగిన సంస్కారముచేత కరము సుమ్మత మగుదానిం బలుకుచున్నాఁడు.

లవు—చంద్రకేతుఁడా, నీ వంటివే "నాయన ప్రతాపోత్కర్షమందు సయితము నీవు అసహనమా" అని, దానింగూర్చి యడిగెదను:—నియత విషయములా ఏమి క్షత్త్రి ధర్మములు?

సుమం—ఐక్ష్వాకుని దేవుని ఎఱుంగవు. కావున, అతిప్రసంగము మానుము.

క. ఎక్కటివై సైనికులను
జక్కాడితి బిరుదు మెఱపి, సత్యము: కాని,
యక్కజుని జామదగ్న్యుని
మక్కు మడఁచినతని నీకు నొప్పునె యాడన్. ౩౨

లవు—[సహాసము] ఆర్యా, ఆ రాజు జామదగ్న్యుని దమించినాఁడని ఏమి పెద్ద వాదముగా నున్నదే!

తే. నిజము వాక్కున వీర్యంబు ద్విజుల కుండు,
బాహు వీర్యంబొ యది యుండు బాహుజులకు,
జామదగ్న్యుండు పాఱుండు శస్త్ర మంటె,
నతని నణఁచిన యారాజు నుతికిఁ దగునె? ౩౩

చంద్ర—[వ్యథతోనుంబోలె] ఆర్య ఆర్యా, ఏల యీ మాట పై మాట!

ఉ. ఈతఁ డెవండొ యిప్పుడె మహిన్ వెలసెన్ బురుషుండు క్రొత్తగా!
వీతఁడు వీరుఁగాఁ గొనఁ డటే భగవానుని జామదగ్న్యునిన్!
ఆతత సప్తలోక సతతాభయదాన ధురంధరంబు వి
ఖ్యాతిగ తాతపుణ్య చరితాద్భుత మేని యెఱుంగఁ డయ్యెరే! ౩౪

లవు—రఘునాథుని చరితమును మహిమను ఎవఁ డెఱుంగఁడు. చెప్పనం గొంచెము చెప్పవలసినదియుం గలదు, అది యేని ఎందులకు లే!

ఉ. ఉందురు జ్యాయసుల్ తడవ నొప్పదు వారిచరిత్ర ముండనీ;
సుందుని నాతిఁ గూల్చిన విశుద్ధయశోనిధు లమ్మహామహుల్;
ముందడుగుల్ ఖరాజి నని మూఁ డకుతోభయముల్ వెలంగవే?
యింద్రజు నేయు నేరుపును నెల్లజనంబులు మెచ్చుకొన్నదే! ౩౫

చంద్ర—తాతదూష భిన్నమర్యాదుఁడా! అతిగా ప్రేలుచున్నావు!

లవు—అహో, నామీఁదనే బొమలు ముడించినాఁడే!

సుమం—వీరి కోపము రేఁగినది, కావుననే.

మ. తలకట్టుల్ గుదియించుఁ గ్రోధజవితోత్కంపంబు, స్ఫారాంబకం
బులు రక్తోత్పలకల్పముల్ స్వయముగాఁ బొందెన్ బయిన్ రక్తిమన్,
పొలుపున్ వక్త్రి మకాండతాండవ కన ద్భ్రూయుగ్మ భంగంబుచే
నెల నుత్ఫుల్లకళంకమున్ నలము నున్నిద్రాశివిం బోలుచున్. ౫౬

కుమారులు—మతి యిటనుండి పోరాటమునకుం దగిన తావునకు వత్తము.

[అని యందఱు నిష్క్రమింతురు.

కుమార విక్రమ మనెడి

పంచమాంకము సమాప్తము

## విష్కంభకము

[అంతట ఉజ్జ్వలం బగు విమానమున విద్యాధర మిథునము ప్రవేశించును]

విద్యాధరుఁడు—ఏమి యీయాశ్చర్యము! ఈ సూర్యవంశ కుమారుల దర్పాటు పోరితములో క్షాత్త్రలక్ష్మి ప్రజ్వలిత మగుచు తదీయ విక్రాంత చర్యలు దేవాసురులనుం గూడ అబ్బురం బొందించి ఉబ్బిబ్బు గొల్పుచున్నవి. అది యెట్లన్న—ప్రేయసీ, చూడు చూడు.

తే. క్వణిత కింకిణీ ఝుణఝుణ త్కంకణమున
గురుగుణాటనీ కృత కరాళ రణితమున
వింట గొరకలు గురియు నీవీరుల యని
భువన భీషణ మేచు నద్భుతము ఓహో ౧

క. ఇరువుర కల్యాణముకై
శరధర గంభీర గర్జచాడ్పున నులియన్
సుర దుందుభు లివె కడుకొని
దురదుర నభమందు ధుందు దుందు మ్మనుచున్. ౨

కావున నిపుడు ఎడతెంపు లేక వీరిపై నిండార విరిసిన యందపుఁ బసిండి సొత్తమ్ముల దట్టంపుఁ దంపరలతోడను, కల్ప వృక్షముల మణిక్రొమ్మొగ్గ ముత్తెముల తేనెబొట్టులతోడను నింపారునట్టి పూలవాన గురియుంగాక.

విద్యాధరి—అటయితే ఏమి యిది అకస్మికంగా పేలిన మెఱుపు తీఁగల పిండుమూలంగా క్షణంలో ఆకాశమంతా పసుపుపాఱినట్లయినది!

విద్యాధరుఁడు — ఇదేమి యిప్పుడు !—

క. సురశిల్పి విజదుహితకై
తరువడివిడ సుడియు చెరియు తరణిమహస్సో ?
స్మరహరుని ఫాలదేశముఁ
బొరసిన చిచ్చుఱకంటి పుటభేదంబో ? ౩

[ఆలోచించి] ఆ తెలిసినది. బాలుఁడు చంద్రకేతువు ఆగ్నేయాస్త్రమును ప్రయోగించినాఁడు. ఇది దాని నిప్పుకుప్పలు పర్వువెల్లిదము. అట్లే ఇపుడు :—

తే. కమరి దా ల్జల్లులను గర్పురములు గాఁగ
నోహటిల్లి పఱచె వెస ద్యోరథాళి.
కేతన పటాంచలములందుఁ గిల లొందె
మసృణ ఘుసృణచ్ఛురణ విభ్రమమును క్షణము. ౪

అహో! లేవనే లేచినాఁడే గంతువీఁటు పిడుగుఁ దునియలవలె జెట్టిదంబు అగు మిడుంగుఱుల విరివితో, నిడుద పుత్తములుగా వెగఁ బ్రాఁకి వాకుచున్న జ్వాలల సంభారములతో భయంకరుఁడై యగ్ని భగవంతుఁడు! ఇతని వేఁడి ఇక్కడికిని దుస్సహముగానే యున్నది. కావున ప్రియను నా యొడలితోఁ గప్పి దవ్వుఁగాఁ బోయెదను. [అట్లు చేయును.

విద్యాధరి — బాపురే! విమలంపు ముత్తెసరంపు మన్నని నిండుతాఁకుడువంటి నాథుని నెమ్మేని తాఁకుడుచేత సంతోషాన కళ్లు మూఁతపడి నా వేడి అతిపోయి నట్లుంది.

విద్యాధరుఁడు — ప్రాణేశ్వరీ, ఇట నేనేమి చేసితిని? అయినను,

క. ఎది ప్రియజన మగు నెవరికి,
నది యేమో వింతద్రవ్య మగు వారలకుఁ ;
అది తా నేమియుఁ జేయక,
విదుల్చు దుఃఖముల సౌఖ్య వితతులచేతన్. ౫

విద్యాధరి — ఏమి యిది! ఎండలేక దువాళిస్తూ సుడులుపడుతూవున్న మెఱుపుతీగల నీటి సొంపుల యలంకారంతో, పొగరెక్కిన్న నెమళ్ల మెడల లాగ శ్యామలమైన నీటి మబ్బులు ఆకాశమంతా ఆవరించినవి?

విద్యాధరుఁడు — సఖి, లవ కుమారుఁడు ప్రయోగించిన వారుణాస్త్రంపుఁ బ్రభావముసుమా యిది! ఏమీ! తెంపి లేక కురిసిన జలధారా సహస్రములం ఒక్కుమ్మడిగా పడుటచేత ఆగ్నేయాస్త్రము అతిపోయినది!

విద్యాధరి—ఇది నాకు ప్రియము.

విద్యాధరుఁడు—హా! ఏదైనను మిక్కుటమగునేని చెఱుపే. ఎట్లన—ప్రాణిలోకమెల్ల పెనుగాలి పెట్టిడి క్షోభచేత లోఁతుగా నుఱుముచున్న మేఘములచేత దట్టమయిన యంధకారములో బద్ధమై,—ఒక్కుమ్మడిగా విశ్వము నెల్ల మ్రింగ నుంకించుచు వెడలుపుగా భయంకరమైన నోటిని తెఱచిన నీలకంఠుని కంఠకుహరములో నుఱలుచున్నదియుం బోలెను, యుగాంతకాలపు యోగనిద్రా నిరుద్ధ నవద్వారుం డయిన నారాయణుని యుదరంబునం జొచ్చినదియుం బోలెను, కంపిల్లుచున్నది. బళీ! వత్సా చంద్రకేతూ, బళీ! సమయమునకు వాయవ్యాస్త్రమును బ్రయోగించితివి. దానివలన.—

ఆ. పలు వివర్తములను బరమాత్మ లోపలఁ
దెలివిచే లయించు తెఱఁగు దోఁప,
ఎక్కడనొ లయించె లెక్కకు నెక్కుడౌ
కాల్మొగుళ్లు విసరుగాడ్పుచేత. ౬

విద్యాధరి—నాథా, ఎవ రీయన, వడిగా నెత్తిన చేస్తో వస్త్రాంచలమును ఆడిస్తూ దూరాన్నుంచే తియ్యని మాటలతోటి యుద్ధ వ్యాపారాన్ని మానిపిస్తూ ఈ వమాళ్ల నడుమ విమానం నుంచి దిగుతున్నాడు?

విద్యాధరుఁడు—చూచి, ఈయన శ్రీరామభద్రుఁడు శంబూకవధము గావించి మరలినాఁడు.

తే. ఆ మహా పురుషుని శబ్ద మాలకించి
దాని మన్నించి లవుఁడు యుద్ధంబు మానెఁ,
జంద్రకేతుండు ప్రణమిల్లె సంభ్రమమున;
శుభము రా బొందుఁ గావుత సుతులఁ గూడి.

కాన మన మిటనుండి వెడలి పోవుదము. [నిష్క్రమింతురు.

విష్కంభకము సమాప్తము



# షష్ఠాంకము

[అంతట రాముఁడు, లవుఁడు, ప్రణతుఁడు చంద్రకేతువును ప్రవేశింతురు]

రాముఁడు—[పుష్పకమునుండి దిగుచు]

తే. చంద్రకేతుండ, రవికుల చంద్రమసుఁడ,
కడువడిగ రమ్ము నను బిగ్గఁ గౌఁగిలింపు:
హిమశకలశీత భవదంగకములచేత
నాఱుఁగాత నా చిత్త దాహంబు గూడ. ౧

[లేపి, ప్రేమతో కవుంగిలించి] దివ్యాస్త్రధారిదేహమువానికి నీకు కుశలమా ?

చంద్ర—అత్యద్భుతక్రియుఁడును ప్రియదర్శనుండు నగు లవుని స్నేహభాగ్యము దొరకినందున కుశలము. కావున విన్నవించుకొనెదను—నాయనగారు ఈ వీరప్రకాండుని నన్నుఁగాచేగాని, అంతకన్న ప్రేమతోడికంటితోఁగాని చూడవలయును—అని.

రాము—[లవుని నిరూపించి], సంతోషము. నీ చెలికాఁడు ఈ బాలుఁడు అతిగంభీరాకారుఁడుగా నున్నాఁడు.

ఉ. ప్రోవఁగ లోక సంఘమును మూర్తి ధరించిన యస్త్రవేదమో ?
కావఁగ బ్రహ్మకోశమును గాయము దాల్చిన క్షాత్త్ర ధర్మమో ?
ప్రోవా సమస్త శక్తులకు ? మొత్తమొ సద్గుణ రత్నపాళికిన్ ?
శ్రీ విలసిల్ల దృశ్యతఁ జరించు జగత్సుకృతైకరాశియో ? ౨

లవు—అహో ! పుణ్య ప్రభావ దర్శనుఁడైన యీ మహాపురుషుఁడు—

తే. నిర్వృతి స్నేహ భక్తు లన్త్రితయమునకు
వింగడం బైనయట్టిది వేశ్మ మొకటి.
ప్రాగ్రహర మైన యట్టి ధర్మం బొసంగు
సంప్రసాదంబు విగ్రహ సంచరంబు ! ౩

ఆశ్చర్యము—

ఉ. వైరము శాంత మయ్యెఁ, శమవర్షుక మౌ రస మబ్బెఁ, బ్రబ్బి పొం
గారెడు గర్వ మస్తమిత మయ్యెఁ, వినమ్రత నన్నుఁ గుంచెడిన్,
దారున పీయనం గన నదఃప్రవణుండన యైతి నద్దిరా !
యారయఁ దీర్ఘము ల్పలె మహార్ఘ విభూతియుతుల్ మహాజనుల్. ౪

రాము—ఏమి యిది! ఒక్కమ్మడిగ నీ దుఃఖశాంతి కలిగించుచున్నాఁడు! ఏ నిమిత్తమువలనో అంతరాత్మను స్నేహము పొందించుచున్నాఁడు! కాక; స్నేహమంట నిమిత్త సవ్యపేక్ష మంట! ఇది పరస్పర పరాహతము గదా? అట్లే.—

ఆ. గూఢహేతు వేదొ కూర్చును వస్తుల,
బహిరుపాధిఁ బ్రీతి బలపికొనదు,
ప్రొద్దు పొడిచినంత పుండరీకము పూచు,
వెలమణియుఁ గరంగు నెలయుఁ దోఁపఁ. ౫

లవు—చంద్రకేతూ, వీ రెవరు?

చంద్ర—ప్రియవయస్యా, మా నాయనగారు గదా.

లవు—అటయిన నాకును ధర్మమునుబట్టి అట్లే; ఏలన, ప్రియవయస్యా అంటివి గావున. కాని, నీవు ఈ పేరం బరఁగువారు రామాయణకథాపురుషులు పూజ్యులు నల్వురు గదా, అందు విశేషముం జెప్పుము.

చంద్ర—ఓయి, పెదనాయనగారని యెఱుంగుము.

లవు—[ఉల్లాసముతో] ఏమీ! రఘునాథుఁడా? సంతోషము! నేఁడు సుప్రభాతము; ఏల యన, ఈ దేవుని కంటిని. [సవినయ కౌతుకముగా చూచి] నాయనా, ప్రాచేతస శిష్యుఁడు లవుఁడు అభివాదనము చేయుచున్నాఁడు.

రాము—ఆయుష్మంతుఁడా, రా రమ్ము. [అని సస్నేహముగా కవుంగిలించి] ఓయి బాలకా, వలదు అతివినయము వలదు. పలుమాఱు చిక్కఁగా నన్ను కౌఁగిలింపుము.

తే. విరియు నెత్తమ్మిలోరేకువిభవ మొప్పఁ
దీన మృదు మసృణంబు నీమేని తాఁకు
నాకు మితి మేర లేని యానంద మొసఁగుఁ
జంద్రచందన నిష్యంద జడము వత్స. ౬

లవు—[స్వగతము] నా పై వీరికి ఇట్టి నిష్కారణ స్నేహము. నేనన్నో తెలియక వీరికే ద్రోహ మాచరించితిని, ఆయుధ మెత్తుటవలను దురుద్యోగమును వహించితిని. [ప్రకాశము] లవుని బాలిశత్వమును నాయనగారు మన్నింపవలయును.

రాము—వత్సా, నీవు ఏమి యపరాధము చేసితివి?

చంద్ర—గుఱ్ఱము వెంట వచ్చినవారు నాయనగారి ప్రతాపమును వెల్లడింపఁగా నీతఁడు వీరము చూపినాఁడు.

రాము—ఇది క్షత్త్రియునకు అలంకారము గదా.

ఉ. తేజఁగలాఁడు పర్వనారుతేజము నోర్వఁడు; వాని కద్దియే
భ్రాజిలఁ దెచ్చికోని నిజభావముగాఁ బ్రకృతి ప్రరూఢతన్;
తేజె యినుం డజస్రము రుచిప్రకరంబులతో జ్వలించుడున్;
దేజముఁ జిత్రభానుకిల ధిక్కృతముందలెఁ గ్రక్కుఁ జూడవే.

చంద్ర — ఈవీరుని యుపహాసముకూడ శోభించునదే. నాయనగారు చూడ వలయును, ప్రియవయస్యుఁడు ప్రయోగించిన జృంభకాస్త్రములచే సైన్యములు అంతటను కదలక మ్రాన్పడి యున్నవి!

రాము — వత్సా, లవా, అస్త్రము నుపసంహరింపుము. నీవును చంద్రకేతూ, చేతన దక్కి దిగుల్కొనియున్న బలములను ఓదార్పుము.

లవు — నాయనగారు ఆజ్ఞాపించినట్లు. [అని ధ్యానమును అభినయించును.

చంద్ర — నాయన యాజ్ఞ. [అని నిష్క్రమించును.

లవు — శాంతించినది అస్త్రము.

రాము — వత్సా, సరహస్య ప్రయోగ సంహారము అస్త్రములు సంప్రదాయము కలవి.

ఆ. బ్రహ్మహితముకొఱకు బ్రహ్మాదు లాద్యులు
వేలు వర్షములు తపించి గురులు
ఆత్మ తేజములనె యస్త్రములుగ వీని
ఘనతపోమయములఁ గాంచినారు. రా

అట్టి యీ మంత్రపారాయణోపనిషత్తును భగవానుఁడు కృశాశ్వుఁడు సహస్రాధిక సంవత్సరముల శిష్యుఁ డయిన కౌశికునికి విశ్వామిత్రునికి ఇచ్చినాఁడు. ఆ భగవంతుఁడు నాకు నిచ్చినాఁడు. ఇది వీని క్రమము. కుమారునికి మఱి ఏ సంప్రదాయమున వచ్చినదో అడిగెదను.

లవు — మా యిరువురకు అస్త్రములు స్వతఃప్రకాశములు.

రాము — [ఆలోచించి] ఏల యట్లు సంభవింపరాదు? ఇది ఏదో దొడ్డ పుణ్యపుం బరిపాకముచేఁ గలిగిన మహిమ గానోపు. ఇరువురకు అంటివే అది యేమి?

లవు — మేము ఇరువురము కవలవాండ్రము భ్రాతలము.

రాము — అటయిన రెండవవాఁ డెవరు?

[నేపథ్యమున]

భాండాయనా, భాండాయనా,

తే. నృప చములతోడ దీర్ఘాయునికి లవునికిఁ
జివ్వ యంటివా? యౌ నని చెప్పెదె సఖ?

జగతి నణఁగుత నధిరాజశబ్ద మిపుడు,
క్షత్త్రశస్త్రాగ్ను లిప్పుడు శమము గనుత. ౯

రాము.—

తే. ఎవఁ డితం డింద్రమణి శితిచ్ఛవి లలితుఁడు?
శబ్ద మాత్రానఁ బులకదంశనుని నన్ను
నభినవశ్యామ జలదగర్జైక నిమిష
బద్ధకలిక కదంబడంబరునిఁ జేసె. ౧౦

లవు.—ఈయన నాయన్నయ్యగారు, కుశుఁ డని పేరు. భరతాశ్రమము నుండి మరలి వచ్చినాఁడు,

రాము.—వత్సా, ఆయుష్మంతు నీతని ఇటకుం బిలువుము.

లవు.—అట్లే. [అని పరిక్రమించును.

[అంతట కుశుఁడు ప్రవేశించును]

కుశుఁడు.—[అద్భుత ధైర్య హర్షములతో ధనుస్సును ఆస్ఫాలించుచు]

సీ. వైవస్వతుని భగవాను మనువుఁ దొట్టి
యేన్నృపుల్ త్రైలోక్య హితముపొంచె
నమరేంద్రునికి సతం బభయదక్షిణ లిచ్చి
రేల నెల్లరదిగు ల్దీర్చినారొ,
ఏరాజవరులు ధర్మేతర చరితుల
దృప్తుల భస్మీకరించు కొఱకుఁ
దమకుం బ్రకృతి సిద్ధధర్మం బయినక్షాత్త్ర
విక్రమంబును జ్వలింపించినారొ,

తే. అట్టి సావిత్ర నృపులతో నాలమేని,
ధన్య మౌ నిది మద్భుజాదండ సఖము
దీప్ర దివ్యాస్త్ర విస్ఫురత్తీవ్రకీల
కాంత నీరాజితజ్యంబు కార్ముకంబు. ౧౧

[అని వికటముగా పరిక్రమించును.

రాము.—ఈ క్షత్త్రియ బాలునందు ఏదో అనిర్వచనీయ మైన పౌరుషాతిశయము కలదు.

ఉ. వీరికి దృష్టి కైకొన దశేష జగత్త్రయ సత్త్వసారముం,
ధీరము నుద్ధతంబు గతి దిగ్గఁగఁ జేసెడిఁబోలె ధారుణిన్,
గౌరవ మూను వీఁడు గిరి కైవడి బాలుఁడ యయ్యు, మాయురే!
వీరమొ దర్పమో యిటులు వీఁ డయి యాదెస వచ్చుచున్నదో? ౧౨

లవు — అన్నకు జయము,

కుశు — ఓయి ఆయుష్మంతుఁడా, ఏటి దీమాట యుద్ధ మని?

లవు — అదేదో ఏపాటిది. దృప్తభావము మాని, ఆర్యా. వీరియెడల వినయముతో వర్తింపుము.

కుశు — అది యేల?

లవు — మహారాజు రఘుపతి ఈయన మతి మనయందు నెయ్య మూనియున్నాఁడు. నిన్నుఁ జెంతఁ జూడ మిక్కిలి కోరుచున్నాఁడు.

కుశు — [సతర్కముగా] ఆయన రామాయణ కథానాయకుఁడు, బ్రహ్మాండమునకు రక్షకుఁడు.

లవు — అవును.

కుశు — ఆ మహాత్ముని పుణ్యదర్శనమును కోరవలసినది కదా. కాని మన మెట్లు ఆయనను దఱియవలయునో ఎఱుంగకున్నాఁడ.

లవు — గురువునుంబోలె ఉపచార పూర్వకముగా దఱియవలయును.

కుశు — అహో, అది యెట్లు?

లవు — అత్యుదారుఁడు సుజనుఁడు చంద్రకేతుఁడు ఊర్మిళాపుత్త్రుఁడు నన్ను ప్రియవయస్యుఁడ నని సఖ్యముచేత చేరుచున్నాఁడు. కనుక ఆ సంబంధముచేత ఈ రాజర్షి మనకు ధర్మము ప్రకారము నాయన.

కుశు — అట్లైన రాజన్యుని యెడలనైనను వినయము నిందనీయము గాదు.

లవు — అన్నా, ఈ మహాపురుషునిం జూడుము, వీరి ప్రభావగాంభీర్యములు వీరి వివిధలోకాతీత సుచరితాతిశయములను సూచించుచున్నవి.

కుశు — [చూచి]

తే. బాపురే! ప్రసాదాత్మ మీరూప మేమి!
పావన మహారె! యీ యనుభావ మేమి!
మాయురే! పాత్రమందె రామాయణకవి
భారతీదేవిఁ బ్రకటించె భాసురముగ. ౧౩

[సమీపించి] నాయనా, ప్రాచేతసాంతేవాసి కుశుఁడు అభివాదనము చేయుచున్నాఁడు.

రాము—రా రమ్ము, ఆయుష్మంతుఁడా,

తే. అమృతపూరిత వారివాహంబు కరణి
నిద్దమును శ్యామలము నగు నీదు మేనిఁ
గౌఁగిటం బొదువంగ నుత్కంఠ గొంటి
వత్సలత్వంబుచేఁ బరవశత్వ మొంది. ౧౪

[కౌఁగిలించి స్వగతము] ఈ బాలుఁడు ఎవరిపట్టి?

శా. సర్వాంగ స్రుత నైజ దేహజ గరిష్ఠస్నేహ సారంబొ? ద్ర
వ్యాకారముఁ దాల్చి వేర్పడిన వల్గచ్చేతనా ధాతువో?
నిర్వ్యక్తుందొ ప్రహర్ష సంక్షుభిత హృత్స్నిగ్ధ స్నవౌఘంబుచేఁ?
దర్శించెన్ జలె వీఁడు కౌఁగిట సుధాప్రావృట్ప్రవంతిన్ మెయిన్. ౧౫

లవు—నాయనా, చండాంశుఁడు నడిమింటికి వచ్చి ఫాలదేశముం గాల్చుచున్నాఁడు. కావున ఇట ఈ మద్దిక్రింద నాయన ఇంచుక సేపు కూర్చుందుముఁగాక.

రాము—వత్సా నీయిష్టమైనట్లు. [అందఱును పరిక్రమించి కూర్చుందురు.

రాము—[స్వగతము]

ఆ. ఔర! ప్రశ్రయంబుఁ బాటించు వహిలోనె
నడక, నిలక, యాసనంబు మొదలు
భావములు వచించుఁ బరమ సామ్రాజ్యంబుఁ
గుశునికి లవునికి నకుంఠితముగ. ౧౬

తే. సహజలక్ష్మీ విలాసముల్ చదురు గొల్పఁ
బ్రతికల మనోరమం బగు వర్ష్మకమును,
అమలినం బగుమణిని దదంశులవలె,
విరియు నెత్తామరను దేనెబిందులవలె. ౧౭

ఈ బాలురయందు మెండుగా రఘుకుల కుమారుల ఛాయను గాంచుచున్నాను

తే. యువకపోతంపు మెడఁబోలె నొడలు కప్పు.
మూఁపు లెనసెడి నాఁబోతు మూఁపురమును,
సప్రసాద మృగేంద్ర నిశ్చలము దృష్టి,
స్వరము మంగళ మురజమాంసల కలంబు. ౧౮

[నిపుణముగా పరికించి] అహో! ఈ యాకారము నన్నుఁబోలుట మాత్రమేగాక,

చ. కనఁబడుచున్న వీరిరుయుగంబున నైపుణిమీఱఁ జూచినన్
జనకజఁబోయి చందములు పైతము జానుగ నద్దియద్దియున్;
కనులకు వెండి కానఁబడు క్రైవడి నున్నది వీరిమోములన్
ఘనశతపత్త్రి లక్ష్మికి నికాయ్యము ప్రేయసియాస్య మద్దిరా! ౧౯

ఆ. శుక్తిజాచ్ఛదంత శోచి ర్మనోజ్ఞ మీ
పెదవి ముద్ర యదియె. వీను లవియె;
నేత్రయుగళి రక్తనీలంబ మైనను,
సుభగతాగుణంపు జోక యదియె. ౨౦

ఇదే వాల్మీకి నివసించు పావనము. ఇట సీతాదేవి విడువఁబడినది. శిశువుల యాకృతియు నిది. మఱి అస్త్రములు స్వతః ప్రకాశములు అనువదియేది కలదో, దానిని విమర్శించెదను. అప్పుడు చిత్రదర్శనమున నా చేసిన యస్త్రాభ్యనుజ్ఞానము నెఱవేఱినదా? సంప్రదాయము లేక అస్త్రములు కలుగు నని విననైతిమి. ఈ సుఖాతిశయమో సందేహములో తేలిపోవుచున్న నా యాత్మను నమ్మించుచున్నది. దేవేరి గర్భభారము రెండుగా నెలకొని యుండుటను నేను పలుమాఱు కని యుంటిని [సబాష్పము]

చ. పరిచితి యొకొలంది నెఱిఁ బండినప్రేమది నేకతంబునన్
సరళత విశ్వసించియును సాజపునాన జదేషలం గనన్,
గరమున గర్భముం దడవి కంటిఁ గళన్ గవ లంచు నేన మున్,
సరవివి వెన్కనెన్ని దివసంబులకో ప్రియ తాను గన్గొనెన్. ౨౧

[ఏడ్చి] మఱి, వీరి నడుగుదునా ఏదేని యుపాయముచేత ?

లవు—నాయనా! ఇదేమి!

తే. భువనమంగళ మైనమీమో మి దేమి
బాష్పవర్షంబుచేతను బాత్ర మయ్యె
తుహిన జాలంబుచేతను దోఁగినట్టి
పుండరీకంబునం గ్రాలు విందుపిరికి. ౨౨

కుశు—ఓయి వత్సా,

ఉ. ఏయది గాదు దుఃఖము మహీసుత లేమిని రామమూర్తికిన్?
ప్రేయసి నష్టమైన నటవీమయమే గద సర్వలోకమున్.
నేయము దట్టి. దీవిరహ నీరధికిన్ దరి గానరాదు, రా
మాయణకావ్యపుం బఠితి వయ్యును నీ విటు ప్రశ్న చేసెదే! ౨౦

రాము — [స్వగతము] అహో, ఆలాపము తటస్థముగా నున్నది. ఇఁక ప్రశ్న వలదు. పాడు డెందమా? ఏల యిట్లు ఆకస్మికముగా చాపలమెత్తి పరుగులు వాఱితివి! నాని దుఃఖమును బయటికి ప్రిమల్చు కొన్నవాఁడనై శిశుజనము పైకము కనికరించుమనట్లయితిని. కానీ యీ భావమును డాఁగురించెదను. [ప్రకాశము] బాలురారా, రామాయణ మని యందురు, ప్రాచేతస భగవంతుని సరస్వతీనిష్యంద మఁట, సూర్యవంశ ప్రశస్తి యఁట; అందు ఏమేని యించుక వినం గుతూహల పడుచున్నాను.

కుశ — ఆ గ్రంథము నంతయూ మేము పఠించితిమి. ఇప్పఁడు తటాలున జ్ఞప్తికి వచ్చినవి యీ రెండు పద్యములు బాలచరితంపుఁ గడపటి యధ్యాయము లోనివి.

రాము — వత్సా, పఠింపుము.

కుశ —

తే. మొదలనే ప్రియ యమ్యె రామునకు సీత
తండ్రి యంగీకరించిన దార యగుట;
అట్టి యా ప్రేమ వర్ధిల్ల నామె చేసె
గుణగణముచేత మఱి రూపగుణముచేత. ౨౧

తే. రాముఁడును సీత కాప్రకారంబుగానె
ప్రాణములకన్నఁ బ్రియుఁడుగా బరిఢవిల్లె:
మానసము మాత్రమే యెంచుఁ దా నెఱుంగు
నొండొరుల మీఁదఁ గల ప్రీతియోజనంబు. ౨౨

రాము — [స్వగతము] ఇది అతి దారుణముగా హృదయ మర్మమును ఉద్ఘాతము చేయుచున్నది! హా దేవీ! ఇట్లే గదా అప్పుడు జరిగినది. అహో తుచ్ఛని విపర్యాస పరంపరచే విప్రలంభాంతములుగా నున్నవి యీ సంసార వృత్తాంతములు!

చ. నిరతిశయంపు నమ్మకపు నిర్భరహర్ష మ దేడ? నా పర
స్పరయతనంబు లేడ? రససంభృత కౌతుకక్లిష్టు లేడనో?
హరుసమునందుఁ గుందున హృదైక్య మ దేడ? న దైననున్ బరి
స్ఫురణమ సేయుఁ గాని, యిడివో దిది పాపపుఁబ్రాణ మక్కటా! ౨౩

అయ్యో! కష్టముగా నున్నదే!

క. నాకుఁ బ్రియాగుణ సాహ
చైర్యోత్కీలనముచేత నతిపేశలమై
యేకాలము దుస్స్మరమో
యాకాలమె సంస్మరింప నైతివి హా! హా! ౨౦

ఉ. అత్తఱి వించుకించుక మృగాక్షి చనుంగవ యంకురించి యు
ద్వృత్తత కంగవించు వళివిస్తృతి యించుకఁ జెంది కై పిదేన్;
చిత్తభవుండు ప్రాయమును స్నేహము భావము నంత గాంచి వే
యె త్తులు డెందమందును మెయిన్ మఱి గోలతనంబు మేకొనెన్. ౨౧

పరి — ఇది యొకటి మందాకినీ చిత్రకూట వనవిహారమందు సీతాదేవింగూర్చి రఘునాథుని పద్యము:—

క. పీకై విన్యస్తముబలె
నీకొఱలెడి తాతిపట్ట మెదురం గనుమా;
యీకేసర మందుపయిన్
పీకునఁ బూబిండుచేఁ బ్రకృష్టంబుబలెన్. ౨౨

రాము — [సలజ్జాస్మిత స్నేహకరుణముగా] శిశుజనులు మిక్కిలి చేలఁ, అందులోను అరణ్యచరులు మఱియు; హా దేవి! ఆ తావును అసమయంపు స్వైర విహారాతిప్రసంగ సాక్షులను స్మరింతువా? కట్టా కట్టా!

మ. మనమం దెంతు శ్రమాంబు శీతలితమున్ మందాకినీ మంద పా
వనపోతాయితాలకాకులిత భాస్వత్ఫాల చంద్రద్యుతిన్
వినివృత్తాగ్నిశిఖాంక నైజసుషమా విద్యోతి గండంబు నే
న నలంకార మనోరమ శ్రుతివిభా ప్రాజ్యంబు నీవక్త్రిమున్. ౨౩

[స్తంభితునివలె నుండి సకరుణము] అహో ఏమి యిది!

ఉ. ఆకృతి భావనావశి మహర్ధి సృజించి ఘటించె మ్రోల నాఁ
డైకొని యాలడించుఁ బెడఁబాపియు నాప్తజనం బవారణన్;
శోకము పెల్లుకాన మగు శోవివికల్పము శాంతిఁ బొందినన్,
బాకము నొందుచుండుబలె స్వాంతము వెన్కఁదుషాగ్ని రాశిలోన్. ౨౪

[నేపథ్యమున]

చ. బిడుతల కయ్య మంచు వెఱఁ జొక్కి వసిష్ఠుఁడుఁ బుట్టఁబుట్టువున్
బడి జనకుండుఁ బంక్తిరథుపట్టపుదేవు లరుంధతీయుతల్
తరవు గమించి యాశ్రమము దవ్వగుటన్ జర మేనిఁ గ్రుంచుటన్
వడి గొనుచున్ శ్రమార్తులయి వ్రాలుచు వచ్చుచు నున్నవారదే. ౩౨

రాము — ఏమీ! భగవంతులు అరుంధతీ వసిష్ఠులును అమ్మయు జనకుఁడును ఇటకే వచ్చుచున్నారా? కట్టా! ఎట్లు వీరిని చూతును! [సకరుణముగా చూచి] అహహా! నాయన జనకుఁడు కూడ ఇటకే వచ్చినాఁడని పిడుగుదెబ్బతింటిని మందభాగ్యుఁడను.

ఉ. వియ్యము దొడ్డ దంచుఁ గనుపెట్ట వసిష్ఠముఖుల్ ప్రహృష్టులై
యయ్య లపత్య యౌతక మహంబునఁ గూడినరీతిఁ గాంచియున్
ఇ య్యతిఘోరదుఃఖమున నీదృశుఁ గాంచుచుఁ దాతమిత్త్రినిన్
ప్రయ్యన వేయిగా! సరియె! రాముని కెయ్యది దుష్కరం బగున్ ౩౩

[నేపథ్యమున]

కటకటా!

క. అనుభావ మాత్రముగ సిరి
యునికి గొనిన రాముఁ దల్లు లుద్దవిడిఁ గనుం
గొని మును కని యెఱిఁగినజన
కునిబోధన నెఱిఁగి మూర్ఛఁ గూలిరి పెలుచన్. ౩౪

రాము — హా నాయనా జనకుఁడా! హా తల్లులారా!

క. జనకులకు రఘువులకునుం
బనితం బెవి కృత్స్న గోత్రమంగళముగ నం
దును సైత మకరుణుఁడఁ బా
పిని నగు నామీఁదఁ గరుణ వృథ సుఁడీ మీకున్. ౩౫

ఇదె పోయి సంభావించెదను. [అని లేచును.

కుశలవులు — నాయన ఇటు ఇటు.

[సకరుణముగా పరిక్రమించి అందఱు నిష్క్రమింతురు.

కుమారప్రత్యభిజ్ఞాన మను

షష్ఠాంకము సమాప్తము

# సప్తమాంకము

[అంతట లక్ష్మణుఁడు ప్రవేశించును]

లక్ష్మణుఁడు—ఓహో! నేఁడు భగవంతుఁడు వాల్మీకి బ్రహ్మక్షత్త్ర పౌర జానపద సమేత మయిన ప్రజలను మమ్ముం గూడఁ బిలిచి సకల మైన దేవాసుర తిర్యగురగ నాయక సంయుక్తముగా జంగమమును స్థావరమునుగల భూత గ్రామమును తన ప్రభావముచేత ఒక్కెడ సమకూర్చినాఁడు. నన్ను అన్నగారు ఆజ్ఞాపించినారు: "వత్సా, లక్ష్మణా, భగవంతుఁడు, వాల్మీకి తనకృతిని అచ్చరలు ఆడఁగాఁ జూచుటకు మనలను ఆహ్వానము చేసినాఁడు. కావున భాగీరథీ తీరమున నొక మనోజ్ఞ స్థానమున నీవు సమాజ సన్నివేశము కావింపవలసినది." అని. నేనును మర్త్యామర్త్య రూప మయిన భూత గ్రామమును తగిన తావులం గూర్చుండఁ బెట్టితిని. మఱి వీఁడుగో:—

తే. అధివసించియుఁ బ్రాజ్యరాజ్యాశ్రమమును। దాపసేంద్రుల కిష్టవ్రతమును బూని
వామలోచన పౌనిపై భక్తిచేత। నన్న యువటికె యుపదెంపుచున్నవాఁడు. ౧

[అంతట రాముఁడు ప్రవేశించును]

రాముఁడు—వత్సా, లక్ష్మణా, రంగప్రాశ్నికులు వచ్చియున్నారా?

లక్ష్మ—వచ్చియున్నారు.

రాము—ఈ బాలుర నిరువురను చంద్రకేతువుతో సమానమయిన స్థాన మర్యాదను పొందింపవలసినది.

లక్ష్మ—ప్రభు స్నేహంపుఁ దాక్షిణ్యముచేత అట్లే కావించితిని. ఇదిగో మఱి రాజాసనము పఱుపఁబడి యున్నది. ఆర్యుఁడు కూర్చుండుఁగాక.

[రాముఁడు కూర్చుండును.

లక్ష్మ—ఓహో, ఆరంభింపుఁడు.

సూత్రధారుఁడు—[ప్రవేశించి] భగవంతుఁడు భూతార్థము చెప్పువాఁడు ప్రాచేతసుఁడు సజంగమస్థావరమును జగత్తును ఆజ్ఞాపించుచున్నాఁడు:—"మేము ఆర్షంబగు నేత్రములోఁ జూచి పావనంబును కరుణాద్భుత రసంబునుగా నే ప్రబంధమును నిబంధించితిమో, దానిని కార్యగౌరవముచేత హెచ్చరికతో పరికింపుఁడు" అని.

రాము—ఇట్లు చెప్పుట యైనది; ఏమన,—"మహాత్ములు ధర్మములను సాక్షాత్కరించినవారు. అమృతపారములును పరోరజసములును అయిన తత్ప్రజ్ఞానములు ఎటను భంగ మొందవు. కావున వానియందు శంక వహింపఁగూడదు" అని.

[నేపథ్యమున]

హా ఆర్యపుత్త్రుఁడా! హా కుమార లక్ష్మణుఁడా! ఏకాకినిని మందభాగ్యను, దిక్కు లేనిదానిని, అడవిలో నొప్పులుపడుచున్న నన్ను ఈ క్రూరులు ఘాతుక జంతువులు మెసఁగం జూచుచున్నవి. ఇదె నేను ఓపలేక భాగీరథిలో నన్ను వైచికొనుచున్నాను.

లక్ష్మ—[ఆత్మగతము] కష్టా! ఇదేదో మఱియొకటి యైనది!

సూత్ర—

తే. దేవి వైశ్వంభరేయి సాధ్వీమతల్లి
రాజు విడిపింపఁగా మహారణ్యమందుఁ,
బ్రసవవేదన పెల్లు సంప్రాప్త మగుడు,
వైచికొనెఁ దన్ను గంగాభవానియందు. ౨

[అని నిష్క్రమించును.

రాము—[సావేగము] హా దేవి! హా దేవి! క్షణము సేపుము.

లక్ష్మ—ఆర్య, నాటక మిది.

రాము—హా దేవి! దండకారణ్యవాస ప్రియసఖి! రాముని వలన నీకు ఈ దైవ దుర్విపాకము!

లక్ష్మ—ఆర్యా, సమాశ్వసిల్లుము, ప్రబంధార్థమును అవధరింపుము.

రాము—ఇదె సన్నద్ధుఁడను, వజ్రమయుఁడను.

[అంతట ఒడిలో ఒక్కొక్కదాని నుంచుకొన్నవారై పృథ్వీభాగీరథులు పట్టుకొనఁగా సీత ప్రవేశించును]

రాము—వత్సా, లక్ష్మణుఁడా! అడుగిడ దొరకని చిమ్మ చీకటిలో పడి పోవుచున్నాను. నన్ను పట్టుకొమ్ము.

పృథ్వీ భాగీరథులు—

తే. ఊఱడిల్లుము కల్యాణి యూఱడిల్లు,
నీదె పున్నెంబు; వైదేహి నీదె శివము;
నీరిలోపలఁ గంటి వో నీరజాక్షి,
క్రమతేజుల రఘువంశకరులఁ గవల. ౩

సీత—[సమాశ్వసించి] ఆహా! ఇరువుర దారకులను కంటిని! హా! ఆర్యపుత్త్రుఁడా! [అని మూర్ఛిల్లును.

లక్ష్మ—[పాదములలోఁ బడి] ఆర్యా, సంతోషము, వర్ధిల్లుచున్నాము. రఘువంశమునకు శుభ సంతానము మొలచినది. [చూచి] హా! హా! ఏమి! బాష్పము వెల్లిగొని ఆర్యుఁడు ఓపలేక మూర్ఛిల్లినాఁడు.

దేవత లిరువురు—పట్టీ, ఊఱడిల్లు మూఱడిల్లుము.

సీత—[ఊఱడిల్లి] భగవంతులారా, మీ రెవరు?

పృథ్వి—ఈమె నీ శ్వశురకులదేవత భాగీరథి.

సీత—భగవతి, నీకు మ్రొక్కెదను.

భాగీ—చారిత్రమునకు తగిన కల్యాణ సంపదను పొందుము.

లక్ష్మ—అనుగ్రహింపఁబడితిమి.

భాగీ—ఈమె నీతల్లి విశ్వంభర.

సీత—హా అమ్మా, ఇట్టిదానినిగా నన్ను నీవు చూచితివి!

పృథ్వి—రావె పుత్రీ. [అని ఒండొరుం గౌఁగిలించుకొని మూర్ఛిల్లుదురు.

లక్ష్మ—అహా! ఆర్యను గంగాపృథ్వులు అనుగ్రహించినారు.

రాము—[చూచి] ఇది కరుణతరముగాఁ గదా యున్నది.

భాగీ—విశ్వంభరకూడ వ్యథనొందుచున్నదఁట; జయించినది యపత్య వాత్సల్యము. అట్లు గాదు; చేతన గలవారి కెల్ల నిది యొక సంసార తంతువు. మోహంపు ముడితోడిది: ఎప్పటికిని త్రెవ్వక హృదయమున నుండునట్టిది. పట్టీ వైదేహీ, భూతధాత్రి, ఊఱడిల్లుఁడు, ఊఱడిల్లుఁడు.

పృథ్వి—[ఆశ్వసిల్లి] సీతను గని యూఱడిల్లుట యెట్లు?

తే. రక్కసులయిక్కఁ జిర ముక్కి యొక్కటియును,
ద్యాగము సుదుస్సహంబు దెంతవది యిదియు—
భాగీ—
దైవము పచేళిమం బయి దటియ దాని
ద్వారములు మూయఁ దరమె యేప్రాణి కైన? ౪

పృథ్వి—భాగీరథి, సరిగా చెప్పితివి, కాని ఇది రామభద్రునికి యుక్తమా?

తే. బాల్యమునఁ దాను బాలుండు వట్టినట్టి
పాణి నాతండు గొనఁడు ప్రమాణముగను,
నన్నుఁ గొనఁడు జనకునిఁ గొనండు వహ్నిఁ
గొనఁ, దనుస్మృతిఁ గొనఁడు, సంతతిని గొనండు. ౫

సీత—హా! ఆర్యపుత్రుని స్మరింపఁజేసితివి.

పృథ్వి—సీ! నీ కార్యపుత్రుఁ డెవఁడు!

సీత—[సలజ్జాస్రము] పోనీ, అమ్మ చెప్పినట్లే.

రాము—అమ్మా! పృథ్వీ, ఇట్టివాఁడ నైతిని.

భాగీ—భగవతీ, వసుంధరా, క్షమింపుము. సంసారమునకు దేహమవుగదా. మఱి, యెఱుఁగనిదానివలె అల్లునిపై కోపించెదవేమి?

శా. న్యాయం బల్లెను ఘోరదుర్యశము; లంకాద్వీపమం దగ్ని చే
తాయిష్టస్థిత తావిశుద్ధి నెటు నమ్ముగా మానుషం డిందులన్?
ఈ యుర్విప్రజ్యఁ గొల్చుచే కులధనం బిక్ష్వాకువంశ్యాళి కౌ,
పీయిక్కట్టునఁ జిక్కి పుత్త్రికుఁడు తా విం కేమి సేయుం గటా. ౬

అరు—దేవతలు అవ్యాహతమయిన సర్వభూతహృదయజ్ఞానము కలవారు గదా. అందులోను భాగీరథమాట చెప్పవలయునా? కావున అమ్మా నీ కిదె నా నమస్కారము.

రాము—అమ్మా, నీవు భగీరథకుటుంబమందలి నీ ప్రసాదమును వెలవేర్చితివి.

పృథ్వి—నిత్యము మీకు ప్రసన్నురాలను. అయినను నా పట్టికిఁ గలిగిన శోకావేగము వచ్చిన రాకలో నే నాకు దుస్సహమైనది. ఎఱుఁగనిదానను గాను రామభద్రునికి సీతయందుఁ గల స్నేహమును.

ఆ. దైవవశత నతఁడు దయితను విడనాడి
మెరియు చున్నయట్టి మెదఁదతోడ
బ్రదికి యున్నవాఁడు ప్రజల పుణ్యమునను
సకల జగ దతీత సత్త్వమునను. ౭

రాము—గురువులు గర్భరూపులయందు కరుణావంతులు సుమా.

సీత—[ఏడ్చుచు, కృతాంజలియై] అమ్మా నన్ను నీ యంగములందు విలయ మొందింపుము.

రాము—మఱి యేమి చెప్పనున్నది!

భాగీ—శాంతము, విలయ మొందక వేయియేండ్లు ఉండుము.

పృథ్వి—నీ పుత్త్రులను నీవు చూచుకొనవలయును.

సీత—అనాథ నైతిని, ఇఁక వీ రేల?

రాము—హృదయమా, వజ్రమవు సుమా.

భాగీ—ఏమి! సనాథవే, అనాథ వెట్లు?

సీత—మందభాగినికి నాకు సనాథత్వ మెక్కడిది?

భాగీ—

క. లోకైక మంగళంబును
నీకరణిని నిన్ను నీవ యెగ్గింతేలా;
మాకు నయితము పవిత్రత
నీకూటమిచేత హెచ్చె నిరుపమ సాధ్వీ. ౮

లక్ష్మ—ఆర్యా, వినుము.

రాము—లోకము వినునుగాక.

[నేపథ్యమున కోలాహలము]

రాము—ఇది ఏదో అద్భుతతరము.

సీత—ఏమి యిది! గొల్లుమచు అంతరిక్షమెల్ల ప్రజ్వలించుచున్నది!

పృ. భా.—ఆహా తెలిసినది.

తే. క్రమముగఁ గృశాశ్వ కౌశిక రాము లనుచు
గురుపరంపర వేవికిఁ గుదురుకొనియె,
నవియె యావిర్భవించుచున్నవి ముదమునఁ
గైదువులయి మొత్తముగ జృంభకములతోడ. ౯

[నేపథ్యమున]

తే. వందనము నీకు నోదేవి, వసుధపుత్రి,
గతినుమీ మాకు నీపుత్రకద్వయంబు;
అట్లు గాదె రఘూద్వహుం డానతిచ్చెఁ
జిత్రదర్శనవేళ నీచిత్త మలర? ౧౦

సీత—సంతోషము, అస్త్రదేవతలు స్ఫురించుచున్నారు.

లక్ష్మ—ఆర్యా, నీవు చెప్పి యుంటివి "తప్పక నీ ప్రసూతిని ఇవి భజించును" అని.

పృ. భా.—

క. పరమాస్త్రములారా! జో
హారు! మీచేపట్టుచేఁ గృతార్థులము కదుఁగా;
ఇరువుర నిసుఁగులఁ గూడుఁడు
పరిభావన చేసినంత; భద్రము మీకుఁగా. ౧౧

రాము.—

తే. కుందుదరఁగలు విస్మయానందథువుల
కూడలిం బడి సడలి యాకులత నెనసి,
అట్టి దిట్టిది యని పల్క నలవి గావి
యొక దశావిశేషమును నా కొసఁగె విపుడు. ౧౨

పృ.—థా-పట్టీ సంతోషింపుము. నీపుత్త్రిక లిప్పుడు రామభద్రతుల్యులైనారు.

సీత.—భగవతులారా, వీరి కిపుడు క్షత్త్రియోచితకర్మ మెవరు చేయుదురు?

రాము.—

తే. అల వసిష్ఠర్షి పాలింప నలరునట్టి
రఘువులకుఁ దానె వంశవర్ధన ధురీణ
సీతయును నక్కటక్కటా శిశులకొఱకు
గానపున్నది సంస్కర్తఁ; గనుదు నెట్లు! ౧౩

భాగీ.—పుత్త్రి, ఆ చింత నీకేల? ఈ నిసుఁగులను పాలు విడిచిన తర్వాత వాల్మీకి భగవంతునికి అప్పగించెదము. ఆయన వీరికి క్షత్త్రకృత్యముం గావింపును.

తే. అమ్మ సీత, వసిష్ఠుండు నాంగిరసుఁడు
నెట్లొ, ప్రాచేతసుండును నట్లె చూవె.
జనకులయు రఘువులయును సంతతులకుఁ
దాన రెండింటికిని గురూత్తముఁ డగును. ౧౪

రాము.—భగవతి చక్కఁగా ఆలోచించినది.

లక్ష్మ.—ఆర్య, నిజముగా విన్నవించెద. ఆయాయుపాయముల చేత ఈ శిశువులు కుశలవు లని యూహించెదను.—ఎట్లన—

క. వీరును జనిపిప్రాప్తులు। చేరినవా రిరువురును బ్రచేతసుపుత్త్రిన్;
సీరూపము గలవీరలు। బారావస్థముల వయసు పరఁగెడువారల్. ౧౫

రాము.—ఈ బాలురే వారని నేనును తేలిపోవుచున్న హృదయముతో మోహ మొందుచున్నాను.

పృథ్వి.—రాణీ పట్టీ, పాతాళమును పవిత్రము గావింపుము.

రాము.—హా ప్రియా, లోకాంతరమున కేఁగితివే!

సీత.—అమ్మా, నన్ను నీ యవయవములయందు విలయ మొందింపుము. ఇట్టి యీ జీవలోక పరివర్తమును అనుభవింప సమర్థను గాను.

రాము.—ఏ ముత్తరము చెప్పునో!

పృథ్వి — స్తన్యమును విడువఁజాలని వానియోగంబున పుత్త్రికలను కాచుకొనుము. అటుల నీయిచ్ఛ చొప్పునం గావింపుము.

భాగీ — అది సరి! [గంగా పృథ్వీ సీతలు నిష్క్రమింతురు.

రాము — ఏమి వైదేహికి విలయమే సమకూడినది! హా దేవి! దండకారణ్య వాస ప్రియ సఖి! హా చారిత్ర దేవతా! లోకాంతరమునకు తరలితివి! [మూర్ఛిల్లును.

లక్ష్మ — భగవంతుఁడా, వాల్మీకీ, కావుకావుము. ఇదియా నీకావ్యార్థము!

[నేపథ్యమున]

వాదిత్రమును తొలఁగింపుఁడు. ఓహోయి జంగమస్థావర సమేతులు ప్రాణధారులు మర్త్యామర్త్యులు, చూడుఁడు వాల్మీకి భగవంతుని చేత అనుజ్ఞాతమయిన పవిత్రాద్భుతమును!

లక్ష్మ — [చూచి]

తే. మథనమునఁబోలె గాంగ మంభంబు కలఁగెఁ,
బ్రాప్త దేవర్షికం బయ్యె నాకసంబు;
అచ్చెరువు! లేచె నార్య తోయంబునుండి
ద్యోనదీదేవి భూదేవి తోడుగాఁగ. ౧౬

[మరల నేపథ్యమున]

క. లోకార్చ్య, యోయరుంధతి, మాకుంగూర్చుము పృథివికి మందాకినికిన్;
నీకరమున నిడితి మిదే, నీకోడలి సీతఁ బుణ్యనిరతన్ సాధ్విన్. ౧౭

లక్ష్మ — ఆశ్చర్య మాశ్చర్యము! ఆర్యా చూడు చూడు. [చూచి] కట్టా, ఇంకను ఆర్యుఁడు మూర్ఛఁ దేరలేదు. [అంతట అరుంధతియు సీతయుఁ బ్రవేశింతురు.

అరుంధతి —

తే. త్వర వహింపుము! నాపట్టి త్వర వహింపు!
విడుము కాఠినతను సీత, వేగ లెమ్ము.
రమ్ము బ్రతికింపు నాపట్టి రామభద్రుఁ
బ్రియతమస్పర్శమైన నీశయముచేత. ౧౮

సీత — [సంభ్రమంబునఁ దఱిసి రాముని దాఁకుచు] ఆర్యపుత్త్రుఁడు సమాశ్వసిల్లును గాక.

రాము — [సమాశ్వసిల్లి, సానందము] ఓహో! ఏమి యిది! [చూచి హర్షాద్భుతములతో] అహో సలజ్జ దేవి! అమ్మ అరుంధతి, ఋశ్యశృంగ కాంతా సమేతులు గురువు లందఱును!

అరుం — బాలకా, ఈమె భగీరథ కృతాదేవత ప్రసన్నురాలు గంగాభగవతి.

[నేపథ్యమున]

జగత్పతీ రామభద్రుఁడా, చిత్రదర్శనమందు నన్నుఁగూర్చి నీపలికిన యీ పలుకును స్మరింపుము — ఏమనఁగా "అట్టి నీవు అమ్మా, కోడలియందు అరుంధతియుం బోలె మేలు తలంచుదానవు కమ్ము" అని. అందులకు నేను ఋణము తీర్చుకొంటిని.

అరుం — ఈమె నీ యత్తగారు భగవతి వసుంధర.

[నేపథ్యమున]

మున్ను వత్సను పరిత్యజించునప్పుడు ఆయుష్మంతుఁడు చెప్పియుండెను — ఏమన "భగవతి వసుంధరా, శ్లాఘ్యను నీ కూఁతును కాపాడుము జానకిని" అని ప్రభువయిన బాలుని యీ మాటను జరిపితిని

రాము — ఎట్టిది! మహాపరాధము కావించిన వానిని నన్ను భగవతు లిరువురును కనికరించినారు! [ప్రణమిల్లును.

అరుం — ఓహోయి పౌరజానపదులారా, ఈమె యిట్లు జాహ్నవీ వసుంధరా భగవతులచేత స్తుతయై నా చేతియందు అనఁగా అరుంధతి చేతియందు సమర్పితయైనది. పూర్వమే అగ్నిదేవుఁడు పుణ్యచారిత్రమును నిర్ణయించిన యీమెను బ్రహ్మాది దేవతలు స్తుతించిరి. అట్టి యీమెను సూర్యవంశపుం గోడలిని దేవయజనసంభవను సీతను రాముఁడు పెండియు గ్రహించుటకు మీర లేమనియెదరు?

లక్ష్మ — ఇట్లు ఆర్య అరుంధతి తెలిపి చెప్పఁగానే ప్రజలును సకలమయిన భూతగ్రామంబును ఆర్యను సీతను నమస్కరించుచున్నారు; లోకపాలురును సప్తర్షులును విరుల వానలతో పూజించుచున్నారు.

అరుం — జగత్పతీ రామభద్రుఁడా!

క. ప్రియను సహధర్మచారిణి, నియోజితనుజేయవయ్య నియమంబు బడిఁగా
బయిఁడిప్రతికృతికిఁబుణ్యా, శ్రయముం బ్రకృతిని దురంగ సవనమునందుఁగా.

సీత — [స్వగతము] ఎఱుంగు నార్యపుత్త్రుఁడు సీతాదుఃఖమును కడిగివైచుటకు.

రాము — భగవతి యాదేశించినట్లు.

లక్ష్మ — కృతార్థుఁడనైతిని.

సీత — బ్రతికితిని.

లక్ష్మ — ఆర్యా, నిర్లజ్జుఁడను లక్ష్మణుఁడను ప్రణమిల్లుచున్నాను.

సీత — బాలుఁడా, ఇట్టివాఁడవుగా చిరకాలము జీవింపుము.

అరుం — భగవంతుఁడు, వాల్మీకి, వీరిని కుశలవులను సీతాగర్భసంభవులను రామభద్రపుత్త్రులను తల్లిదండ్రులతోఁ గూర్పుము. [నిష్క్రమించును.

రామ లక్ష్మణులు — సంతోషము, అట్లే ఇది.

సీత — [సబాష్పాకూతము] ఏరీ నా పుత్త్రకులు?

[అంతట వాల్మీకియు కుశలవులును ప్రవేశింతురు]

వాల్మీకి — శిశువులారా, కుశలవులారా, ఈయన రఘుపతి, మీ నాయన; ఈయన లక్ష్మణుఁడు మీ చిన్నాయన; ఈమె సీతాదేవి మీయమ్మ. ఈయన రాజర్షి జనకుఁడు మీ మాతామహుడు.

సీత — [సహర్ష కరుణాద్భుతముగా చూచి] ఏమి నాయనయా!

కుశలవులు — హా! నాయనా! హా! అమ్మా! హా! మాతామహా!

రామ — [సహర్షము ఆలింగించి] ఓయి నిఱుఁగులారా, పుణ్యాన దొరకితిరి.

సీత — నా పట్టీ కుశా, నా పట్టీ లవా; ఇరువురు నొక్కమ్మడి నన్ను జన్మాంతరగతను చిరము కౌఁగిలింపుఁడు.

కుశలవులు — [అట్లు చేసి] ధన్యులమైతిమి.

సీత — భగవానుఁడా, ప్రణమిల్లుచున్నాను.

వాల్మీ — పట్టీ, ఇట్టి దానవే చిర ముండుము.

సీత — అహో! నాయన, కులగురువు ఆర్యాజనము సభర్తృక శాంతాదేవి లక్ష్మణునితోడ సుప్రసన్నులు ఆర్యపుత్త్రులవారు, కుశ లవులును గూడ కనఁబడుచున్నారు! ఈ యానందముచేత పరవశ నగుచున్నాను.

[నేపథ్యమున కలకలము]

వాల్మీ — [లేచి చూచి] లవణుని ఉన్మూలించి మధురానాథుఁడు వచ్చినాఁడు.

లక్ష్మ — కల్యాణములు సానుబంధములు.

రామ — ఇదంతయు అనుభవించుచునే నమ్మకున్నాను. అట్లు గాదు, ఇదే అభ్యుదయముల స్వభావము.

వాల్మీ — రామభద్రుఁడా, నీ కింకను ఏమి ప్రియమును గావింతును?

రామ — ఇంతకన్నను ప్రియ మొకటి యుండునా? అయిన నిది యగుఁగాక.

శా. గంగాలక్ష్ములు వోలె నీకథ జగత్కల్యాణ మై కాంత మై,
త్రుంగంజేపి యఘంబు శ్రేయములసందోహంబుఁ బొందించుతన్;
రంగత్ప్రాజ్ఞక వాక్చతుర్ముఖ కవిప్రష్ఠోక్తి నీసత్కృతిన్
రంగంబందు బుధవ్రజం బభినయారాద్ధన్ విభావించుతన్. ౨౦

[అందఱు నిష్క్రమింతురు.

సమ్మేళనమను సప్తమాంకము సమాప్తము

ఉత్తరరామచరిత నాటకము సమాప్తము.

# పద్య సూచిక

## పద్య సూచిక

# వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్

**4, మల్లికేశ్వరస్వామిగుడిసందు, లింగిసెట్టివీధి, మద్రాస్ - 1**

ఆర్డరుతో కూడ సగము సొమ్ము అడ్వాన్సు పంపవలెను.
ప్యాకింగు, తపాలుచార్జీలు వేరు. పూర్తి వి. పి. పద్ధతి లేదు.

## సంస్కృత గ్రంథములు

| | |
|---|---|
| అభిజ్ఞానశాకుంతల నాటకము, శ్రీమాన్ వేలటూరు రామదాస అయ్యంగార్ గారి తెలుగు వ్యాఖ్యానముతో | (అచ్చులో) |
| రఘువంశము, సటీక మొదటి 3 సర్గలు 4 00; సర్గలు 4. 5, 6. | 4 00 |
| మేఘసందేశము, మల్లినాథ వ్యాఖ్య, తెలుగు టీకాతాత్పర్యాదులు | 8 00 |
| కుమారసంభవము, మొదటి 6 సర్గలు, టీకాతాత్పర్యాదులు | (అచ్చులో) |
| అమరుకావ్యము, వేమభూపాలవ్యాఖ్య, సంపూర్ణాంధ్రటీక. | 3 00 |
| రసమంజరి, శృంగారరసస్వరూపము, సటీక క్రొత్త యచ్చు | 3 00 |
| పంచతంత్రము, మూలము మాత్రము. | (అచ్చులో) |
| దశకుమార చరిత్రము, మూలముమాత్రము (పాతప్రతి) | 2 00 |
| ,, ఆంధ్రానువాదము ( ,, ) | 2 00 |

## ఆంధ్ర పద్య కావ్యములు

| | |
|---|---|
| ఆముక్తమాల్యద, సంజీవనీవ్యాఖ్యతో, ద్వితీయముద్రణము | 36 00 |
| శృంగారనైషధము, సర్వంకషవ్యాఖ్య, తృతీయముద్రణము. | [అచ్చులో] |
| జ్ఞానవాసిష్ఠ రామాయణము, [వేదాంతము] మడికి సింగనకవి | 3 00 |
| ఆంధ్రబిల్హణీయము [పాతప్రతి] మూలము మాత్రము | 1 00 |
| కేయూరబాహుచరిత్రము, మంచనకవి, ఆఱువేల వెలనాటి చరిత్రతో | 4 00 |

## లక్షణ గ్రంథములు

| | |
|---|---|
| కావ్యాలంకారచూడామణి, ఉపోద్ఘాతముతో | 5 C0 |
| ఆంధ్రసాహిత్యదర్పణము, 1—5 పరిచ్ఛేదములు 1 భాగము | 4 00 |
| అలంకారసారసంగ్రహము, అర్థాలంకారములు టీకాతాత్పర్యముతో | 1 00 |
| ఛందస్సు, సులువు సంగ్రహము, విద్యార్థుల కుపయోగకరము | 0 50 |

## నాటకములు

| | | | |
|---|---|---|---|
| ప్రతాపరుద్రీయము | (అచ్చులో) | ఆంధ్రాభిజ్ఞానశాకుంతలము | 4 00 |
| ఉషానాటకము | 2 00 | ప్రియదర్శికా నాటిక | (అచ్చులో) |
| బొబ్బిలియుద్ధనాటకము | 4 00 | నాగానందనాటకము | 2 50 |
| విక్రమోర్వశీయము | [అచ్చులో] | రత్నావళీ నాటిక | (అచ్చులో) |
| మాళవికాగ్నిమిత్రము | 8 00 | ఉత్తరరామచరిత్రము | 5 00 |

| | | |
|---|---|---|
| శ్రీకృష్ణరాయ విజయ నాటకము | 0 | 50 |
| వ్యామోహము, సాంఘిక వినోదనాటిక | 2 | 00 |
| తానీషా నాటకము [గోలకొండ పతనము] | 1 | 00 |

## విమర్శలు — ఉపన్యాసములు

| | | |
|---|---|---|
| నన్నెచోడుని కవిత్వము, వాఙ్మయచారిత్రక విమర్శలతో | 6 | 00 |
| గ్రామ్యభాషాప్రయోగ నిబంధనము, [నాటకపాత్రోచిత భాష] | 1 | 00 |
| ఆంధ్రవ్యాకరణ సర్వస్వతత్త్వము (శారదాకాంచిక) | 1 | 00 |
| తిక్కనసోమయాజి విజయము, జీవిత చరిత్ర విమర్శ | 0 | 50 |
| భారతాభారత రూపకమర్యాదలు [భరతనాట్యకళా చరిత్ర] | 0 | 50 |
| ఆంధ్రగ్రంథవిమర్శనప్రకారలేశము [విమర్శనపద్ధతిని గురించినది] | 0 | 50 |
| గ్రామ్యాక్షేపనిరసనము. గ్రామ్యగ్రాంథిక వాదములది | 0 | 50 |
| విసంధివివేకము [సంధిని విడదీసి వ్రాయవచ్చుననుటను గూర్చినది] | 0 | 25 |
| స్త్రీపునర్వివాహ గ్రంథము [ఖండనము] | 1 | 00 |
| ఆంధ్రభాషాసర్వస్వార్థ నియమకతిపయములు (నిఘంటు రచన) | 0 | 25 |

## కథలు — చరిత్రలు

| | | |
|---|---|---|
| కథాసరిత్సాగరము, 6 భాగములు పూర్తి సెట్టుగా | 30 | 00 |
| ఒక్కొక్క భాగము ప్రత్యేకముగా | 5 | 00 |
| భోజకాళిదాసుల కథలు | 1 | 00 |
| విక్రమార్కుని యద్భుత కథలు | 1 | 00 |
| ఉదయన చరిత్రము | 1 | 00 |
| సంగ్రహకథాసరిత్సాగరము | 1 | 50 |
| ఆంధ్రహితోపదేశ చంపువు | 2 | 00 |
| పద్యకథాహారి | 1 | 00 |
| అక్కన్నమాదన్నల (తానీషా మంత్రులు) చరిత్ర | 2 | 00 |
| వేంకటరాయశాస్త్రిగారి జీవితచరిత్ర సంగ్రహము. | 2 | 00 |

## డాక్టరు. నేలటూరి వేంకటరమణయ్యగారి గ్రంథములు

| | | |
|---|---|---|
| THE EASTERN CHALUKYAS OF VENGI | 15 | 00 |
| KAMPILI & VIJAYANAGARA | 2 | 00 |
| చరిత్రరచన-ఇతర వ్యాసములు( మొదలైన చారిత్రక వ్యాసములు) | 8 | 00 |
| పల్లవులు - చాళుక్యులు - చారిత్రక వ్యాసములు - శాసనములతో | 16 | 00 |
| మధుమావతి ( మొదలైన నాలుగుకథలు చరిత్రాత్మకములు) | 2 | 00 |
| దక్షిణాంధ్ర (తంజావూరు) వాఙ్మయచరిత్రము | 8 | 00 |
| అర్థానుస్వారతత్త్వము శేషగిరి శాస్త్రిగారిది | 0 | 75 |
| [illegible]లాలజీ (ఆంధ్ర శబ్దతత్త్వము.) 2 భాగములు, డిటో | (అచ్చులో) | |
| [illegible]లహరి, చదలువాడ జయరామశాస్త్రిగారి వివరణముతో | 20 | 00 |
| శ్రీమద్భాగవతము, దశమస్కంధము, పూర్వభాగము, చ-జయరామశాస్త్రిగారి టీక, పోతన పద్యములతో | 40 | 00 |



వేదం ప్రింటర్సు, మద్రాసు-1

